


శ్రీ గాయత్రీ ఫిలిమ్సు వారి

# శ్రీ కృష్ణ కుచేల

నిర్మాత - దర్శకుడు

చిత్రపు నారాయణమూర్తి B.A.



వాహినీ విడుదల

BAKTHA

# ఉత్తరాలు

## అమర కవిరవీంద్రుడు

అమర కవి రవీంద్రనాధునిగురించి వ్రాసిన వ్యాసము ఎంతో హృదయరంజకంగా ఉన్నది వ్యాస రచయిత శ్రీ గణపతిశాస్త్రిగారికి మా అభినంద నలు తెలుపగోరుచున్నాను

శ్రీమతి బి. వి. హెచ్. రెడ్డి (కదిరి)

*  *  *

రవీంద్రునిగురించి శ్రీ. గణపతిశాస్త్రిగారు చాలా బాగుగా వ్రాసినారు. వారికి నా ధన్యవాదాలు.

బి. నరసింహారావు (విశాఖపట్టణము)

*  *  *

## కథ కాని కథ

కథకానికథగా ప్రచురించిన "కృష్ణతులాభారం" చాలా బావుంది అది తలచుకొన్నప్పుడంతా కడుపుబ్బ నవ్వలేక చస్తున్నాం.

హెచ్. ఉమారెడ్డి (బెంగుళూరు)

*  *  *

ఆంధ్ర పత్రిక నిర్వహిస్తున్న పోటీలు బహు మతులు చూస్తుంటే ఒక ప్రక్క సంతోషము మరి ఒకవైపు దుఃఖము కలుగుతున్నాయి. కథగానికథకు వారం తప్పించి వారం మువ్వంయి రూపాయలు ధార పోస్తున్నారు నా జబ్బే పోతున్నట్లు బాధపడు తున్నాను.

డి సోమనాథ్ (అనకాపల్లి)

*  *  *

## విడాకులు

శ్రీ పి గణపతిశాస్త్రిగారు "విడాకులు: మన సమాజం" అను వ్యాసములో పరాశరస్మృతి లోని ఒక శ్లోకమును ఉదాహరించి, వివాహ విచ్ఛేద నమున్యను ప్రత్యక్షంగా చర్చించకపోయినా ఆ శ్లోక ము పరోక్షంగా అంగీకరిస్తున్నట్లున్నదన్నారు.

ఈవిధంగా పరోక్షంగా అంగీకరించడం అంతకు పూర్వపు న్యాయశాస్త్రములలో ఉన్నట్లు, శ్రీమతి శంకుతలరావుగారు "(Women In sacred Laws") అను గ్రంథములో వివరించి ఉన్నారు.

గౌతము ధర్మ సూత్రములు :—ఈ గ్రంథము క్రీ పూ. 700 నాటిదని రచయిత్రి వ్రాశారు. దీని ప్రకారం, భర్త అదృశ్యుడై, పరారీ అయితే, వాని భార్య ఆరు సంవత్సరములు ఎదురుచూసి, ఆ తర్వాత వివాహము చేసికొనవచ్చును.

కౌద్దాయనుని "గృహ్య సూత్రములు" :— దీనిలో వివాహవిచ్ఛేదన కారణములు కొంచెం కొత్తగా కనుపిస్తాయి. దీని ప్రకారం భర్త— గొడ్రాలగు భార్యను 10 సంవత్సరములలోను, పుత్రికలనే ప్రసవించు భార్యను 12 వ సంవత్స రములోను, పుట్టిన పిల్లలందరు చనిపోయిన భార్యను 15 సంవత్సరములలోను, గయ్యాళిగంప అగు భార్యను తక్షణమే—విడువవచ్చును.

ఆపస్తంబుని "కల్ప సూత్రములు" (క్రీ పూ. 300) ఈ సూత్రములలో చెప్పినట్లు, తనవంతు వైదిక కర్మకాండకు విఘ్నకారకురాలైన భార్యను, పుత్రు లను ఉత్పత్తి చేయని భార్యను—భర్త విసర్జించ వచ్చును. అట్లుకానిచో, పురుషుడు రెండవ వివా హము చేసికొనకూడదు.

పరోక్షంగా ఒక పరాశరస్మృతేకాక నారద, దేవల స్మృతులు విడాకులను సమర్థించినట్లు రచయిత్రి తెల్పియున్నారు.

అమలాపురం వెంకటరావు (మద్రాసు—18.)

*  *  *

## దేవిక బొమ్మలు

దేవికగారి బొమ్మలు చాల అందముగానూ, విపులంగానూ ఉన్నవి సినిమా తార దేవిక ఈ బొమ్మలు వేయుచున్న దేవిక ఒకరేనా?

వీలూరి వీరరాఘవరావ్ (గోపన్నపాలెం)

కాదు.

*  *  *

## బాల సాహితి

'యుక్తి' అనే కథలో తిమ్మరుసు కృష్ణదేవ రాయలను చెప్పుతో కొట్టినట్లు వ్రాశారు. అది చాల అసభ్యంగా, వుంది.

ఎస్. రామచంద్రయ్య (కె కొత్తపేట)

*  *  *

"వింతదొంగ" కథ చాలా బాగున్నది. వింత దొంగ పనులు పిల్లలకు చాలావింతగా ఉన్నాయి రచయిత శ్రీ పప్పు బాబ్జిగారికి నా అభినందనములు.

టి. గిరినాథ్ (నంద్యాల)

*  *  *

## కథలు

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారు వ్రాసిన "భ్రష్టయోగి" కథ బాగానే ఉంది. కాని నాకు ఒక్క సందేహం. మా భూగోళంలో (10 వ తరగతి) "సప్త ర్షి మండలము ఉత్తరమున కానవచ్చును" అని ఉంది. కాని రామయ్యగారు తూర్పున అని వ్రాశారు దీని భావమేమి?

జగ్గం విఠల్‌రావు (కొత్తగూడెము)

*  *  *

పత్రికలోని కథలు అద్భుతంగా ఉంటున్నాయి. ముఖ్యంగా "ప్రణయావేశం" కథ చాలా బాగుంది. విషాదాంతమవుతుందా అన్నట్లు వ్రాసి ఒక్క నిము షంలో సుఖాంతము చేశారు రచయిత. వారికి పత్రిక ద్వారా నా అభినందనలు తెలియ చేస్తున్నాను.

సింహాద్రి కృష్ణమూర్తి (కర్నూలు)

*  *  *

"ప్రణయావేశం" కథ చాల బాగుంది. కొం దరు వ్యక్తులు ఎదుటివారు మాట్లాడే మాటల అర్థాన్ని తెలుసుకోలేక వారిని అపార్థం చేసుకొని తమ మనస్సులో బాధ పెట్టుకోవటమే కాకుండా ఇతరులను కూడా బాధ పెడతారనే భావాన్ని రచ యిత ఈ కథ ద్వారా తెలియజేశారు. వారికి నా అభినందనలు.

పాకు సత్యనారాయణ (కర్నూలు)

*  *  *

"ప్రణయావేశం" కథ నాగపూరు ఆంధ్ర మహాజనులకొక దివ్య కానుక పుష్టిగల్గిన కథా వస్తు వుతో నాగపూరు పరిసర ప్రాంతాలను సహజంగా చిత్రించి నాగపూరాంధ్రుల కందించినందులకు కథా రచయిత శ్రీ రంగధాం గారికి పత్రిక ద్వారా నమస్కృతులు.

దేవేంద్ర రామకృష్ణారావు (నాగపూరు—2)

*  *  *

"తూరుపు కొండలు" కథ 'పట్నాల్లో పెద్ద చదువులు చదివి, పల్లెలకుపోయి సంఘసేవ చెద్దా మని ఉబలాటపడే నేటి నవీన యువకుల కళ్ళు తెరి పించేదిగావుంది. ఆశయాలు పేరిట నేటి యువ కులు పెట్టే అరుపులు, వ్యర్థములు. పల్లెవాతావరణం మిక్కిలి ప్రమాదకరమని రచయిత చక్కగా బోధపరిచాడు.

పోలంరాజు రాధాకృష్ణమూర్తి (గుంటూరు)

*  *  *

"తూరుపు కొండలు" కథలో పల్లెపట్టు వాతా వరణం యథాతథంగా చిత్రించి శ్రీ "సింగరాజు రామచంద్రరావుగారు" కథారచనలో సిద్ధహస్తులని మరొకసారి నిరూపించుకొన్నారు. వీరు వ్రాసే ప్రతి కథ హృదయానికి హత్తుకొనేదిగా ఉంటుంది

కె. హృషీకేశరావు (బందరు) ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపాదకుడు:
శి. రాధాకృష్ణ

★

సంపుటము 55
సంచిక 37

24-5-61
బుధవారం

ప్లవ సం॥ అధిక జ్యేష్ఠ శుద్ధ నవమి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
[illegible]
"మదనమంజరి"లో [illegible]


కథలు:

| | | |
|---|---|---|
| ప్రియబాంధవి | — | 3 |
| ఆడపడుచు కట్నం | — | 16 |
| యాదృచ్ఛికం | — | 24 |
| మునరికం | — | 32 |

వ్యాసాలు:

| | | |
|---|---|---|
| చుట్టరికాలు | — | 19 |
| ఆడవారూ-అంగళ్లూ | — | 21 |
| మోతీలాల్ నెహ్రూ | — | 23 |
| కేబులూ-గుండీలూ | — | 28 |

శీర్షికలు:

| | | |
|---|---|---|
| ఉత్తరాలు | — | 3 |
| ఈ వారం కార్టూన్ | — | 6 |
| న్యూఢిల్లీ లేఖ | — | 7 |
| మనమూ-మన దేహస్థితి | — | 15 |
| రాశిఫలాలు | — | 30 |
| వనితావాణి | — | 47 |
| సినిమా | — | 48 |
| గళ్ళనుడికట్టు | — | 63 |

సీరియల్ కథ:

| | | |
|---|---|---|
| 80 రోజుల్లో భూప్రదక్షిణం | — | 36 |

బాలసాహితి:

| | | |
|---|---|---|
| వీరన్న-వెంకన్న | — | 40 |

గేయాలు:

| | | |
|---|---|---|
| విద్యార్థికి సూక్తులు | — | 41 |
| విరహిణి - విరజాజి | — | 43 |


"హరివంశం", "ఎప్పుడూ - ఇంతే కార్టూను" సకాలంలో చేరకపోయినందువల్ల ఈ వారం ప్రచురించలేకపోయినాము.

ఇప్పుడు నేనూ మాట్లాడవచ్చు!

కనీస వేతనాలు

వ్యవసాయకూలీ

ధరలను గూర్చి సమాచారం అందజెయ్యమని కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ ఉపసంఘం ఆర్థిక వ్యవహారాల శాఖను కోరింది

అధిక ధరలు

ప్రజలు





ఇటీవల ఢిల్లీ రోషనార క్లబ్‌లో డేవిస్ కప్‌ల తూర్పుమండలం టెన్నిస్ ఫైనల్ పోటీకి హాజరైనారు.
ఎడమనుంచి: శ్రీ ఆర్. కృష్ణన్, సర్దార్ సుర్జిత్‌సింగ్, శ్రీమతి సింగ్, మొదలైనవారు.

**న్యూఢిల్లీ లేఖ** — **శ్రీకృష్ణ**

# కాంగ్రెసు 'ముద్ర' ప్రజాస్వామ్యంలో ఢీగాలితం: ఉపనాయకుని ఎన్నిక కాయిదా ఔదార్యం

కాంగ్రెసుపక్ష ఉపనాయకుని ఎన్నికల్లో చెలరేగిన అభిప్రాయభేదం, ఈ వారం న్యూఢిల్లీ ప్రజల ఉబుసుపోకకు చక్కని సాధనమైంది. అంతేగాదు. కాంగ్రెసు 'ముద్ర' లో ఉన్న ప్రజాస్వామ్యం ఢీగాలితం వస్తువులాగా ఏవిధంగా మలచబడుతున్నది తెలిసింది.

కొన్ని పుటాలు ఒకసారి సింహావలోకనం చేద్దాం. స్వర్గీయ పండిత పంత్ లోగడ కాంగ్రెసు పక్షానికి ఉపనాయకులుగా ఉండేవారు. దైవ దుర్విపాకంవల్ల వారు మరణించకపోతే ఇంకా కొన్నాళ్ళ ఉపనాయకుడుగా ఉండేవారు. ఇదిట్లు సమావేశం ఆఖరయ్యే రోజుల్లో కాంగ్రెసు పార్లమెంటరీ కార్యనిర్వాహకవర్గ ఎన్నికలు జరపటం ఒక రివాజుగా ఉండేది. గత సంవత్సరం రక్షణ మంత్రి శ్రీ కృష్ణమీనన్‌కు డా. రామ్ సుభాగ్ సింగ్‌తో బలాబలాలు తేల్చుకోటంతో ఒక చిన్న 'వాటర్లూ' యుద్ధం లాంటి ప్రమాదం సంభవించింది. శ్రీ మీనన్ తన అభ్యర్థి ఎన్నుకోవటంలో లోపాలుండటమే దీనికి కారణం. ఆయన మశిలావయ్యర్‌ను డా. రామ్‌సుభాగ్‌సింగ్‌తో పోటీకి నిలబెట్టారు. అయితే డా. రామ్‌సుభాగ్‌సింగ్‌కు ఉన్న కార్యదీక్షదక్షతలు మద్దతును సంపాదించి పెట్టాయి. అందువల్ల ఆయనది పైచెయ్యి అయింది.

ఈ సంవత్సరం మళ్ళీ శ్రీ కృష్ణమీనన్ జోలి తాలే లేదు. 1960 మొదటి రోజుల్లో శ్రీ జగజీవనరామ్‌తో మన రక్షణ మంత్రికి మహా పోరు తప్పర కల్పించింది. పైగా జగజీవన్‌రామ్‌కు రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్ బలం కూడా ఉంది.

నిజానికి ఈ జగజీవన్‌రాం పేరు రాష్ట్రపతి భవనంనుంచే పుట్టుకొచ్చింది. ఆ వెంటనే రక్షణ మంత్రి, జగజీవన్‌రాం ఏదో ఒకటి, రెండు విందులు చేసుకున్నారు. రాజకీయవాదుల బొజ్జలు దేశభక్తి పూరిత ఆకాంక్షకు నిదర్శనాలుగా (దృఢంగా) ఉండాలన్న భావంతో జరిగిఉండొచ్చు.

ఇక ప్రతిపక్షి మొరార్జీవారు. ఆయన కూడా తన అవకాశాలను సరిగ్గా వినియోగించుకోలేదు. ఎప్పుడో అరుదుగా ఆయన తమ నియోజకవర్గాలను వెనుకవేసుకొస్తూ, లాబీలో గాని, మధ్య హాల్లో గాని కనబడేవారు. మరి స్వర్గీయులు సర్దార్ పటేల్, పండిత పంతులు తమ నియోజకవర్గాలను పెంచుకుంటున్నారా అని మీ అడగొద్దు. అసలా తీర పోయేవేలని నా సమాధానం. ప్రధాన మంత్రి కూడా ఈ తలపోతలే లేవి. కాని, బహిరంగంగా పోటీ జరిగినట్టయితే మొరార్జీకి ఇంత ఇబ్బంది ఉండేదికాదు. ఉత్తరప్రదేశ్ ఓట్లు కూడా చీలి ఎక్కువభాగం మొరార్జీకే వచ్చాయి. అధికి పెద్దాళ్ళు కులాలవారి ఓట్లలో కూడా కనీసం 40% మొరార్జీకే అనుకూలంగా వచ్చాయని పరిశీలనవల్ల తెలుస్తోంది.

పురిట్లోనే సంధికొట్టిన ఈ ఎన్నికకు ఇంతకన్న దారుణాఘాతం ఒకటి జరిగింది. రామేదో పెద్దవాళ్ల మవుదామనుకున్న మొరార్జీ, జగజీవన్ రామ్‌లు వ్యక్తిగత విషయాల పునాదుల్లో ఉన్న బలహీనతను ప్రదర్శించుకోటమే ఈ ఆఘాతం.

ఒక్క మాటలో చెప్పాలంటే, వీళ్లిద్దరు ఒక లొ్నకరు మింగుకున్నారు. ఇద్దర్నీ శ్రీ నెహ్రూ మింగేశారు.

ఈమాట మీకు అర్థంకాక వివరణ అవసరం కావచ్చు. మోటుగా చెప్పుకోవాలంటే తనకు శక్తి

(62-వ పేజీ చూడండి)




ధురాంతకం రాజారాం

టంగుటంగున గంట మ్రోగగానే టెంగు టెంగున దూకుతూ కుర్రాళ్ళు బయటికి వెళ్ళి పోయారు. మొదటి రెండు పీరియడ్లూ మూడు నాలుగు తరగతులకు పాఠం చెప్పడంవల్ల, సత్యమూర్తి నాలుక పిడచగట్టుక పోయింది. తల్లితో సహా సత్యమూర్తి కాపుర ముంటున్న యిల్లు పాఠశాలకు కూతవేటుదూరంలోనే ఉంది. కత్తి వాదరలా మిడిసిపడుతున్న ఉదయకాలపు యెండలో మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ వచ్చి 'కాసిన్ని మంచినీళ్ళిస్తావా, అమ్మా' అంటూ మూడంకణాల పూరింటి అరుగుపైన కూలబడిపోయాడు సత్యమూర్తి.

తడిలో గ్లాసు మునుగుతున్న సవ్వడైతే వినిపించింది సత్యమూర్తికి. ఓ క్షణానికో క్షణం ముసలావిడ ఈవలికి రావచ్చుననే అనుకుంటున్నాడు సత్యమూర్తి. అతడలా వేచివుండగానే ఒకటి, రెండు నిమిషాలు గడిచిపోయాయి.

విస్మయంతో వెనుదిరిగి ద్వారంవైపు చూచాడు సత్యమూర్తి.

చూచిన క్షణంలో గుండె జల్లుమనగా కూర్చున్న వాడు కూర్చున్నట్లుగానే కొయ్యబారిపోయాడు సత్యమూర్తి.

ఆ దృశ్యం అలాంటిది!

శృంగారభావాన్ని పెల్లుబకనీయని సిగ్గులా, ఆకులమాటున అణగిమణగివున్న పువ్వుగుచ్ఛంలా తాను మాత్రం చూపుకు ఆనకుండా లోపలనిల్చుని, నీళ్ల గ్లాసును ఈవలి కందిస్తున్న ఆ అమ్మాయి ఎవరో సత్యమూర్తికి తెలుసు.

ఆమె పేరు పంకజం!

ఎక్కడో కొండ కొలనులో వికసిస్తుంది పంకజం! అది అందాలకు నెలవే ఆనందాలకు మందిరమే! కానీ ఒడ్డున కాలు మోపగానే బుడుంగున లోపలికి ఆహరించి వేసేవూబి సంగతేమిటి? ఒకవేళ వూబిని ఉత్తరించినా కబంధహస్తాలు దాచుకున్న నాచుమాటేమిటి? వీలిరంగు సిరాలాంటి చిక్కని నీటిలో మొసళ్ళు తిరగడం లేదన్న నమ్మక మేమిటి?— అందుకే ఒళ్లెరుగని శివం పనికిరా వనుకుంటాడు సత్యమూర్తి!



పంకజమంటే సత్యమూర్తికి భయం !

కానీ ఆ భయంలో ఒక మైమరువు లేక పోలేదు

పంకజంయొక్క ఆకర్షణ అలాంటిది. అది హృదయాన్ని విహ్వాలంచేసిపారవేస్తుంది. కొండ కొమ్ములోనుంచీ కొలనులో దూకి పంకజాన్ని కోసుకోకపోతే ఊపిరి నిలిచిపోతుం దనిపిస్తుంది ఎప్పటికప్పుడు—ఇదిగో దూకబోతున్నావు దూకే స్తున్నావు—అంటూ తన మనసే తనను వేగిరింప చూస్తుంది పదిమందిలో మూర్తీభవించిన వైరాగ్యంలా మసలుకోవడం సులభమే ! కానీ మనను లోపలి ఈ ఆకర్షణను అధిగమించడం దుస్తరం

ఎందుకు అధిగమించాలి—అంటూ మనను లోపలి మనసు సత్యమూర్తికి ఎదురుతిరగడం కూడా కద్దు

అందు కొక "రెడీమేడ్" సమాధానం ఉండనే ఉంది—పనికిరాదు పనికిరాదు ఒళ్లెరుగని శివం పనికిరాదు

సత్యమూర్తి ఆలోచనలు సత్యమూర్తివి కానీ లోపల ఎంతసేపని విగ్రహంలా నిల్చోగలుగుతుంది పంకజం ! నిల్చున్న తీరులో కదలిక కలిగిందేమో, ఆమె చేతిలోని గాజులు కూడా కదిలాయి.

ఆ కదిలిన గాజులు—హోయీ అర్భకుడా ! అందు కోవయ్యా గ్లాసు—అంటూ తనను ఎగతాళి పట్టిస్తున్నట్టున్నాయి

సత్యమూర్తి గ్లాసు చేతికితీసుకున్నాడు. రెండు గుక్కల్లో గ్లాసును ఖాళీ చేసేశాడు

చక్కెర దిని చేదనగూడదు

చందమామను చూచి కళ్లు మూసుకో గూడదు.

అందుకే, ఎంతగా తన కిష్టం లేకపోయినా 'పీళ్లు చాలా తియ్యగా ఉన్నాయి' అంటూ సత్య మూర్తి ఓ కాంప్లిమెంటు సమర్పించుకున్నాడు

ఇంటర్వెల్‌పూర్తి కావచ్చిందేమో, ఎవరో కుర్రాడు అయ్యవారు లేకపోవడం చూచి ఎడతెగ కుండా గంట మోగించేస్తున్నాడు

ఆ ఘంటారావం సత్యమూర్తికి తనపైన గెలుపుసాధించిన ఏదో ఒక మహత్తర శక్తి యొక్క విజయగర్వానికి సంకేతంలా వినిపిస్తోంది

సత్యమూర్తి పైకి లేచాడు నాలు గడుగులు ముందుకు వేశాడు అయిదో అడుగు వేయ బోతూ ద్వారంవైపు చూచాడు

ఆనందం లాస్యమాడుతున్న వినీల లోచనాలతో, మంచులో తడిసి నీరెండలో నిగ్గులు దిద్దు కుంటున్న గులాబీ పువ్వులాంటి ముఖ మండలంతో, ముద్ద మందారంలాంటి పెదవిపైన విద్యుద్దీపం లాంటి లేనగవుతో క్షణంలో సగంసేపు మాత్రమే కనిపించింది పంకజం ఆ తరువాత మబ్బులో మాయమైపోతున్న మెరపుతీగలా తలుపుచాటుకు జారిపోయింది.

'భగవంతుడా ! ఏమిటీ పరీక్ష ?' అనుకుంటూ సత్యమూర్తి గాబరా పడిపోయాడు.

అడివిపాలెం వచ్చి ఉద్యోగజీవితం ప్రారంభిం చిన కొత్తలో ఒకానొక శుక్రవారంనాటి ఉదయం సత్యమూర్తి మొదటిసారిగా పంకజాన్ని చూచాడు

ఎందుకోగాని ఆరోజు పాఠశాలకు సెలవు అరుగుపైన పడుకుని సత్యమూర్తి ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు హృదయాన్ని స్పృశించే మధురమైన భావం ఎదురైనప్పుడల్లా పుస్తకం మూసిపెట్టి ఆకాశంవైపు చూడడం సత్య మూర్తి అలవాటు తన అలవాటు ప్రకారం అత డొకసారి ఆకాశంలోకి చూచాడో లేదో హఠా త్తుగా ప్రత్యక్షమైంది పంకజం

ఎట్టఎదుట రెండంతస్థుల మేడ మేడపైన డాబా డాబాపైన పిట్టగోడ కానుకొని శిరో జాల చిక్కు విడదీసుకుంటూ ఉంది పంకజం.

అవి చలికాలపు రోజులు. పైగా ఆనాడు నల్లటి మబ్బులు గుడారం వేసుకుని లోకాన్ని రేత్రి జరేటరుగా చేసిపెట్టాయి ఎంతసేపటికీ కురులు ఆరలేదేమో, చక్కా డాబాపైకి వచ్చింది పంకజం మబ్బుల వెనుక జాము ప్రొద్దెక్కినా ఆడవిలో యింకా ఈదరగాలి వినవినలాడుతోంది. పంకజం గాలి కెదురుగా నిల్చుంది దుందుడుకుతనం పిల్ల తెమ్మెరల సొత్తు అవి అవకాశం దొరకగానే పంక జంతో సరాగాలు ప్రారంభించేశాయి !

కళ్లు మూసుకున్నాడు సత్యమూర్తి మూసిన కళ్లు తెరవకుండా తటాలున పైకి లేచి, గబా లున యింటిలోపలికి వెళ్లి తలుపుమూసి గడియ వేసుకున్నాడు.

"ఆదేమిట్రా సత్యం ! సాగ బయటికి పోకుండా తలుపు మూసేస్తున్నా వెందుకూ ?" విస్తుపోతూ అడిగింది పార్వతమ్మ

"నీకు తెలియదులేవే అమ్మా ! ఊరుకో, ఊరుకో" అన్నారు సత్యమూర్తి

తనేమో ఉద్యోగిగా ఈ వూరికి వచ్చాడు. వచ్చినవాడు ఎలాగైతే వచ్చాడో అలాగే తిరిగి వెళ్లి పోవడం శ్రేయస్కరం ఉడుముకు వూళ్లో పెత్త నాలు క్షేమాన్ని చేకూర్చవు అదీగాక నూరేళ్ల ప్రణాళికగా తాను రూపొందించుకుంటున్న ఆదర్శ జీవితంలో తుచ్ఛమైన లోలు సత్యాలకు తావులేదు

అంతవరకు బాగానే ఉంది ! కానీ డాబాపైన కనిపించినట్టే కనిపించి, అలాగే కదిలివచ్చి కను పాపల్లోనే కాపురం పెట్టుకున్న ఆ ప్రతిబింబాన్ని ఎలా చెరిపివేయగలడు సత్యమూర్తి ?

నాలుగు రోజుల తర్వాత ఓ రోజు మధ్యాహ్నం బడి విడిచిపెట్టి యింటికి తిరిగివచ్చాడు సత్య మూర్తి పెట్టెలో ఉండవలసిన తన పుస్తకాలు బయటపడి ఉన్నాయి దీగుడులో ఉంచిన పుస్త



కాలు పెట్టెలోకి వచ్చేశాయి. "ఇదేమిటమ్మా ఈ గల్లంతు' అంటూ తల్లివైపు చూచాడు సత్య మూర్తి

"ఆ అమ్మాయిరా సత్యం ! నీ పుస్తకాలన్నీ గాలించేసింది. మళ్లీ తీసుకొస్తానని చెప్పి నాలు గైదు పుస్తకాలు తానే తీసుకెళ్లింది."

పుస్తకాలమాట దేవు డెరుగు ! — మనసును కలచివేయకపోతే తనకంతే చాలు ననుకున్నాడు సత్యమూర్తి

మళ్లీ నాలుగు రోజులు గడిచిపోయాయి. మధ్యాహ్నం భోజనానికి కూర్చున్నాడు సత్యమూర్తి. తాలింపు అన్న పేరుతో ఎంచినట్టుగా నాలుగు చిక్కుడుకాయలు వడ్డించింది పార్వతమ్మ

"ఇదేమిటమ్మా, యింత కొంచెం గానా చేయడం ?" అన్నాడు సత్యమూర్తి.

"నేనేమో గిన్నె నిండుకూ వేశానురా సత్యం! బాగున్నాయని చెప్పి ఆ అమ్మాయి గిన్నె ముందు పెట్టుకుని కూర్చుంది. అప్పటికీ నయం! దేవుడి ప్రసాదంలా నీకు నాలుగు కాయలు మిగిలించింది" నిండుగా, నిర్మలంగా నవ్వుతోంది పార్వతమ్మ.

"నవ్వింది చాల్లేవే అమ్మా! కావలిస్తే తాలింపు మాత్రమే గాదు. కూరా, చారూ, అన్నం అంతా కలిపి కొట్టేసినా నా కభ్యంతరం లేదు. ఆమాత్రం శిక్షతో ఆవిడ మనల్ని వదిలిపెడితే చాలు" అన్నాడు సత్యమూర్తి.

పార్వతమ్మకు అర్థం కావడంలేదు. తన కర్థం కానప్పుడల్లా, బహుశా అవన్నీ కొడుకు పుస్తకాల్లో నేర్చుకున్నమాటలేమోనని వూరుకోడం పార్వతమ్మ స్వభావం!

పుస్తకాలకు భద్రం లేదు. తాలింపు తన దాకా రాదు! అయినా ఫరవాలేదు లెమ్మను కున్నాడు సత్యమూర్తి. ఏం ఫరవాలేదు!! ఆవిడ యింకా యింకా తన జీవితంలోకి చొచ్చుకుని వచ్చేస్తుంది.

వచ్చేసింది కూడా!

తలుపు చాటుకు వెళ్లిపోతూ ఆవిడ నవ్విన నవ్వొక్కటే చాలు — అది వెయ్యి ప్రణయగీతికల పెట్టు!

సత్యమూర్తి కుర్చీలో కూర్చున్నాడు. కుర్రాళ్ళు లెక్కల్లో, చూచివ్రాతలో నిమగ్నులై పోయారు. సత్యమూర్తి బుర్రలో మాత్రం ఆలోచనలు పెనరెత్తిపోతున్నాయి.

తానురామా తనదంతా అనిరుద్ధుడి కథగా పరిణమిస్తోంది. వంకజమే ఉషాకన్య. వెంకటాద్రి గారే బాణాసురుడు!

వెంకటాద్రిగారు! పొట్టి క్రాపింగుతో, మిలు గుతుపుర్యులంతేసి చిన్న కళ్ళతో, నల్లటి బొద్దు మీసాలతో ఎదుటి మనిషిపైకి రూక్ష వీక్షణాలు బరపే వెంకటాద్రిగా రంటే సత్యమూర్తికి గుండెల్లో జ్వరం. మహామహావుడు! తనాయనకు చేసిన అపకార మేమీ లేదు. ఆయనకు తనపైన అంతకోప మెందుకో తన కర్థంకాలేదు. అసలీ వూళ్లో పాఠశాలంటూ ఒకటి జరగడం ఆయన కిష్టం లేదన్న విషయం యిక్కడికి వచ్చాకగాని తనకు తెలియదు. పాఠశాల ప్రారంభమైనప్పటి నుంచీ పదిమందికి తక్కువ గాకుండా పంతుళ్ళు మారుతూ వచ్చారు. పోతూ పోయారు. ఆరు నెల క్రితం దీపావళి పండుగకు స్వగ్రామానికి వెళ్లొస్తానని చెప్పి వెళ్ళినవాడు, సంకురాత్రికైనా తిరిగి రాలేదు ......

కారణం తెలిసే కార్యం లేదు! సత్యమూర్తి వాకబు చేశాడు. తీరుకు కదిపారేమో, డొంకంతా కదిలింది.

వెంకటాద్రిగారి తాతగారు తుపాకీ చేతలో సిద్ధహస్తులు. ఆ వ్యాసంగం మూలంగా ఆయన కానాటి జిల్లా కలెక్టరు జేమ్సు దొరగారితో పరిచయం కలిగింది. ఆ పరిచయం యిద్దరూ కలిసి వచ్చి ఈ కాకొండమ్మ కోనల్లో సలిపిన మృగయా వినోదాల్లో బద్ధసఖ్యంగా పరిణతి చెందింది. ఉద్యోగ విరమణ తర్వాత స్వదేశానికి వెళ్ళిపో దలుచుకున్న జేమ్సు దొరగారు భారతదేశంలోని తమ మిత్రునికో ఉపకారం చేసిపెట్టాలనుకున్నారు. ఆ సదాశయంవల్ల రెండు గుట్టల నడుమ ప్రవహిస్తున్న చింతలేరు కడ్డంగా ఓ చెరువు రూపొందింది. చెరువుక్రింద చిట్టడివిలో నూరెకరాల సుక్షేత్రం తయారైంది. పొలాలకు నైఋతి మూలగా వెంకటాద్రిగారి తాతగారు తమ కీ నివాసగృహం నిర్మించుకున్నారు. కానీ నూరెకరాల సాగుబడి ఒక రిద్దరితో జరిగే తతంగం కాదు. అందుకోసం పది పదిహేను కుటుంబాలే అడవి లోకి తరలి వచ్చేశాయి

ఇది అడవిపాళెం తాలూకు స్థల పురాణం

పోగా నిరక్షరాస్యతను నిర్మూలించడానికి ప్రభుత్వమువారు తలపెట్టిన ప్రయత్నాల్లో 'రెండు వందలా యాభైమంది కొక పాఠశాల' అన్న నిర్ణయం మూడేళ్ల నాటిది. పెదబాబుగారి అనుమతి కోసం మడిగట్టుకుని కూచోకుండా అడివి పాళెంలోని ఎల్లయ్యలూ, పుల్లయ్యలే ముందుబడి ప్రభుత్వ సహాయానికి స్వాగతం పలికి పలుకూటాని కొక పూరికొట్టం వేయించారు.

అడవిపాళెంలో బడి ప్రారంభమైంది.

బడి ప్రారంభమైన అనతికాలానికే వెంకటాద్రిగా రిందుకు విముఖులన్న వదంతి కార్చిచ్చులా వ్యాపించింది. ఆ విముఖత్వానికి వెనుకనున్న కారణం మాత్రం నిగూఢంగానే ఉండి పోయింది.

విద్యావివేకాలు లేనిపోని కుశంకలకు దారితీయ గలవన్నది వెంకటాద్రిగారి అనుమానం!

లోకం ఏమైనా మనకేమని హాయిగా అడవి పక్షుల్లాగా కాలం వెళ్లదీస్తున్న తమ ఆశ్రితులు చదువుంమూలంగా కొత్త కొత్త మానసిక రుగ్మతలకు గురికావచ్చు నన్నది వెంకటాద్రిగారి సందేహం!

ఉత్తరువు చేతికి తీసుకుని అడవిపాళెం చేరుతో గానే సత్యమూర్తి వెంకటాద్రిగారిని దర్శించాడు. తా నిక్కడి పాఠశాలకు టీచరుగా నియమింపబడి నట్టు తెలుపుకున్నాడు. వెంకటాద్రిగారు సత్యమూర్తి నొకసారి ఎగాదిగా చూచి యింక నువ్వు వెళ్ళిపోవచ్చు నన్నట్టుగా తలపంకించారు. సత్యమూర్తి విస్మయంతో వెలుపలికి వచ్చేశాడు.

తీరా బడిసి, బడి పరిసరాలను శుభ్రం చేయించిన తర్వాతగాని సత్యమూర్తికి ఫర్నిచరు సంగతి రిజార్డులవిషయమూ స్ఫురణకు రాలేదు. అవి వెంకటాద్రిగారి అధీనంలో ఉన్నట్టు ఎవరో తెలియబరిచారు. అయితే వెంకటాద్రిగారు మాత్రం 'వి న్నెవడు చూచాడు, నీ సామాన్ల నెవడు చూచాడు' అన్నట్టుగా కన్నెర్రచేసి సత్యమూర్తివైపు దురదుర చూచారు. మతి పోయినంత పనైంది. సత్యమూర్తికి! ఫర్నిచరు గానీ, రిజార్డులుగానీ తన కంటి కింతవరకూ కాన రాలేదని అతడు పైవారికి తెలుపుతున్నాడు. తెలుపుకున్న పదిరోజుల కొకనాటి ఉదయం ఓ సబ్ యిన్‌స్పెక్టరు పలుగురు పోలీసులతో సహా అడవిపాళెంలో ప్రత్యక్ష మయ్యాడు. అతడు సత్యమూర్తి వెంకటాద్రిగా రింట్లో లేరు.

కాలు జారుచేసి, కూలీలు లాగి విరగకు వెంక టాద్రిగారి మేడలో మేడమెట్ల క్రిందటి చీకటి గదిలోనుంచి పాతశాలోపకరణాలను బయటికి తీయించాడు యిన్‌స్పెక్టరు. వాటిని సత్యమూర్తికి అప్పగించి, ముట్టినట్టుగా స్టేట్‌మెంటు వ్రాయించు కుని అతడెలా వచ్చాడో అలాగే మాయమై పోయాడు.

ఈ సంఘటన అగ్నిలో ఆజ్యాన్ని పోసింది.

నాటినుంచి నేటివరకూ వెంకటాద్రిగారి కంట పడకుండా ముఖం చాటు చేసుకుని తిరుగు తున్నాడు సత్యమూర్తి ....

సత్యమూర్తి స్మృతిపథంలో పూర్వగాథ వరుగు లిడుతుండగానే బడివేళ పూర్తయింది. కుర్రాళ్లను యిళ్లకు తోలి సత్యమూర్తి గూడా యింటిదారి పట్టాడు.

"ఏమిట్రా సత్యం ! మంచినీళ్ళు తియ్యగా ఉన్నాయని చెప్పావటగా !" చిరునవ్వుతో అడి గింది పార్వతమ్మ.

"వనిలో వనిగా నీకూ ఒకమాట చెప్పాలమ్మా! ఆ అవ్వాయి మాటి మాటికీ మన యింటికి రావడం మంచిదిగాదు" అన్నాడు సత్యమూర్తి.

"ఎందుకురా సత్యం ! భూమిలో పుట్టే పిల్ల గాదురా సంతతం ! వచ్చిందంటే కన్నెకవని చేయనివ్వదు. కూచోబెట్టి అన్ని పనులూ తానే చేసుకుపోతుంది మనమంటే ఆ అమ్మాయికి ఎంత ఆపేక్షనుకున్నావు .... "

"నువ్వొట్టి వెర్రి మాలోకానివే అమ్మా ! నీకు ప్రపంచమంటే ఏమిటో తెలియదు" అంటూ విసుక్కున్నాడు సత్యమూర్తి.

*   *   *

ఆరోజురాత్రి పేడు గంటలప్పుడు పెద బాబుగారు రమ్మంటున్నా రంటూ సత్యమూర్తికి పిలుపు వచ్చింది.

పిలుపందుకున్న సత్యమూర్తి తనకోసం కాచు కుని కూచోకుండా ముసలావిడను భోజనంచేసి పడుకోమని చెప్పి వెంకటాద్రిగారి మేడవైపు బయల్దేరాడు.

పౌర్ణమిపోయిన ఏడో రోజు. ఎటు చూసినా కోవలో చీకటే నడయాడుతోంది. అపాటికే అడవిపాళెం పూరిగుడిసెల్లో ప్రమిద లారిపోయాయి హోరున వీస్తున్న గాలిలో పూనకం వచ్చినట్టుగా కదలాడిపోతున్న వేపబాగిచెట్ల మధ్య, చిక్కని చీక టిని తొలగ్రదోయలేక తెల్లబోతున్న దీపాల కాంతిలో వెంకటాద్రిగారి మేడ యథార్థ దృశ్యంలా గాకుండా నీటిలో నీడలా కనిపిస్తోంది. తెల్లటి మబ్బుల నడుమ దారితప్పిన బాటసారులకు మళ్ళే బిక్కు బిక్కు మంటున్న నక్షత్రాల కేసి చూస్తూ వసారాలో స్తంభాని కానుకొని నిల్చున్నాడు సత్య మూర్తి. రావడమైతే వచ్చాడు గానీ, వచ్చిన తర్వాత వెంకటాద్రిగారికి తన రాక నెలా తెలుపు కోవాలో సత్యమూర్తికి తోచడం లేదు. అత లోకటి, రెండు సార్లు దగ్గి చూశాడు. రెండు మూడు సార్లు గొంతుక సవరించుకొన్నాడు. ఎంతగా ప్రయత్నించినా తన రాక గుర్తింపబడిన సూచనలు లేవు.

గంట ఎనిమిదైంది. ఎనిమిదిన్నర కూడా కావస్తోంది. నిల్చునే ఓపిక నశించిపోగా సత్య మూర్తి వసారాలో వేసి ఉంచిన బెంచీపైన కూర్చున్నాడు కూర్చున్నతరువాత పది పది హేను నిమిషాలకు నిటారుగా కూర్చునే ఓపిక కైతం లేక కిటికీ కమ్మిలకైకి వ్రాలిపోయాడు. కాస్సేపు వసారాలో మినుకు మినుకు మంటున్న గుడ్డిదీపంకేసి చూశాడు. ఆఖరుకు కళ్ళు మూసు కుని ఆలోచనలో పడిపోయాడు....

ఉన్నట్టుండి వెంకటాద్రిగారు తన కిలా కబురు పెట్టడంలోని అంతర్యం ఏమై ఉంటుంది ? తెలిసి తనేమీ అపరాధం చేయలేదు. ఒకవేళ పిట్ట కథలో గొర్రెపిల్లలా తెలియక చేశాడేమో ! అలా తినబోతూ రుచు లడగట మెందుకు ?

కిర్రుమన్న శబ్దంతో తలుపు తెరుచుకుంది.

వెంకటాద్రిగారు వెలుపలికి రాకముందే సత్యమూర్తి లేచి నిల్చున్నాడు. లేతిగ్రేళ్ళు నులుముకుంటూ "ఎందుకో రమ్మన్నారట ...." అంటూ నీళ్ళు నమిలాడు.

తను వెంటనే రమ్మన్నట్టు సైగచేసి వెంక టాద్రిగారు మేడమెట్లెక్కసాగారు.

మేడపైన హాల్లో వాలు కుర్చీలో విశ్ర మించారు, వెంకటాద్రిగారు. తాంబూల చర్వణం పూర్తయ్యాక సిగరెట్టు ముట్టించి నింపాదిగా పొగ వదల్తూ "ఆది కాదయ్యా సంతులూ ! నాకు తెలియక అడుగుతున్నాను. గవర్నమెంటువారు వినాయకుడి గుడి అవతలి వైపున ఉన్న జాగాను గూడా నీ స్కూలుకు దఖలు పరిచేశా రేమిటి ?" అంటూ సూటిగా ఓ ప్రశ్నను సంధించారు.

సత్యమూర్తి దిగ్భ్రాంతి పడిపోయాడు. "అట్టే ! అదేమిటండీ ! ఆ జాగా ఎవరిదో నాకు తెలి యదు. బీడుగా పడివుండటంవల్ల ఆటల కోస మని కుర్రాళ్ళ నక్కడికి తీసుకెళ్ళాను .... "

దట్టంగా వ్యాపిస్తున్నపొగ మబ్బుల వెనుక అరమోడ్పు కళ్ళతో పడుకున్న వెంకటాద్రిగారు యించు మించు నిద్రపోతున్నట్టుగా కనుపిస్తు న్నారు.

ఐదు నిమిషాల తర్వాత గాని సత్యమూర్తి తన సంజాయిషీని క్షమాపణతో సహా పూర్తి చేయ లేకపోయాడు.—"సరదాకొ జరిగింది. మీరు వద్దంటే మానేస్తాను .... "

సిగరెట్టు ఆరిపోయిందేమో, వెంకటాద్రిగారు చివాలున పైకి లేచి గదిలోపలికి వెళ్ళారు. ఆయన తిరిగి వచ్చేసరికి ఎంత లేదన్నా పది నిముషాలు గడిచిపోయాయి. మళ్ళీ వాలు కుర్చీలో పడుతో తూ, యిదివరకు చెప్పడూ చూడి యెరుగని వాడిలా "ఇంకా యిక్కడే ఉన్నావా ! వెళ్ళు" అన్నారు.

బ్రతుకుజీవుడా అనుకుంటూ సత్యమూర్తి గబగబా మెట్లు దిగేశాడు. ఒక్క పరుగులో గేటును సమీపించాడు. ఒక్క తోపుతో తలుపును ముందుకు త్రోశాడు.

అంతే అడుగు వెనక్కు వేసేశాడు.

తలుపులు తెరవలేదు. వాటి కడ్డంగా తగిలించిన నిలువుపైన దానికి సంబంధించిన తాళం చెవి కొక్కానికి తప్ప మిగిలిన సాధనా లన్నింటికీ అతీత్య మైన తాళం ఒకటి—ఆకారంలో కదిలి వాదిలో

సత్యమూర్తి కూడా మైసూరుపాకులు, మురిస్తి పకోడీలు మాయం చేసేశాడు. పంకజం మనసులా చల్లగానూ, తీయగానూ ఉన్న మంచినీటితో కడుపులో యింకా మిగిలివున్న ఖాళీని భర్తీ చేసేశాడు.

సరిగ్గా ఆ సమయానికి లోకంపైకి వసంతాలు చల్లుతూ పూర్వాద్రిపైన చంద్రుడు ఉదయించాడు.

సత్యమూర్తి కాళ్లను బెంచీపైకి చాపేశాడు. చేతులను క్రిందికి దిగవిడిచేశాడు. వెన్నెల్లోకి చూస్తూ వెల్లకిలా పడుకున్నాడు.

చందమామ గూడా ఒక మానవుడే అయితే అతడి మనసే వెన్నెల. యుగాలనుంచీ పెరుగుదలే గాని, తరుగుదల లేని ఆప్యాయతతో వెన్నెల లోకాన్ని కావిలించుకుంటోంది. మేడ ఎదుట వేపచెట్టు క్రిందటి వెలుగు చీకట్ల ముగ్గులకేసి చూస్తున్నాడు సత్యమూర్తి. వెలుగుతో చీకటి. చీకటిలో వెలుగు. ఇంతకన్నా విడమరిచి చెప్పడానికి వీల్లేనిది సృష్టి రహస్యం! ఎక్కడి మోదం ఎక్కడి ఖేదం? మోదంలో ఖేదం. ఖేదంలో మోదం

సత్యమూర్తి తొలికోడితో మేలుకున్నాడు. ఆపాటికప్పుడే గేటు తెరుచుకుంది. చెరతో నుంచి విడివడిన కొన్ని క్షణాలకే సత్యమూర్తి యింటిముఖం చూచాడు. అర్ధరాత్రి వరకు కుమారుడి రాక కోసం ఎదురుతెన్నులు చూచి ఆ తరువాత కలతనిద్ర పోయి అప్పుడే మేలుకున్న ముసలావిడ "అదేమిట్రా సత్యం! సాయంత్రమనగా వెళ్లినవాడివి, యిప్పుడా తిరిగి రావడం!" అంటూ లేచి కూర్చుంది.

"ఏమి చేయమంటావమ్మా! పెదబాబుగారు భాగవతం చదవమని వింటూ కూర్చున్నారు. తుష్టిగా భోజనంచేసి కూచున్నామేమో, అర్ధరాత్రిదాకా తెమిలింది కాదు. ఆవేళప్పుడు యింటికెక్కడ రాగలనని అక్కడే పడుకోమన్నారు ...." అంటూ అప్పటికప్పుడు సత్యమూర్తి తల్లి కోసం ఓ సంతృప్తికరమైన సమాధానం తయారు చేసేశాడు.

"అలాగట్రా సత్యం! పెదబాబుగారినిగురించి కిట్టనివాళ్ళు ఎన్నెన్ని రకాలుగా చెబుతారనుకున్నావు! పోనీలే. వాళ్ల పాపాన వాళ్లే పోతారు గానీ అలాగైతే పెదబాబుగారు భాగవతం చదవకున్నారన్నమాట! పాపం చేసుకున్నదాన్ని, నాకు వినే ప్రాప్తం లేకపోయింది. ఏ కథ చదివావురా సత్యం?"

సత్యమూర్తి తల్లివైపు జాలిగా చూచాడు. ఈమె పాలిటికి తెల్లనివన్నీ పాలు. అబద్ధం చెప్పి ఈమెను నమ్మించడం సులభం. అబద్ధం చెప్పక తను మరేం చేయగలడు? వెంకటాద్రిగారు తన పట్ల కినుక వహించారని తెలిస్తే ఈవిడ బెంబేలు పడిపోయి నిద్రాహారాలు మానివేయడం ఖాయం! ఇది వాస్తవం తెలిస్తే రానున్న చిక్కు. తెలియకపోతే మరింత గొప్ప చిక్కే ఎదురుగావచ్చు అరమరికలు లేకుండా ఈమె ఎప్పటిలాగే పంకజాన్ని దగ్గరకు చేరదీస్తుంది. తనేం చేసినా, చేయకపోయినా పంకజం ముసలావిడతో సాన్నిహిత్యాన్ని మాత్రం వదులుకునేటట్లు లేదు. వీళ్లిద్దరి అనుబంధం చివరికెక్కడికి దారి తీస్తుంది?

ఆలోచిస్తూ అరుగుపైన చతికిల పడ్డాడు సత్యమూర్తి.

* * *

జీవితాన్ని మధ్యలో తుద ముట్టించడానికి ప్రయత్నించడం ఎంతటి అక్రమమో, కథను మధ్యలో ఆపేయడానికి పూనుకోవడం గూడా అంతటి అక్రమం. జీవితంలాగే కథ కూడా ఓ ప్రవాహం లాంటిది. నీరు పల్లాలను తెలుసుకుంటూ ప్రవహించి కడకు కడలి కడుపులో లీనమైనట్లుగా కథ కూడా పరిస్థితుల ఒత్తిడి మధ్య తన దారిని తాను చూసుకుంటూ చివరకు గమ్యం చేరుకుంటుంది. తూములు గానీ, మరవలు గానీ లేకుండా ప్రవాహానికి అడ్డకట్ట నిర్మిస్తే ఏమవుతుంది? ఎప్పుడో ఒకప్పుడు కట్టను సమూలంగా పెళ్లగించుకుని ఉరకలు పెడుతూ ప్రవాహం ముందుకు వెళ్లిపోతుంది. ఈ రహస్యం సత్యమూర్తికి తెలియదు. అందువల్లనే అతడు ప్రారంభమైన కథను మధ్యలో ఆపేయ దలచుకున్నాడు. అందుకు పునాదిగా తల్లిని స్వగ్రామానికి పంపించేశాడు.

> బ్రహ్మాండమైన నాటక ప్రదర్శనం జరుగుతున్నది. ప్రేక్షకులు నిశ్శబ్దంగా కూర్చుని చూస్తున్నారు. నాటకంలో హీరో తన కొడుకును ఎత్తుకుని, ముద్దు పెట్టుకుంటున్న దృశ్యం జరుగుతున్నది. నాటకంలో హీరో అసలు భార్య స్టేజి ఎక్కి ఇలా అంది. "మన పిల్లలను ఎప్పుడూ ముద్దుపెట్టుకోరు. పరాయిపిల్లల్ని ఎత్తుకుంటారు. మీ దగ్గరున్న జబ్బే అది." ప్రేక్షకులంతా నవ్వారు.
>
> ఆర్. నాగేశ్వరరావు (హైద్రాబాద్)

అడవిపాళెం నీళ్ళు ఒంటికి పట్టక ముసలావిడకు జబ్బు చేసినమాట నిజమే! అప్పుడప్పుడూ రాత్రుల్లో ఒళ్ళు వెచ్చగిల్లుతుండేది గూడా! ఆ మాత్రానికే లేనిపోని భయాలను ప్రోది చేసి, స్వగ్రామంలో ఉన్న నాటువైద్యుడి ఔషధం తప్ప మరొకరి మందు ఈ జబ్బుపైన పనిచేయదని నమ్మించి, ముసలావిడను స్టేషనుకు తీసుకువెళ్లి రైలెక్కించేశాడు సత్యమూర్తి.

"ఎన్నడూ పొయ్యి ముఖం చూడని వాడివి! నీకు వంటేమి చేతనవుతుందిరా సత్యం" అంటూ రైల్లో కూర్చున్న తర్వాత గూడా వాపోయింది పార్వతమ్మ.

"అదేం బ్రహ్మవిద్య కాదులేవే అమ్మా! నీకెందుకూ, నా అవస్థ లేవో నేను పడతాను గానీ నువ్వు నీ జబ్బు సంగతి చూడు" అన్నాడు సత్యమూర్తి.

బ్రహ్మవిద్య కాదని ఒక్క మాటలో కొట్టి పారేశాడు గానీ నిజానికి పొయ్యి దగ్గర కూర్చునే తెగువ సత్యమూర్తికి లేదు. ప్రతిపూటా తింటున్న తిండికోసం మానవు లెందుకింతగా ముఖం వాచిపోయినట్లుగా కనిపిస్తారో సత్యమూర్తికి అర్థం కాలేదు. తిండిపైన కసి జూనినట్లుగా అతడొక్క రోజంతా ద్రవాహారంతోనే కాలం గడిపేశాడు. మధ్యాహ్నం మజ్జిగ త్రాగాడు. రాత్రిపూట ఓ అరవడి పాలు పుచ్చుకున్నాడు. ఉదయం నిద్ర లేచేసరికి అతని శరీరం అతనిది గాదు! తిండి విరోధమంటుంది మనస్సు. పస్తులే, కానీ ఇలాగే ఉండనివ్వు—అంటుంది శరీరం!

నీరెండలో స్కూలువైపు నడుస్తుండగా సత్యమూర్తికి తన పాదాలు భూమిపైన ఆనుతున్నట్లు లేదు. ఎవరో మెడబట్టి తోయడంవల్ల అంతర్మధ్యంతో గిరికీలు కొట్టినట్లుంది. దారిలో ఒకటి రెండు సార్లు తూలి క్రింద పడిపోబోయి అతడంతలో నిలవరించుకున్నాడు.

పైకప్పు ఎగిరిపోయేటట్లుగా పిల్లలు కొంత సేపు ప్రకాశవతనం చేశారు. ఆ తరువాత పాఠం శ్రాద్ధమనుకుని రాగంతాలకు కక్కు నేసినట్లుగా పలకపైన బలపంతో నగిషీపనులు చేశారు. తన పంతరం యిది పని గాదనుకుని ఒకరి నొకరు గిల్లి కజ్జాలకు రాదీసుకుని, మొటికలు వేసుకుని, గొంతులు చించుకుని, బూరుగమేళాలు తీసి యింత హంగామా జరిగినా సత్యమూర్తిలో చలనం కనిపించకపోయేసరికి ఆఖరుకు అయ్యవారికి ఆరోగ్యం బాగున్నట్లు లేదని నిర్ధారించుకున్నారు.

ఇప్పుడు సత్యమూర్తి కలవర మంతా తిండిపైన! మధ్యాహ్నం ఇంటికి వెళ్లగానే అతడు పొయ్యిని పూడదీసేశాడు. చొక్కాను తీసి పంకీకి తగిలించాడు. మాసిపోయిన పంచతో, భుజంపైన తుండుగుడ్డతో వలలుడి వేషం ధరించాడు. వేషమైతే చక్కగా అమరింది కానీ పోర్షను తొర్తిగా రాలేదు సత్యమూర్తికి! నాలుగు కట్టెపుల్లలు తీసుకొచ్చి అతడు పొయిలో పడేశాడు. ఇంత మట్టినూనె పోసి అగ్గిపుల్ల గీసి అగ్నిభట్టారకుడి ఆవాహన చేశాడు. పొయి రాజేయడమైంది. అప్పుడు పెరట్లోకి వెళ్లి పాత్రను కడిగి తీసుకొచ్చాడు. ఇప్పుడు పొయ్యి మండటంలేదు. దట్టంగా పొగమాత్రం పైకి లేస్తోంది. సత్యమూర్తి చేతిలోని పాత్రను అలాగే క్రిందికి వదిలేశాడు. మోకాళ్లతో నేలపైకి వంగి తలను తీసుకెళ్లి పొగలో ఉంచి రెండు నిమిషాలపాటు కొలిమితిత్తిలా పొయిలోపలికి గాలి సరఫరా చేశాడు. పొగలో ఊపిరాడడం లేదు. తల బరువెక్కి కళ్లకు అంధత్వం సంప్రాప్తించినట్లు తోచి కణతల్ని పట్టుకుని ఈ బ్రతుకు వద్దురా బాబూ అనుకుంటూ బయటకు వచ్చేశాడు.

కానీ మానవుణ్ణి జీవితం అంచుల వరకూ

# ప్రియ బాంధవి

వెన్నంటివుండే క్రూరజంతువు ఆకలి! దాని బారి బారికి గురికాకుండా, దాని ఎదుట పట్టుదలను సడలించుకోకుండా వుండడం ఎవడితరం? సత్యమూర్తికి ఒక సరిక్రొత్త ఉపాయం స్ఫురించింది బుడ్డిలో నూనె అయిపోయింది. గాని, దిగుడులో నిరుపయోగమైన పాతపుస్తకాలు కొన్ని ఉన్నాయి సత్యమూర్తి ఒక పుస్తకం పైకి తీశాడు దాని సాయంతో మళ్లీ మంటను కళ్ల జూశాడు ఒక్కొక్క కాగితంగా పుస్తకం పూర్తయ్యే సరికి కళ్ళు కూడా మండుకున్నాయి. ఇంతగా తనను ఏడిపించుకుని తిన్న తర్వాత యింక బియ్యాన్ని కడగడం కూడా ఎందు కనుకుని ముడి బియ్యాన్ని అలాగే పాత్రతో పోసి అట్టే పడు పెట్టేశాడు. ఎంత లేదన్నా ఆ బియ్యం ఖాద్యపదార్థంగా మారడానికి ఓ అరగంట పైనైనా పడుతుంది. అందాకా పొయ్యి దగ్గర పడిగాపులు పడడ మెందుకని నీరసిల్లిపోయిన శరీరాన్ని మంచంపైకి చేరవేశాడు.

సత్యమూర్తి కది నిద్ర పట్టదగిన సమయం కాదు. శరీరంతోబాటు మనసు కూడా శోషిల్లి పోయిన అవస్థతో గాలి తగ్గిపోయిన తోలు బొమ్మలా అతడు మంచంపైన పడివుండి పోయాడు. పడివుండగా పాత్రలోని బియ్యం వివిధ పరిణామాలకు లోనై చివరకు విమిడిపోయి భిన్నత్వంలో ఏకత్వాన్ని నిరూపించడాని కన్నట్టు ఒకే ముద్దగా మారిపోయింది.

ప్రొద్దు పడమటికి తిరిగిన ఆవేళప్పుడు కూరనీ, చారనీ ప్రలోభాలు పెట్టుకో దలుచుకో లేదు. సత్యమూర్తి. ఎలాగూ మరిగలో ఉప్పు వాళ్ళున్నాయి గనుక, పుల్లగా మజ్జిగ నీళ్ళు దొరికితే చాలు ననుకున్నాడు. చెంబు చేతికి తీసుకుని తలుపు చేరగిల వేసుకుని నిప్పులు క్రక్కుతున్న ఎండలో వూరిపైన పడ్డాడు.

తిరిగి వచ్చేసరికి సత్యమూర్తికి నాలుగు కాలాల పాటు మనోఫలకంపైన స్థిరంగా నిలిచిపోగల దృశ్యం ఒకటి కనిపించింది. ఆకటిబాధ మానవుడి కొక్కడికి మాత్రం పరిమితం కాదు. అది ఎనుబదినాలుగు లక్షల జీవరాసులకూ ఉన్న బాధ! మనుష్యు లెవ్వరూ లేకపోవడం కనిపెట్టి, తలుపు తోసుకుని ఓ శునకరాజం గృహప్రవేశం చేసింది. కళ్లకు నిండుగా వండిపెట్టిన అన్నం కనిపించిం దేమో, ముఖాన్ని పాత్రలోకి దూర్చింది. మంద దృష్టవంతుడి విషయంలో చేతి కందిన కబళం నోటి కందదని చెబుతారు. కాని నోటి కందిన కబళం గొంతుక వెంట దిగజారకపోవడం ఎంతటి దురదృష్టం? కుక్క విషయంలో అదే జరిగింది. దాని తల పాత్రమూతిలో బిగుసుక పోయింది.

ఒళ్లెరుగని కోపంతో ఉగ్రుడైపోయాడు సత్యమూర్తి. ఆరిపోయిన కొరివికట్టె తీసుకుని కుక్క వీపుపైన రెండు దెబ్బ లంటించాడు. కెవ్వుమని, దిక్కులు తెలియక, యిల్లంతటా కలయ తిరిగి చివరి కెలాగో బయటపడి అక్కడో [illegible] మొదలుకు [illegible] కొట్టుకుని కుక్క [illegible] మొదలెట్టింది. పాత్ర పూడక [illegible] [illegible] [illegible] [illegible]

పైన [illegible] యాతనలూ [illegible] ప్రాయంగా ఉంది. కోపం పటాపంచలై పోగా సత్యమూర్తి క్షణంలో నిర్విణ్ణుడైపోయాడు. జీవితం ఎంతటి దుర్భరమో, మరెంతగా దుస్సహమో తెలియజేయడానికోసం భగవంతుడీ కుక్క నిక్కడికి పంపాడేమో! మరికొంతసే పిలాగే చిత్రహింస కొనసాగితే విలవిల తన్నుకుని కుక్క పరలోకానికి పయనం గడుతుందేమో!

పరుగెత్తి నాలుగంగల్లో కుక్కను సమీపించాడు, సత్యమూర్తి. ఒక చేతితో కుక్కను తోసి పట్టుకుని, మరొక చేతితో పాత్రను వూడ లాగేశాడు. చావు తప్పి కన్ను లొట్టపోయినట్టుగా లబోదిబోమని అరుస్తూ కుక్క అదే పరుగుగా పారిపోతోంది.

పరుగెడుతున్న కుక్కవైపు చూస్తున్నాడు సత్యమూర్తి. చూస్తుండగా వెంకటాద్రిగారి మేడకు వెనకవైపున ప్రాకారాని కివతల ప్రహరీ తలుపు దగ్గర నిల్చుని తనవైపే చూస్తున్న పంకజం కనిపించిం దతనికి! ఆ క్షణాన సత్యమూర్తిలో చెలరేగిన భావోద్విగ్నత వర్ణనాతీతం! పంకజం గనుక చేతికి దొరికితే అత డీ చెంపకూ, ఆ చెంపకూ నాలు గంటించా లనుకున్నాడు. ఈమెగారి పుణ్యమా అని తాను తల్లిని స్వగ్రామానికి పంపి, యిలాంటి దురవస్థకు లోనయ్యాడు. మరైతే ఈవిడేమో హాయిగా భోజనంచేసి, చల్లటి నీడలో నిల్చుని ఎవరి కర్మ కెవరిది పూచీ అన్నట్టు వినోదాన్ని తిలకిస్తోంది.

"ఛాఛా! ఏం మనుష్యులు!"—అనుకున్నాడు సత్యమూర్తి. అనుకుంటూ చరచరా ఇంటి లోపలికి వెళ్లి అలకపానుపు వేసిన రాజుగారి చిన్నభార్యలా మంచంపైన ముడుచుకున్నాడు.

లోపల బడబాగ్నిలాంటి ఆకలి. బయట ప్రశాంతసాగరం లాంటి నిశ్శబ్దం. ఒకటి రెండు గడియలసేపు అలాగే గడిచిపోయింది.

ఆ తరువాత మెల్లగా తలుపు తెరుచుకున్నట్టు, ఎవరిదో పదధ్వని చేరువకు వచ్చినట్టు, ఎవరో మంచంపైకి వంగి 'బాబుగారూ!' అని పిలుస్తున్నట్టు సత్యమూర్తికి స్వప్న సదృశంగా భాసించింది

అందుకని ప్రయత్నం చేసినమీదట అతని కనురెప్పలు కొంచెంగా విచ్చుకున్నాయి.

"భోజనం చేద్దురు గాని లేవండి బాబూ!"

సత్యమూర్తి దిగాలుపడి లేచి కూర్చున్నాడు నిజమే! కలగాదు. ఈవిడ వెంకటాద్రిగారింట్లో పి తంగమ్మ. కారియర్‌లో భోజనం [illegible] తీసుకొచ్చింది.

ఎవరు పంపారు? ఎందుకు పంపారు?— మున్నగు కొల్లదంటు ప్రశ్నలు సత్యమూర్తి మదిలో మెదలడం లేదు. ఎవరు పంపితే నేమి? ఎందుకు పంపితే నేమి? ఇది భోజనం! మట్టి బొమ్మలాంటి మానవుడికి మహోత్సాహాన్ని సమకూర్చే భోజనం యిది మారు మాట లేకుండా సత్యమూర్తి భోజనంపైన కలియబడ్డాడు

తినింది తినగా కారియర్‌లో యింకా భోజనం మిగిలిపోయింది. అలాగైతే యీ కారియర్ భోజనం తనకు రెండు పూటలకు సరిపోయేం దన్నమాట! ప్రతిరోజూ యిలాగే ఎవరైనా భోజనం పంపితే బాగుండు ననుకున్నాడు సత్యమూర్తి.

(౬౩-వ పేజీ చూడండి)

# మాటలు ః స్వరవిన్యాసము

గత వ్యాసంలో లేరింగ్సులో (శబ్దపేటిక) వుండే శబ్దరజ్జువులు స్పందించి శబ్దోత్పత్తి జరగడానికీ, శ్వాసకోశానికీవున్న సంబంధం తెలుసుకున్నాము. కేవలం శబ్దోత్పత్తికి మాత్రమే ఏర్పడిన అంగములో ఉపాంగములో ఏవీలేవు. లేరింగ్సులో కేవలం కంఠస్వరం పుట్టడానికే శ్వాసకోశం సహకారం కావాలి. శబ్దపేటిక శ్వాసకోశంలో ఒక భాగం, శ్వాస అనే ప్రధాన దేహకార్యక్రమానికి కంఠస్వరం ఉపఫలితము. కంఠంలో ఉత్పత్తి అయిన స్వరం, అనేక శబ్దస్వరూపములు పొందడానికి ఫేరింగ్సు, నాలుక, అంగిలి దవడలు, పెదవులు ఇల్లా ఎన్నో ఉపాంగములు సహకరించాలి. వీటన్నిటికీ వేరేవేరే విధులున్నవి. రైలు యింజనులో ఆవిరి, కూత కూసే యీలనుంచిపోతే రైలు కూస్తున్నది. కాని రైలు యింజనులో ఆవిరి, రైలు కూయడానికి ఏర్పడిందికాదు. రైలు నడవడానికి ఆవిరి కావాలి. ఆ ఆవిరియే కూయడానికి వినియోగించబడుతున్నది. అయితే రైలు నడుస్తూ కూత కూడా కూయగలదు. మనుష్యుల్లో అట్లాకాదు. ఆరోగ్యస్థితిలో కొన్ని పనులు జరుగుతున్నప్పుడు మాట్లాడటం సాధ్యంకాదు. మింగుతూ మాట్లాడలేము. ఆఖరికి కంఠంలో స్వరం ఉత్పత్తి అవడానికి ఏర్పడ్డ శబ్దరజ్జులతో కూడా, మనిషి బలువు యెత్తుతున్నప్పుడు, శ్వాసకోశంలో ఉండవలసిన ప్రెషరు (Pressure) ఉంచడానికి మూసుకుని శ్వాసద్వారమునే మూసివుంచవలసి వస్తుంది అంటే, మాటలాడడానికై, కొన్ని ఉపాంగములు, అవి సాధించవలసిన యితర కార్యములను తొక్కిపెట్టవలసి వస్తుంది. ఈవిధంగా మాట్లాడడానికి, యితర పనులకూ ఒక పోటీ ఏర్పడుతుంది. ఆ పోటీలో మాట్లాడ్డం అనే పని వెనకపడుతుంది. ఇంతేకాదు. తమ స్పందనంతో స్వరోత్పత్తి చేయడమేకాక, శబ్ద రజ్జువులు, శ్వాసకోశంలోకి పరాయి వస్తువులు (Foreignbodies) పోకుండా కాపాడవలసిన బాధ్యత కూడా కలిగివుంటవి. అందుకనే మనం మింగుతున్నప్పుడు మాట్లాడలేము. అట్లా చేస్తే పొలమారి దగ్గు వస్తుంది. అల్లాగే దగ్గినప్పుడు తుమ్మినప్పుడు, ఆవలించినప్పుడు ఎక్కిళ్ళతో బాధపడ్తున్నప్పుడు నిట్టూర్చినప్పుడు డోకినప్పుడు తోస్తున్నప్పుడు మాట్లాడలేము. ఆహారం తీసుకోడం, గాలి పీల్చడం, ప్రాణికి మాట్లాడడంకంటే ఎక్కువ అవసరమైన విధులు. ఆవిధులు, ఆ యా అవయవములు నిర్వహిస్తున్నప్పుడు మాట్లాడ్డం వాయిదా పడుతోంది. కాని ఆధునిక నాగరిక జీవితం మానవ సంబంధములన్నీ మాటలమీదనే ఆధారపడుతున్నవి. ఒక మహాసభలో తీవ్రంగా ఉద్రేకంతో ఉపన్యసించే వక్త, ఆ ఉద్వేగంలో దాహం సంగతి ఆకలి సంగతి మరచిపోవచ్చు. ఆకలి తీరుటకా కోయిల కూయుట. మనిషి, నిద్రాణతో పాలిపోయీ కూడా గంటలతరబడి ఉపన్యసిస్తాడు. కంఠస్వరం ఉత్పత్తికి కారణభూతములయిన శబ్దరజ్జువులతో అందుకు సహకరించే ఊపిరితిత్తులూ, డయాఫ్రము కాండంలోఉండే కండరములు, నాసికారంధ్రములు, ఇతర కార్యక్రమంలో కూడా ప్రధాన పాత్ర నిర్వహిస్తూ వుంటవి.

ఇటువంటి ఆటంకములు, పోటీలు లేకుండా శబ్దరజ్జువులు తమ స్పందనంతో కంఠస్వరం ఉత్పత్తి చేసినప్పుడు ఆస్వరం అల్లాగే బయటికి పోదు. అల్లా బయటికి పోవాలంటే నాలుక బుగ్గలు, పెదవులు మొదలయిన శబ్ద సహకారక ఉపాంగములు కూడా ఒకే స్థితిలో వుండాలి. కాని ఇల్లా పాట కచ్చేరీల్లో జరగవచ్చు. కొన్ని శబ్దముల




ఉత్పత్తిలో జరగవచ్చు కాని మాట్లాడ్డం ఏక శబ్ద మాత్రమైనదికాదు. అనేక శబ్దముల సముదాయం మాట. అనేక మాటల కూటమి వాక్యము. ఉచ్చరించబడిన శబ్దము వినడానికి మాత్రమే సాధ్యమైనది. దానిని చూడలేము. దానిని చూడాలంటే ఆ శబ్దమునకు చూడదగిన ఒక స్వరూపం యివ్వాలి. శ్రవ్యములయిన శబ్దములకు దృశ్యములయిన స్వరూపములే అక్షరములు. క్షరము కానిది అక్షరము. అంటే నాశనం లేనిది. అక్షరం నిజంగా అక్షరంగా వుండాలంటే అది శిథిలంకాని పదార్థం మీద దృష్టికి అందేవిధంగా లిఖించబడాలి. ఎంతో కొంతకాలానికి శిథిలంకాని వీలులేదు. కాని ఆనాటి తాటి ఆకులు, భూర్జపత్రములు, జంతుచర్మములు, లోహశిలా ఫలకములు ఇటువంటివాటిమీద అక్షరములు, గంటంతో వ్రాయడమో కుంచెతో చిత్రించడమో, కాణంతో చెక్కడమో జరిగేది. రాతిమీద చెక్కించినది శాశ్వతమైంది. అందుకే అతి శాశ్వతమైన దానిని "శిలాక్షర స్థిరములు" అన్నారు. దృశ్యమయిన అక్షరమును చూచి, శ్రవణేంద్రియంతో తాను విన్న ఒక శబ్దమునకు యిది లిఖితమైన స్వరూపమని గ్రహించడానికి మేధాశక్తి, తజ్జనితమయిన జ్ఞానశక్తి కావాలి. ఇంతేకాదు. మాటలు ఏకాక్షరులయినా వివిధాక్షరులయినా "వాటి అర్థము యిది" అని గ్రహించి, తదనుగుణంగా తిరిగి మాట్లాడ్డమో, ఆలోచించడమో కొన్ని పనులు చేయడమో జరగనివాటి అక్షరములతో అవసరమూలేదు, వాటికి అర్థమూ వుండదు.

ఈ అక్షరములు వ్రాయడానికి చేతులు కావాలి కాలివ్రేళ్ళతోనూ అక్షరములు నేలమీద రాయవచ్చును. కాని అక్షరములు చేతితో ఏదో సాధనంతో వ్రాస్తాము. ఓనమాలు బూడిదతో వ్రేలితో వ్రాస్తాము. ఒకప్పుడు దిద్దేవాళ్ళము. ఇందుకు వేలిలోవున్న ఇచ్ఛాధీనములయిన కండరములూ, వాటిని కావలసిన రీతిగా మనం ఉపయోగించడానికి నెప్పలి, మోటారు నరములు కావాలి. ఆ యా కార్యములు నిర్వర్తింపచేయడానికి కేంద్ర నరాశయంలో నిర్ణీత భాగములుండాలి. అన్నీ ఆరోగ్యస్థితిలో వుండాలి. అవి కలిసి పని చెయ్యాలి. భగవదేచ్ఛవల్లనో లేక ప్రకృతి ప్రభావంవల్లనో ఇంత సంక్లిష్టమయిన కార్యక్రమం మనము ప్రయత్నించకుండానే నేర్చుకుంటాము. కాని కొందరిలో యీ నేర్చుకోడం జరగదు. ఎందుకు జరగదో తెలుసుకోవాలంటే ఎక్కడ లోపము వున్నదో గ్రహించాలి. మాటలు సరిగా రాకపోవడానికి ఎన్ని కారణములున్నవో అన్ని కారణములనూ, వాటి నివారణములనూ, విజ్ఞానం యింకా సాధించలేదు. కాని యీమధ్య మాటల లోపం సవరించడానికి విపరీతమైన కృషి జరిగింది. వాగ్రోగ విజ్ఞానం ఒక ప్రత్యేక భాగంగా పెంపొందుతోంది.

కంఠస్వరం అంగిలితోనూ, నోటితోనూ పెదవుల వద్ద పొందిన మార్పుతో ఏర్పడిన శబ్దసముదాయమే. వాటి దృశ్యలిఖిత స్వరూపము, భాషగా తయారయింది. ప్రపంచంలో అనేక ప్రాంతములలో, పరిణామ సూత్రానుసారంగా వికాసులయిన అమీబావంటి క్రిములనుండి ఉత్క్రమించిన జంతువులు తయారైనవి. కంఠస్వరం జంతు పరిణామంలో ఒక స్థితిలో ఏర్పడుతుంది. నోటి రూపము, పరిమాణము, నాలుక తీరు, దంతముల తీరు, పెదవుల తీరు, వీటివలన్నీ, కంఠస్వరం మార్పులు పొందుతూ వుంటుంది. ఈ మార్పులు అధికమైనకొద్దీ అధిక విభిన్నశబ్దములూ, శబ్ద స్వరూపములూ ఏర్పడతవి. గుర్రము, ఏనుగువంటి జంతువులు మాటలాడలేకపోయినా, వాటిని సంరక్షించేవారు కొన్ని పనులు చేయమంటే చేయడం మనం చూస్తున్నాము. ఈ శబ్దానికి యీ అర్థం అని ఆ జంతువులు గ్రహించి, ఆశబ్దానికి అనుగుణమయిన పనులు చేస్తవి. అంటే మాటలాడడం కొన్ని వస్తు

(61 వ పేజి చూడండి

> "ఏం! బొమ్మలా నిలబడిపోయావ్?" అని... ఆమె చెక్కిలి సతడు తా కేవరకు [illegible] తేరుకోలేదు.

ఉదయం ఎనిమిది గంటలైంది.

శుక్రవారంకదా అని తలకు పోసుకొని కురులార బెట్టుకుంటోంది శశికళ పొడుగైన శిరోజాలు వంకీలొంకీలుగా కనువిందైన కృష్ణవేణి రూపును ధరించాయి శివధనురాకారంలోవున్న ఆమె కనుబొమల మధ్యగా అరుణకుంకుమ ధళధళ మెరుస్తోంది పాలపిట్టరంగు ఖటావ్ వాయిలుచీర, గులాబి రంగు జాకెట్టు ఆమె నిండైన శరీరానికళికి వింత సొబగు నిస్తున్నాయి

రేడియోలో సినిమాపాట యమునాతరంగిణి ఝరీవేగంతో ఉధృత లూగిస్తోంది రేడియో బల్లముందు కుర్చీలో కూర్చుని శిరోజాలను భుజాల మీదుగా ఉరోజాలను కప్పేలా వేసుకొని చెక్కుటద్దాలకు చేతులుచేర్చి ఆ పాట వింటోంది శశికళ

పాట అయిపోగానే ఆమె దృష్టి రేడియోకి ప్రక్కగావున్న ఫోటోస్టాండులోని రామం చిత్రంపై పడింది చిరునవ్వులు చిందే ఆ ముఖం తనను పిలుస్తున్నట్లే అనిపించిందామెకు పలువరుసపై మధురహాసం వెల్లివిరిసింది

సినిమామాట గుర్తుకువచ్చి ఖండిత దృక్కులతో ఫోటోపైకి నయనాస్త్రాలు కొల్లలుగా గుప్పించింది. రామం క్రితంరోజు ఎవరో స్నేహితులతో— సినిమాకు వెళ్ళానని, పదకొండుగంటలకి వచ్చి చెప్పాడు ఎంటర్టైనింగ్‌గా వుందంటే తన నెందుకు తీసుకువెళ్ళలేదని "కలహాంతరిత" కాబోయింది తను కాని స్నేహితుల బలవంతంపై వెళ్ళానని మళ్ళీ తనను తీసుకువెడతానని చెప్పి తెల్లవారు ఝామునే ఆఫీసు పనిమీద క్యాంపు వెళ్ళిపోయాడు అంతగా చూడాలనివుంటే యీవేళ రాత్రి తనను చూసిరమ్మన్నాడు రామానికి తనని నొప్పించటం యిష్టముండదు

ఈ ఆలోచనలలోంచి గత సంవత్సరంలోకి వెళ్ళిందామె మనస్సు తాను బి ఎస్‌సి, రెండవ సంవత్సరం చదువుతుండగానే రామంతో పెళ్ళయింది రామం తమ పెళ్ళయిన రెండు నెలలకే ఎల్ ఐ సి ఎగ్జామినేషన్‌కివెళ్ళి ప్యాసవటం, సెలక్షనువచ్చి ఉద్యోగం దొరకటం—తానత్తారింట్లో అడుగుపెట్టిన వేళావిశేషమన్నారు పెద్దలు. తానందు కెంతో ఉప్పొంగిపోయింది రామాని కుద్యోగం దొరికిననాటినుండి అతని కూడా వెళ్ళిపోవాలని ఉబలాటపడింది అతన్ని విడిచి క్షణం ఉండలేనేమోననుకుంది కాని తను కూడ బిఎస్. సి, పరీక్షలు వ్రాస్తేకాని తీసుకువెళ్ళనన్నాడు పెళ్ళయ్యాక యింకా చదువెందుకని తాను నిర్లక్ష్యం చేయబోయినా రామం ఆ అవకాశ మివ్వకుండా బుజ్జగించి చెప్పాడు. తా నతనిమాట తీసివేయలేక తలపొకచోట, తనువొకచోట అయినా కష్టపడి చదివి పరీక్షలు వ్రాసింది. ఆ వెంటనే రామంచేత తల్లిదండ్రులకు చెప్పించి అతని వెంట వచ్చేసింది. ఈ వూళ్లో తా మిద్దరూ కలిసి కాపురం పెట్టి నెలా పదిహేనురోజు లయింది. ఆనందంగా క్షణాల్లా గడిచాయి యిన్నాళ్ళూ.

రామం ఒకటి రెండుసార్లు క్యాంపు వెళ్ళటం మూలాన తానిప్పు డలవాటుపడిపోయిందికాని లేకపోతే, అతన్ని విడచి ఒక్క రాత్రి కూడా గడపలేకపోయేది పక్కింటి ఇందం, శ్యామలలతో బాగా స్నేహం కలవబట్టి రామం లేనప్పుడు ఏదో కాలక్షేపం అయిపోతోంది ఆనాడు అలకపాన్పుమీద రామం తన తండ్రివద్ద రేడియో సంపాదించినా రామంపై తా నలిగినప్పు డిదే ఉపయోగపడుతోంది. ఆ భావం తట్టేసరికి చిన్నగా తనలో నవ్వుకుంది శశికళ

"ఏమండీ! " అని గుమ్మంవద్ద ఎవరిదో పిలుపు వినపడేసరికి ఆలోచనలలోంచి తేరుకొని తల ప్రక్కకుతిప్పింది

ఆమె శశికళకంటె రెండు మూడేళ్ళు పెద్దది జార్జెట్‌చీరమడతల్లో గులాబి పువ్వులావుంది చేతిలో వెల్వెట్ హేండ్‌బ్యాగు, ఎడమ చేతికి రిస్టువాచి, కాళ్ళకు స్లిప్పర్సు, మెడలో మంగళసూత్రం చిన్న జిగినీ గొలుసు, బర్మాముడిలో యిమిడిన శిరోజాలు—ఇట్టే ఆకర్షించే అరుణాధరాలపై చిరునవ్వు—రెండు క్షణాల్లో యివన్నీ పరిశీలించింది శశికళ.

> **ఉపాధ్యాయుడు — సింహం**
>
> బొమ్మవె య్యండిరా పిల్లలూ.
>
> ఒక విద్యార్థి-సింహం అంటే చచ్చేంత భయంసార్.
>
> రాకూర్ శ్యామసుందర్ సింగ్
> (అశ్వారావుపేట)

మందహాసంతోనే, "లోపలికిరండి" అని ఆమె నాహ్వానించింది శశికళ

ఆమె వచ్చి యింకో కుర్చీలో కూర్చుంది. రెండు నిమిషాల సేపు ఆ గదినంతా పరిశీలించటంతోనే ఆమె గడిపింది ఆధునికత్వం, నాగరికత, హైందవత్వం, ప్రతిబింబించి మనస్సు నాకట్టుకునే నేలా వుందాగది. అట్లా అలంకరించినందు కామె కళ్ళతోనే శశికళ కభినందనలు తెల్పటం, చిరునవ్వుతో శశికళ కృతజ్ఞత తెల్పటం జరిగిపోయాయి

"మీ పేరు?" అని అడిగింది శశికళ.

"అరుణ" అంది ఆమె. శశికళ తన పేరు అడగగానే చెప్పింది

ఆమె సభ్యతచూసి, "ఎందుకు వచ్చారు?" అని అడగలేకపోయింది శశికళ వచ్చినామె వచ్చిన పని చెప్పకుండా వెళ్ళదుకదా అని సరిపెట్టుకుంది.

"ఈ యింట్లో రెండో పోర్షన్ ఖాళీగా ఉందిట కదండీ!" అంది ఆమె

శశికళ కెక్కడలేని ఉత్సాహం ఉబికి వచ్చిందామెమాట వినేసరికి— ఆ డాబాలో తాము ప్రవేశించిన పది రోజులకే బదిలీఅయి రెండో వాటాలోని ఉద్యోగి సతీసమేతంగా వెళ్ళిపోయాడు. ఇంటాయిన సుందర రామయ్య తన తండ్రి సుబ్బారావుకు పరిచయస్తుడు అందువల్లనే యింత పెద్ద పట్నంలో సర్వ సౌకర్యాలతో వున్న యీ యిల్లు సులభసాధ్యమైంది కాపరానికి సుందర రామయ్య ఎక్కడో రెండు మైళ్ళ దూరాన తన సొంతమేడలో వుంటున్నాడు. ఎవరైనా యిల్లు కావాలంటే సరియైన రేటు తనస్థానే రెండవ పోర్షన్‌ని అద్దెకు కుదర్చవచ్చని అనుమతి యిచ్చేసాడు రామానికి. అందుకనే 'టులెట్' బోర్డు బయట కట్టేసాడు రామం ఆ పోర్షన్‌లోకి ఎవరైనావస్తే మరింత ఆసరాగా వుంటుందని శశికళ భావన. ఎవరైనా యిల్లు కావాలంటూవస్తే బాగుండునని ఆమె నెల రోజులనుంచి తపస్సు చేస్తోంది—ఇప్పుడు అరుణ ఆ మాట అనేసరి కామె ఎగిరి గంతేసినట్లయింది

"అయినా ఉత్సాహాన్ని బయటకు కన్పడనీయక "అవునండి. మీకు కావాలా?" అని అడిగింది శశికళ.

"అందుకే కదండి వచ్చాను అద్దెంత?" అని అడిగింది శశికళ.

"మా యింటాయన సుందర రామయ్యగారు ముప్ఫయ్యైదు రూపాయిలకయితే ఒప్పుకోమన్నారు. ముందు యిల్లు చూసుకోండి"

ఎవరూ లేరుకదా అని అప్పుడప్పుడూ ఆ పోర్షన్ కూడా వాడేస్తున్నారు శశికళా రామంలు. మూడు గదులున్న ఆ పోర్షన్‌చూసి ఫర్వాలేదన్నట్లు తలపంకించింది అరుణ

"ఎలక్ట్రికల్ అండ్ వాటర్ చార్జెస్ మనమే భరించాలి..." అంది శశికళ నవ్వుతూ

"ఇంట్లో ఉండవల్సింది మనం కదా! ఓనర్ హిరణ్యాక్షవరాలను తీర్చక తప్పదుగా!" అంది అరుణ.

"ఆయన యింటి యజమాని వరాలుగా ఎందుకు భావిస్తాడు, నిబంధనలు పెడతాడు కాని .."

"పోనీ ముప్ఫయి రూపాయిల కొప్పుకొంటారేమో! . ."

అసలు పాతిక ముప్ఫయి రూపాయిక కయితే ఒప్పుకోమని సుందర రామయ్య రామంతో చెప్పాడు. ఆ విషయం శశికళకు తెలుసు అద్దెకు వచ్చేవారు ఎట్లాగా బేరం ఆడక మానరని ఆమె భావన ఇంటాయనకు లాభం చేకూర్చి మెప్పు పొందుదామనే ఉద్దేశ్యంతో ఐదు రూపాయలు పెంచి చెప్పింది శశికళ. అనుకున్నట్లుగా అరుణ అడిగేసరికి లోపల నవ్వుకుంది

" ఒప్పించవచ్చులెండి. మీరు మొదటినెల అద్దె ఎడ్వాన్సుగా యివ్వాలి. అలాగయితేనే యింటాయన ఒప్పుకోమన్నారు" అంత్యనిష్ఠూరంకన్న ఆది నిష్ఠూరమే మేలన్నట్లు భావించింది శశికళ.

"అది పట్నంలో ప్రతి యింటి విషయంలోను మామూలేగా!" అంది అరుణ చిరునవ్వుతో.

అనవసరంగా పెడసరంగా మాట్లాడానేమోనని బాధ పడింది శశికళ. ఇంట్లో గదులన్నీ చూపించింది. రామం వివరాలు అడిగి తెల్సుకుంది అరుణ. ఎద్వాన్సు ముప్ఫయి రూపాయలు శశికళచేతుల్లో పెట్ట బోయింది అరుణ. ముందెంత నిష్కర్షగా ప్రవర్తించాలనుకుందో అంతనీరైపోయింది శశికళ.

"ముందే యివ్వట మెందుకులెండి! మీరెప్పుడు వచ్చి చేరతారు? మీ వివరాలు చెప్పారేకాదు" అంది శశికళ.

"మా వారి కీ వూరు బదిలీ అయింది. నిన్న రాత్రి యిక్కడకు చేరుకొని హోటల్లో గది తీసుకున్నాం. వారి మిత్రుడెవరో యిక్కడ తప్పకుండా పోర్షన్ దొరకవచ్చని చెప్పారుట. ఈ వేళే ఆయన ఆఫీసులో జాయిను కావాలి. అందుకని వివరాలు కనుక్కుంటూ నేనే యిక్కడికి వచ్చేసాను. ఇప్పుడు వెళ్ళి ఆయనవస్తే తీసుకువస్తాను ఎప్పుడయినా యిచ్చేదేగా!" అంటూ శశికళ చేతుల్లో మూడు పదిరూపాయల నోట్లు బలవంతంగా పెట్టింది అరుణ. ఆ చనువుకి శశికళ అరుణతో ఏన్నాళ్ళ నుంచో పరిచయముండి, సన్నిహితురాలైనట్లు ఫీలయింది.

"త్వరగా వచ్చెయ్యండి" అంది శశికళ.

"తప్పకుండా! ఏదైనా బదిలీ రావటమంటే నాకెంతో బాధ. మీలాగే ఎవరో ఒకరు అత్యంత సన్నిహితులైపోతారు. వాళ్ళను వదలి వెళ్ళాలంటే చచ్చేటంత బాధ. ఇంత త్వరలో మీలాంటి ఆత్మీయులతో అనుబంధం కుదురుతుందని నేనీ వూళ్ళో అడుగు పెట్టినప్పుడనుకోలేదు. మరి నేను వెళ్ళిరానా?" అంది అరుణ చిరునవ్వుతోనే.

అరగంటకాలేదు యిద్దర్కీ పరిచయం కల్గి. అయితే, ఎన్నాళ్ళనుంచో పరిచయస్తులైనట్లు అనుభూతిచెందారు. అరుణ వెళ్ళిపోయాకకాని రేడియో ఇంకా పాడుతూనే ఉందని శశికళకు తెలియలేదు. చిన్నగా నవ్వుకుని రేడియో కట్టేసి ఆశాపాట కూనిరాగం తీస్తూ వంటపనిలోకి దిగింది. శశికళ, అరుణతో పరిచయాన్నే తల్చుకుంటూ.

గంటన్నరలో వంట పూర్తిచేసింది శశికళ. అవని కానిస్తూనే జడ వేసుకుంది. వస్తానన్న వ్యక్తి వ్యవధిలోపుగా రాకపోతే మనస్సులో అసంతృప్తి, ఆవేదన పేరుకుపోతాయి. అరుణ యింకా రాలేదేమిటా అని పదే పదే అనుకోసాగింది శశికళ. ఈ లోపుగా ఉబలాటం ఆగక పక్కింటి శ్యామలకు, ఇందిరకు అరుణ తమ రెండో పోర్షన్‌లో ప్రవేశించడానికి వచ్చిన విషయం చెప్పింది.

ఉదయమే వూలవాడు మల్లెపూలుయిచ్చి వెళ్ళాడు. అవి దండగా గ్రుచ్చింది శశి. అరుణ వస్తుందికదా అని రెండు ముక్కలుగాచేసి ఒకటి తన తలలో తురుముకుంది. రెండోది రేడియోబల్లపై పెట్టింది. ఆమె యిల్లంతా కాలుగాలినపిల్లిలా తిరగసాగింది. రెండోపోర్షన్‌లోని తమ సామాను లన్నీ తీసివేసి శుభ్రం చేసింది.....ఇన్ని పనులు చేసినా అవి యాంత్రికంగా జరిగిపోయినట్లయింది. తర్వాత వాలుకుర్చీలో పడుకొని వార పత్రిక తిరగ వేస్తూ, క్షణక్షణమూ వీధిగుమ్మంవైపు తల త్రిప్పుతూ, వీధిలోంచి వెళ్లే ప్రతి రిక్షా చప్పుడుకూ బయటకువచ్చి చూసి నిరుత్సాహపడుతూ, తన ఆరాటనకు తానే నవ్వుకుంది.

సరిగ్గా పదకొండూ పదకొండునిమిషాలకు అరుణ రిక్షాలో వచ్చింది. ఆమె కూడా ఒక సూట్‌కేసు మాత్రం ఉంది. చిరునవ్వుతో శశి ఎదురైంది. "ఇంత ఆలస్యమైందేం?" అంటూ.

"ఏదీ, ఆయన తిరిగి వస్తేగా! చూసి చూసి నేనే బయలుదేరి వచ్చేసాను. ఎక్కడైనా పరిచయస్తులు కనుపిస్తేచాలు కబుర్లు పెట్టుకు కూర్చుంటారు. ఇక, ఇక్కడో పెళ్ళామనే ప్రాణి పడిగాపులు పడివుంటుందని జ్ఞాపకముండదు మీవారి విషయం నాకు తెలియదుకాని యీ మొగాళ్ళంతా ఇంతేనా అనిపిస్తుంది నామట్టుకు నాకు ......"

"నేనంటే మా వారికి భయంలెండి" అంది శశి నవ్వుతూ.

"—ఏమిటి? అలకపాన్పు ఎక్కుతారనా? అన్నట్లు మీది క్రొత్తకాపురంకదూ! అది సహజమేలెండి....హోటలు వాడితో ఆయనవస్తే యీ

మాష్టారు-"దండం దశ గుణం భవేత్" అన్నారురా పెద్దలు.

శిష్యుడు-అవుతే కమండల మండి—

రామునాయుడు (రావికమతం)

యింటికి రమ్మని చెప్పమని ఎడ్రసు యిచ్చి వచ్చేసాను. సామాను మేము రైలులో వచ్చేముందు పేక్‌చేయించి వచ్చాము. అవి వచ్చేవుంటాయి. ఈయనవస్తేగాని విడిపించుకోటానికి వీలుండదు.."

"పోనీలెద్దురూ! ఈవేళరాకపోతే, రేపు తెచ్చుకోవచ్చు. ముందు మీరు భోజనానికి లేవండి"

"నేను హోటల్లో తినివచ్చానండి. మీ కిప్పు డీ శ్రమ ఎందుకు?"

"ఇదేనా మీరనే ఆత్మీయత? వెంటనే వస్తారని పడిగాపులుపడి కూర్చున్నాను. హోటల్లో భోజనం ఎందుకు చేసారు? భోజన మిక్కడే చేద్దురుగాని అని ముందే చెప్తే తినేసి వస్తారని సంకోచించి మాట్లాడకూరుకున్నాను. ఆఖరికి చెప్పకపోవటంతో యిట్లా చేసారన్నమాట! అయినా మీరు నాతో భోజనంచేసి తీరవల్సిందే! ఈవేళ మా వారు లేకపోవటంతో అసలు భోజనంమీదకే దృష్టిపోలేదు...." అంది శశికళ గోముగా.

"అయితే భోజనం చేయకుండ నాకోసం నిరీక్షిస్తూ కూర్చున్నారన్నమాట!"

"అవును. మరి త్వరగా లేవండి"

శశికళ బలవంతం చేయటంతో అరుణ మాట తీసివేయలేకపోయింది. ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించారు. తర్వాత రేడియోతో కొంతసేపు కాలక్షేపం అయింది. ఇంతలో పక్కింటి ఇందిర, శ్యామల వచ్చారు. పరిచయాలయ్యాక మహిళామండలి కార్యక్రమాలపై కబుర్లు సాగాయి.

రెండుగంటల కొక రిక్షా ఆ యింటి ముందాగింది. ఆ రిక్షాలోంచి దిగుతున్న వ్యక్తినిచూసి "ఆయనే మావారు" అంది అరుణ. ఇందిర, శ్యామల అతని రాకతో వెళ్ళిపోయారు. అరుణతోపాటు నిలబడింది శశికళ. ఒక్కసారి మాత్రం అతన్ని పరీక్షగా చూసింది. తానిదివరకతన్నెక్కడో చూసినట్లు జ్ఞాపకం.....కాని గుర్తు రాలేదు ఎంత ఆలోచించినా.

అతను చిరునవ్వుతోనే "గుడ్‌లక్! ఆడవాళ్ళదే పైచేయి అయ్యింది. మనం తీసుకున్న పోర్షను చూపించండి అరుణాదేవీ!" అన్నాడు. ముగ్గురూ నవ్వుకున్నారు.

ఇల్లంతా పరీక్షించాక "చాలా బావుంది.....ఆ! అన్నట్లు మీవారేరండి?" అని అడిగి శశికళ వివరాలు తెల్సుకున్నాడతను. ఆ దంపతులకు కాఫీ యిచ్చి తాను త్రాగింది శశికళ.

"అరుణా! నీ ముఖం చూస్తుంటేనే తెలుస్తోందిలే—కందాకొట్టేసావని. అందుకనే, చద్దన్నం తిన్నమ్మ మొగుడాక లెరుగదన్నారు మన పెద్దలు" అన్నాడతడు నవ్వుతూ.

"ఆహా! అది పెద్దల కాలంలో తథ్యము సుమతీ—అనుకోవచ్చు. ఇప్పట్లో బయటకు వెళ్ళిన పతిదేవులు హోటల్లో చొరబడకుండా పతివ్రతలుగా తిరిగి రారని మాకు తెలుసు కనుక నిరభ్యంతరంగా మూడు పూటలా భోజనం చేసేస్తాం...." అంది అరుణ.

"చిన్న ఎమెండ్‌మెంట్! మేముకాదు పతివ్రతలం మీరు కాని మేమూ సతివ్రతలం కొండొకచో."

"అబ్బ! పోదురూ!" అంది అరుణ. ముగ్గురూ పకపక నవ్వుకున్నారు.

"నే నాఫీసులో జాయినింగ్ రిపోర్టుయిచ్చి యిట్లా వస్తున్నాను. ప్రొద్దున్న నాకు తగిలిన మిత్రు డెవరో తెలుసా? శేషగిరి. వాళ్ళ కంపెనీలో కాంపిటేషన్ ఒకటి వుందిట. మంచి ఫోటో ఒకటి కావాలని పీకమీద కూర్చున్నాడు.

"అంటే!.....కొంపదీసి నా ఫోటో యిస్తానని చెప్పివచ్చారేమిటి?" అంది అరుణ.

"ఆహా! అందుకనే నీ కోసం వెతుక్కుని యిప్పుడే వచ్చాను."

"లేకపోతే ఏ రాత్రో రాచకార్యా లయ్యాక వచ్చేవారుకదూ! .....అది సరే, నన్నడక్కుండా నాఫోటో యిస్తానని ఎందుకు మాటిచ్చారు?"

"ఏమండీ! ఏదో తప్పు చేసినట్లు నామీద ఫైరైపోతోంది చూసారా! ఇందులో మనకు వచ్చిన నష్టంలేదుకదా! అందాల పోటీకి వెడదామని ఉర్రూతలూగే వనిత లెందరులేరు?" అన్నాడతడు శశికళతో. ఆమె నవ్వి వూరుకుంది భార్యా భర్తల వాదన వింటూ

"ఒకరు పొగడా లనుకునే అందం నాకక్కర్లేదో

(44 పేజీ చూడండి)

**జీ. త్రినాథకుమారి**

# చుట్టరికాలు

"అవసరం గడుపుకొనడానికే చుట్టరికంగాని అవసరం తీర్చడానికి చుట్టరికంగాదు"

"అన్నయ్యా! ఇవి చేతులుకావు కాళ్ళనుకో, ఇప్పుడు నీవు తప్పితే మాకు దిక్కెవరు చెప్పు? నీ చేతులమీదుగా ఈ పెళ్ళి జరగాలి. నీకు తెలుసుగా! అమ్మాయి మేనమామ సంగతి. (మా నాన్నగారి కసలు తెలియదు), పెళ్ళని వుత్తరం వ్రాస్తే ఇంతవరకు రాలేదు సరిగదా, జవాబన్నా వ్రాయలేదు. పెండ్లి ఎల్లుండేగా! అయినా ఇంకా వాడొచ్చి చస్తాడనే నమ్మకం నాకు లేదు. మట్టెలూ, పిల్లేళ్ళూ కూడా నీవే తీసుకురావాలి అన్నయ్యా!" అంది పైటచెంగుతో కళ్ళూ, ముక్కూ తుడుచుకుంటూ మా దూరపుబంధువొకావిడ వరుసకు మా నాన్నగార్కి చెల్లెలు అవుతుంది. అంటే మాకు దూరపు మేనత్తన్నమాట.

ఈ మా అత్తమ్మ అనబడే ఆవిడ (మాకు దూరపు బంధువని ముందే చెప్పానుగా!) విధవ. ఆమెకు ఒక కూతురు. ఉద్యోగంచేసే ఇద్దరు కొడుకులు వున్నారు. క్రిందటి సంవత్సరమే కూతురుకు, పెద్ద కొడుకుకు రెండురోజుల తేడాగా పెండ్లి చేసింది. ఆమెకు స్వంత అన్నయ్య ఒకడు దగ్గర ఊర్లోనే వున్నాడు. పెండ్లని ఉత్తరం వ్రాస్తే, నాకు ఛార్జీలు వగైరాలు పంపుతేనే నేను పెండ్లికొస్తానని వ్రాశాడట ఆ మహానుభావుడు. అలాంటివాడు మట్టెలు పిల్లేళ్ళూ మేనకోడలికి ఏమి పట్టుకొస్తాడు? మా అత్తమ్మమాత్రం ఏం తక్కువ? దమ్మిడీ ఖర్చులేకుండా పెండ్లి చేయాలనేతత్వం ఆవిడది. అలాంటప్పుడు ఆమె తన అన్నయ్యకు డబ్బేమి పంపిస్తుంది? మరి మేనమామరాకపోతే మట్టెలు పిల్లేళ్ళ వంగతేంగాను?

ఆవిడది మాంఛి ఘట్టి బుర్రలెండి! ఈ ప్రశ్నలన్నింటికి సమాధానంగా ఆవిడకు మా నాన్నగారు దొరికారు. మా నాన్నగారు అమ్మాయికి (దూరపు) మామగారి వరుసగా! అందుకని ఆమె మా నాన్నగారి చేతులు పట్టుకొని కాళ్ళనుకొనమని గొంతు బొంగురుపోయేలా ఏడుస్తూ బ్రతిమాలేసరికి, అసలే ఒకరి కష్టాలను చూడలేని నాన్నగారు, ఈవిడ మాటలకు కరిగిపోయి, మేనమామ స్థానంలో తమండి అమ్మాయిపెండ్లి జరిపేభారం నాదని మాట యిచ్చారు. అంతేటితో ఆవిడగారి ముఖం వికసించింది ఆ సంతోషంలో చెప్పినవాళ్ళకే చెప్తూ మమ్మల్నందర్ని తప్పకుండా పెండ్లికి రమ్మని ఆహ్వానించింది

అన్నప్రకారం మా నాన్నగారు డబ్బు ఖర్చుచేసి పెండ్లికూతురుకు చీర, జాకెట్టు గుడ్డలు, మట్టెలు, పిల్లేళ్ళూ, పండ్లు వగైరాలు తెచ్చారు. పెండ్లివారింట్లో మాదేగదా పెత్తనం అనుకొని మా అక్కచెల్లెళ్ళం అందరం ఒక పెద్ద పెట్టి నిండా బట్టలు సర్దుకొని, పెండ్లి మేమున్న వూర్లో అయినప్పటికి పెండ్లివారింట్లో రెండు మూడు రోజులన్నా వుండాల్సివస్తుందన్న తలంపుతో (అంటే పెత్తనమంతా మా నాన్నగారిదే అందిగా! ఆవిడ) అమ్మా, నాన్నగారు, మేము ఇల్లు తాళంపెట్టి పెండ్లివారింటికి తరలి వెళ్ళాం.

మేము వెళ్ళడంతోనే మా అత్తమ్మ మా కెదురువచ్చి లోపలికి తీసుకువెళ్ళి కాఫీ, టిఫిన్ ఇచ్చి బాగా మర్యాద చేసింది. ఉదయం 11 గం. లగ్నం జరుగుతూవుంది. మేనమామగా మా నాన్నగారు చేయవలసినవన్నీ చేశారు. (తర్వాత ఇంకో 20 రూపాయిలు కట్నం కూడా చదివించారులెండి!) ఇంతలో అసలు మేనమామ వూడిపడ్డాడు. ఈయన పెండ్లికూతురికి ఏమీ తేకపోయినప్పటికి ఆ యింట్లో పెత్తనం మాత్రం చేయడం మొదలుపెట్టాడు. పెండ్లివారింట్లో మధ్యాహ్నం భోజనాలయినాయి. మాకు జరుగవలసిన మర్యాదలు జరగలేదు సరిగదా, పెండ్లి కూతురుతల్లి మేనమామ కలసి గమ్మత్తుగా మాట్లాడడం మొదలుపెట్టారు.

వాళ్ళధోరణి విన్న మాకు అక్కడ వుండాలనిపించలా. అందుకని మా నాన్నగారు టాక్సీ పిలిపించి ఇంటికి ప్రయాణమవమన్నారు. (మా నాన్నగార్కి అనుగ్రహంతోపాటు ఆగ్రహంకూడ త్వరగా వస్తుంది) మా పెట్టె బేడా టాక్సీలో పెట్టించి ఆవిడతో మేం వెళ్తున్నామని చెప్తే "అప్పుడే వెళ్ళడమేంటి, రెండురోజులుండి వెళ్దురుగాని" అంటుందేమో అనుకున్నాను నేను కాని "అవీ ఇవీ, ఎలాగూ మిగిలినయ్‌గా మీకోసం వేరే వంట చెయ్యనవసరం లేదు. రాత్రికి భోంచేసి వెళ్దురుగాని" అంది

ఈ మాటలు విన్న మేము కోపాన్ని దిగమ్రింగి భోజనానికేంలే, అంటూ టాక్సీ ఎక్కి యింటికి చేరుకున్నాం మా అమ్మ స్నానంచేసి వంట మొదలుపెట్టింది రాత్రికి. నూరు రూపాయలు వాళ్ళకోసం ఖర్చుపెట్టిన మేము వాళ్ళింట్లో అందరూ తినగా మిగిలినవి తింటానికి సాయంత్రందాకా వుండాలట

అవసరం గడిచినతర్వాత ఆవిడ మా కంత లక్షణంగా మర్యాదచేసింది.

మా పెద్దనాన్నగారి అబ్బాయి అరకు లోయలో వుంటున్నాడు (ఒక ఆఫీసరు). శలవుల్లో అరకు లోయసౌందర్యం చూద్దామని నేను అన్నయ్య దగ్గరికి వెళ్ళాను.

"నమస్తే డాక్టరుగారూ! నేను మీకు దగ్గరి బంధువునులెండి! మీ తాతయ్యగారి పినతండ్రి మనవడును" అంటూ ఒక శుభోదయం మా అన్నయ్య దగ్గరకు ఒకాయన వచ్చాడు. నేననుకున్నాను, ఈయనకు బంధువులంటే ఎంత అభిమానం, ఇంత దూరంలో వున్నప్పటికి అన్నయ్యను వెదుక్కుంటూ ఇక్కడకు వచ్చాడు బంధుప్రేమంటే ఇదే గాబోలు! అందుకని నేను వెంటనే లోపలికెళ్ళి ఫ్యూన్‌తో నీళ్ళు పంపించాను ఆయనకు కాళ్ళు కడుక్కోడానికి.

ఆయన కాళ్ళు కడుక్కున్నాడు. అది కాఫీవేళ వడం మూలాన నేను లోపలికెళ్ళి వదినతోచెప్పి కాఫీ టిఫిను పంపమన్నాను. ఫ్యూన్ కాఫీ టిఫిను తేగా ఆ బంధువు వాటిని ఆరగిస్తూ, అసలు తను వచ్చిన కారణం చెప్పడం మొదలుపెట్టాడు.

ఆయనకు ఒక బావ మరిది వున్నాడట. ఇంటర్ పాసయి ఖాళీగా ఉన్నాడట. అందుకని అన్నయ్యని ఏదన్నా ఉద్యోగం ఇప్పించమని. ఈ మాటలువిన్న అన్నయ్య వెంటనే జవాబు చెప్పలేక, అప్పటికి ఏమీ ఖాళీ లేకపోవడంతో తర్వాత ఖాళీ వచ్చినప్పుడు చూస్తానులెండని చెప్పి ఆ పెద్దమనిషిని సాగనంపాడు

తర్వాత నెల రోజులకు అన్నయ్యను అరకుమండి, మరొక వూరికి ట్రాన్స్‌ఫర్ చేశారు. నెల రోజుల క్రిందట మీ తాతయ్యగారి పినతండ్రి మనవడనంటూ తన బావమరిది వుద్యోగంకోసరం వచ్చినాయన ఆ వూరిలోనే వుంటున్నాడన్న విషయం మాకు గుర్తొచ్చింది. అక్కడ ఇళ్ళు దొరకడం కష్టంగదా, అతను వాళ్ళిల్లు చాలా పెద్దదన్నాడు ఎలాగూ అతను మన చుట్టమేగదా వాళ్ళింట్లో రెండు రోజులుండి ఇల్లు చూసుకోవచ్చును అని అన్నయ్యా, వదినా, నేను అనుకున్నాము ఈ సంగతే అన్నయ్య ముందు బొబ్బిలి వెళ్ళి జాయిన్ అయినప్పుడు ఆయనతో చెప్పగా అతను సరే నన్నాడు

అనుకున్నప్రకారం మేము అరకుమండి మా తాతయ్యగారి పినతండ్రి మనవడిగారింట్లో రాత్రి తొమ్మిదికి దిగాం. ఆ రాత్రి భోజనం, మర్నాడు కాఫీ, టిఫిన్ వగైరాలు మాకు వాళ్ళు పెట్టారు

పాపం! మా వదిన అమాయకురాలు. మర్యాదకోసం ఆ యింటాయన భార్యతో అందికదా "మీకు చాల శ్రమ యిస్తున్నాము, మాకోసం మీరు చాల కష్టపడ్తున్నారు" (మాకోసం ఆవిడేం కష్టపడలేదులెండి!) అని.

వెంటనే ఆ మహా ఇల్లాలు నవ్వుతున్నట్టుగాబోలు ముఖంపెట్టి (మేము వాళ్ళింట్లో దిగినప్పటినుండి ఆవిడ ముఖం మాడ్చుకునే వుంది) "మీరు వంట ఆ వసారాలో చేసుకుంటారనుకున్నాను. మీ సామానులో కుంపటి బొగ్గులు కూడా వున్నాయిగా వంట చేసుకో

ఆయనకు కావల్సిన బంధువులు ఆవూళ్ళో నల్గురున్నారు. బజార్లో ఆ నలుగురూ ఒకరి తర్వాత ఒకరు తటస్థపడియిలా అన్నారు:

"ఏరోయ్ ఇదేనారావడం? మనవాళ్ళందరూ బాగున్నారా? ఈపూటకి ఉంటావుగా? వస్తా అలా బజార్లో పనుంది" ఎవరింట్లో వుండాలో బోధపడక దిగినబస్సే ఎక్కాడా వ్యక్తి.

కై. నరసింహమూర్తి (సిర్పూరు)

వచ్చు" అంది వదినా నేను తెల్లబోయి ఆవిడవైపు చూస్తూ వుండిపోయాం ఏమీ తోచక

ఇంకొంచెంసేపటికి అన్నయ్య రాగా జరిగిన సంగతి చెప్పేము మా మాటలువిన్న అన్నయ్య, అప్పటికప్పుడు టి. బి. కి మా బస మార్చే ఏర్పాటు చేశాడు. మర్నాడు ఊరంతా గాలించగా ఒక మంచి బాబా దొరికింది. ఇప్పుడుకూడా మా దూరపు బంధువు వారానికి రెండు రోజులన్నా మా యింట్లో

## చట్టరికాలు

విందులు ఆరగిస్తాడు. కాని మేమున్న ఒక్క పూట తను ఇంట్లో వుండకుండాపోయాడు. చెయ్యవలసిన మర్యాదంతా భార్య చేసింది.

కొందరు పెద్దమనుష్యులు చుట్టరికం తిరగేసి ఇవతలివారితో ఎటువంటి పనులనైనా చేయించుకుంటారు. కాని తిరిగి వాళ్ళకి ఒక్క పూట కూడ సరిగా మర్యాదలు చేయరు ఇట్లాంటి చుట్టాలంటే మనకు చుట్టరికంసంగతి గుర్తున్నా లేకపోయినా ద్వేషం మాత్రం వుంటుంది. అందుకని ఈ చుట్టరికం తిరగేసి పనులు చేయించుకోడానికే బంధుప్రేమ చూపించక, అవతలివాళ్ళ అవసరాలను కూడ గమనించినప్పుడే ఒకరియందు మరియొకరికి అభిమానం వుంటుంది. ★

అకుండి శారదాంబ

# ఆడవారూ - అంగళ్లూ

ఇప్పటి నాగరిక సభ్య ప్రపంచంలో స్త్రీలు ఘోషాలోఉండి తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను చంపుకో నవసరంలేదు. యథేచ్ఛగా పురుషులకు మాదిరిగా అంగళ్ళకుపోయి బేరసారాలుచేసి వలసిన సరకుకు తెచ్చుకోవచ్చు. అలా వెళ్ళిన ఆడవాళ్ళని తప్పుట్టుకొనేవారుంటే వారి సంఖ్య బహు స్వల్పం.

"మాకాలంనాడు నట్టనడిబజార్లలో నడి చెరుగుదుమా' అని బుగ్గలు నొక్కుకొనే అబలలు కూడా అక్కడక్కడ తారసపడతారనుకోండి.

నిజానికి స్త్రీలు అంగళ్ళకు పోవడం ఏమంత మహాపరాధంకాదు కాని అంగళ్ళకుపోయే స్త్రీలు సభ్యతాసభ్యతలు పాటించకుండా అతిగా ప్రవర్తిస్తే అక్కడ నవ్వులపాలవుతారు. ఐతే అంగళ్ళకుపోయే స్త్రీలలో చాలా తరహాలవారున్నారు. చాలామంది కేవలం వారికిగాని, పిల్లలకుగాని తీసే బట్టలకోసం మాత్రమే వెళ్లేవారు. లేదా ఏద్లైనా తాము పెట్టుకోవలసిన బంగారం వస్తువులు కొనే సందర్భంలోనే వెళ్లేవారు. ఇలా వారికి సంబంధించిన సరుకులు చూచేందుకు పురుషులతోపాటు గాని, లేదా తామే ఏ పొరుగింటి ఆవిడ సాయంతోనో షాపులకువెళ్ళి కావలసిన సరుకులను కొనుక్కుంటారు

తమ కవసరంలేని పనికిరాని సరుకులుకొనే తరహా స్త్రీలున్నారు. ఇటీవల నేనొక ఫ్యాన్సీ షాపులో ఎంబ్రాయిడరీ దారాలు కొనడానికి వెళ్ళాను. ఇంతలో నాతోపాటు ఒక నడివయస్సులోఉన్న ఆమె షాపులోకి ప్రవేశించింది. హేండ్‌బాగ్‌లోంచి ఒక లిస్టు తీసింది. షాపువాళ్ళు ఏంకావాలమ్మా అని అడిగేసరికల్లా రక్కున ఒక భారత్ బ్లేడ్ల పాకెట్టు ఒక షేవింగ్ స్టిక్కు, షేవింగ్ బ్రష్, డార్క్ టేన్ చెర్రీ బ్లాక్‌టిన్ను, ఏష్ ట్రే, రెండు డజను కోటు బొత్తాలు—ఇంకా ఎన్నో అన్నీ మగ సరకులే. ఒక్కటి ఆమెకు పనికివచ్చే సరకు అడగలేదు, కొనలేదు. నేను చాలా ఆశ్చర్యపోయాను. కాని చూడగా ఈనాటి నారీలోకంలో ఇదొక ఫ్యాషనుగా మారినట్టుంది. బట్టల షాపుల్లో తమ చీరలు, జాకట్టు గుడ్డలే కాకుండా మగవారికి కావలసిన పేంట్లు, షర్టులకు పడే బట్టలను వారే స్వయంగా ఎన్నిక చేసికొనడం జరుగుతోంది ఇలా పురుషుల కతిగా సాయపడే స్త్రీలు ప్రతినిత్యం మనకగుపడుతున్నారు. కాని ఆ పద్ధతి అంతమంచిది కాదేమో అని అనిపిస్తుంది. ఎవరి అభిరుచులకు తగినట్లు వారే తమ అవసరాలను తీర్చుకుంటేనే బాగుంటుందేమో. భార్య తెచ్చిన బట్టలు భర్తకు నచ్చకపోవడంవల్ల, అలాగే భర్త తెచ్చిన చీరలు భార్య ఏవగించుకొని గిరవాటు వేయడంవల్ల ప్రయోజనం శూన్యం. చివరకు మిగిలేది అసంతృప్తి.

ఆవాలు మొదలుకొని అలారం టైంపీసుదాక హారతి కర్పూరం మొదలు కొని హార్లిక్సు దాకా కూరగాయలు మొదలుకొని కూటీకూరా టాల్కమ్ దాకా—సర్వం మేమే తేగలమని గర్వించే స్త్రీలున్నా అది కొన్ని సందర్భాలలో అనుచితమనిపించకపోదు. ఎవరికి కావలసిన సరుకులు వారే తెచ్చుకొంటేనే అది శోభిస్తుంది కానిపక్షంలో బొత్తిగా మగరాయుళ్ళు సోమరిపోతులై, ఇవాళ నువ్వు బజారు కెళ్తావు గాజోలు లో రెండు బెర్క్లీ సిగరెట్టు పేకట్లు కూడా తీసుకురా' అనే పరిస్థితికి దిగజారుతారేమోనన్న భయం కూడా కలగకమానదు. అట్టి విషమ పరిస్థితి ఎదురయ్యేలా మన మహిళలు ప్రవర్తించకూడదు స్త్రీలు అంగళ్ళకు పోరాదని పోగూడదని ఎంత మాత్రం ఈ వ్యాసం ఉద్దేశంకాదు పోయినా ఎవరి హద్దుల్లో వారు వుండి తమ అవసరాలు తాము తీర్చుకొని నలుగురిలో నవ్వులపాలు గాకుండాఉంటే అదేచాలు. అంగళ్ళకువచ్చే స్త్రీలవల్ల మాకు మతులు పోతున్నాయే అని షాపులవాళ్ళు చేసే అపవాదు పోగొట్టుకొనేందుకు నేడు మనం ప్రయత్నించాలి అంతే మనకి కావలసింది

మరొక విపరీత తరహా వనితలున్నారు కాని ప్రభావం వారి నైజాన్ని ఏమి మార్చలేకపోతోంది. వారికి కావలసిన సమస్తమైన వస్తువులకు కేవలం పురుషులమీదనే ఆధారపడేవారు. చివరకు గాజులు కొలయిచ్చి వాటికోసం భర్తలను బజారులకుపంపే వారున్నారు. కాలి చెప్పులు కావాలంటే కాగితం మీద కాలిసైజు గీసి యిచ్చే కాంతామణులు అక్కడక్కడ కనిపిస్తారు. కాని ఈ విపరీత ధోరణి అంత మంచిదికాదు చివరకు మగవారు తెచ్చినది నచ్చకో, సరిపడకో తిరిగి చాలాసార్లు షాపులకు పంపి వారిని బాధపెట్టేకంటె తామే చక్కగా వాళ్ళతోవెళ్ళి ఆ సరుకులేవో కొనుక్కొనివస్తే ఉచితంగా ఉంటుంది. భార్యలను వెంటేసుకొని బజార్లకు వెళ్ళడం నామోషిగా భావించే మగవారుఉంటే అది సాధ్యంకాదనుకోండి. ఆకారణంచేత స్త్రీ పురుషులు ఉభయుల దృక్పథాల్లోను ఎంతేనా మార్పు రావడం అవసరం నేడు. ★



# మీరు

# ఉబ్బసం

# వల్ల బాధపడుతుంటే

ఎఫజోన్ బిళ్లలు మరల భారతదేశంలో దొరుకుచున్నవి. ఉబ్బసం, రొమ్ముపడిశెం, గుండె నంజు, గుండెలలో కఫం, హే జ్వరం, తత్సంబంధమైన వ్యాధుల వల్ల బాధపడు వారికి ఎఫజోన్ గుణకారి. ఎఫజోన్ సేవించుటకు సులభమైనది. సురక్షితమైనది, రూఢిగా గుణమిచ్చునది శీఘ్రనివారణ గలిగించునది.

ఎఫజోన్ సూత్రమందలి వైద్య శాస్త్రీయమైన ఔషధ పదార్థముల గుణములు దిగువ వివరింపబడినవి :—

1. ఎఫజోన్ శ్వాసనాళములయొక్క కండరముల ఈడుపును పోగొట్టే శక్తివంతమైన గుణమును గలిగియున్నది.

2. ఎఫజోన్ శ్వాసనాళములు మరియు గొంతులోగల గట్టి శ్లేష్మమును పలుచన పరచును. అందువల్ల అది సులభంగా దగ్గు మూలకంగా తొలగింపబడగలదు.

3. ఎఫజోన్ ఊపిరితిత్తులందలి రక్తనాళములలో అధికకూడికయైన ఒత్తిడిని నివారించును

4. ఎఫజోన్ గుండెలలోని అత్యాయాసకారక ఒత్తిడిని తగ్గించిపనిచేసేశక్తిని హెచ్చించును

5. ఎఫజోన్ నరములను శమనపరచే గుణమును గలిగియున్నది. ఇందు మూలకంగా ముమ్మరమైన ఉబ్బసంయొక్క ముఖ్యగుణమైన దడతో గూడిన ఒగర్పును తొలగించును మరియు రొమ్ము పడిసెపు బాధైన ఎడతెగని దగ్గును తగ్గించును.

ఉబ్బసం వేగముగా తాకి విజృంభించును. కాని అది తాకిన స్వల్పమాత్రపు చిహ్నం కనిపించగానే ఒక ఎఫజోన్ బిళ్లను మ్రింగినయడల మీకు రూఢియైన శీఘ్రనివారణకలుగును.

ఎఫజోన్ యొక్క యోగ్యమైన ప్రశంసనీయ గుణములు, దానిని వాడినట్టి అనేక వ్యాధిపీడితుల వల్లను, దానిని నిర్ణయించిన అనేక మంది డాక్టర్ల వల్లను, ఋజువు పరచబడినవి ఎఫజోన్‌లో అలవాటు కాగల ఓషధులు లేవు. ఇది 15, 45, 100 మాత్రలుగల ప్యాకెట్‌లలో కెమిస్టులందరి వద్దను. మందుల షాపులన్నిటిలోను దొరుకుచున్నది.




# EPHAZONE

ఎఫజోన్ నిర్మాతలు మరియు పంపిణీ దారులు:

జె.ఎల్. మారిసన్, సన్ అండ్ జోన్స్,

ఇండియా లిమిటెడ్

బొంబాయి కలకత్తా మద్రాస్ ఢిల్లీ

# 'ఆత్మగౌరవం ఉన్నా అహంకారంలేని మహానాయకుడు మోతీలాల్'

దేశస్వాతంత్ర్యంకోసం తమ సర్వస్వం ధారపోసి, నిర్విరామ కృషి జరిపిన వెనుకటితరం మహానాయకులలో పండిత మోతీలాల్ నెహ్రూ ప్రముఖులు. సంపన్నుల కుటుంబంలో పుట్టిపెరిగి, న్యాయవాదిగా విశేష ధనార్జనచేసి, ఎన్నో సుఖాలకు అలవాటుపడినా, వాటిని తృణప్రాయంగా త్యజించి, కష్టాలను కోరి తెచ్చుకొన్న త్యాగమూర్తి. వారి శతవార్షిక జయంత్యుత్సవాలు ఈ 6 వ తేదీన దేశవ్యాప్తంగా జరిగాయి.

పండిత మోతీలాల్ నెహ్రూ 1861 మే 6వ తేదీన ఆగ్రాలో జన్మించారు. అంతకు మూడుమాసాల క్రితమే వారి తండ్రిగారు మరణించారు. అన్నగారు నందలాల్ ఆగ్రాలో న్యాయవాదిగా ఉండేవారు. వారి అజ్మాయిషిలోనే మోతీలాల్‌గారి విద్యా వ్యాసంగం సాగింది. చదువులో వారి బుద్ధి వైభవం వ్యక్తమైనా, కాలేజీలో రౌడీ నాయకుడుగా పేరు పొందారు. బి. ఏ. పరీక్షలలో మొదటి పేపరు పాడు చేశామనుకొని మిగతా పరీక్షలకు వెళ్ళలేదు. ఆ తరువాత వకీలు పరీక్షకు కట్టి ప్రథముడుగా ఉత్తీర్ణుడై, బంగారు పతకం సంపాదించారు.

మోతీలాల్‌గారు మొట్టమొదట కాన్పూర్ జిల్లా కోర్టులో న్యాయవాది వృత్తిని ప్రారంభించి, ఆ తరువాత కొంత కాలానికి అలహాబాదుకు మారారు. అనతికాలంలోనే మంచి పేరు ప్రతిష్ఠలు రావడంతో పాటు సంపాదన కూడా బాగా పెరిగింది. అప్పటికింకావారు రాజకీయాలలో ప్రవేశించలేదు. రాజకీయాలలో దిగితే తమ వృత్తి, సంపాదన ఏమవుతాయోనన్న ఆందోళనే ఇందుకు కారణం. అందువల్లనే దీక్షతో తమ వృత్తిని అంటి పెట్టుకొని ఉన్నారు.

1900 సంవత్సరంలో మోతీలాల్ యూరప్ వెళ్లారు. తిరిగి వచ్చిన తరువాత ప్రాయశ్చిత్తం చేసుకొనడానికి నిరాకరించారు. ఇది కొందరు కాశ్మీరీ బ్రాహ్మణుల ఆగ్రహానికి కారణమైంది. అయినా ఆయన లెక్క చేయలేదు. క్రమేణా పురాతన భావాలకు వారిలో చోటు లేకుండా పోయింది. దేశ రాజకీయాలు వారి దృష్టిని ఆకర్షించసాగాయి. తమ భావాలకు తగినట్లుగా మితవాదులతో చేరారు. అతివాదులలో బెంగాల్, మహారాష్ట్రలకు చెందిన కొద్దిమంది మినహా, మిగతా వారంతా యువకులు. వీరి విపరీత ధోరణి ఆయనకు చిరాకెత్తించేది. స్వదేశీ, బహిష్కార ఉద్యమాలు నచ్చేవి కావు. ఈ విధమైన జాతీయవాదం కూడా ఒక మతమని ఆయన భావించేవారు. వివిధ రంగాలలో పాశ్చాత్యులు సాధించిన అభివృద్ధిని చూచి, మనదేశం కూడా ఆ విధంగానే పురోగమించాలనీ, అందుకు బ్రిటన్‌తో కలుపుగోలుగా ఉండక తప్పదనీ వాదించేవారు కాని కాలక్రమాన ఆయన భావాలు మార్పుకు గురిఅయ్యాయి మితవాదులను నుంచి దూరమవుతూ వచ్చారు మన ఆశయాలను, ఆశలను నిర్లక్ష్యంచేసి, అవమానించే అధికార వర్గానికి ఎల్లకాలం లొంగిఉండటం భావ్యంగా తోచలేదు.

1919 లో గాంధిజీ నాయకత్వాన దేశ వ్యాప్తంగా సత్యాగ్రహోద్యమం ప్రారంభమైంది. రౌలత్ చట్టాన్ని ప్రతిఘటించడానికి కార్యకర్తలు



పండిత మోతీలాల్ నెహ్రూ

ప్రమాణ స్వీకారం చేశారు. కాని ఈ ఉద్యమం మోతీలాల్‌గారికి నచ్చలేదు కొందరు వ్యక్తులు జైళ్ళకు వెళ్ళినంత మాత్రాన ప్రయోజనమేమీ లేదనీ, ఆ విధంగా ప్రభుత్వం మీద వత్తిడి తీసుకొని రాలేమనీ ఆయన వాది...

బ్‌లో ఘోరాలు జరిగాయి. ఈ ఘోరాలకు తగిన సమాధానం చెప్పాలని అమృతసర్ కాంగ్రెసు సమావేశంలో ఆయన మితవాదులను కోరారు. వారు వినలేదు దీనితో స్వరాజ్య పార్టీని స్థాపించారు. కాని ఆ పార్టీలో కొన్ని విచ్ఛిన్నకర శక్తులు కూడా ప్రవేశించాయి ఎన్నికలలో ఈ శక్తులు పైకివచ్చాయి.

కలకత్తా కాంగ్రెసుకు మోతీలాల్‌గారు అధ్యక్షత వహించవలసి వచ్చింది. అఖిల పక్ష సమావేశానికి నివేదిక తయారు చేశారు. దీనిని కాంగ్రెసు చేత ఆమోదింపచెయ్యాలనుకున్నారు. ఏడాదిలోగా అందులో పేర్కొన్న రాజ్యాంగాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచకపోతే సంపూర్ణస్వాతంత్ర్యంకోరే షరతుమీద, నివేదికను కాంగ్రెసు ఆమోదించింది. దీనివల్ల 1930 వరకు అన్ని వర్గాలు ఏకోన్ముఖంగా నిలిచాయి ఆఏడు జూన్ 30 వ తేదీన ప్రభుత్వం మోతీలాల్‌గారిని అరెస్టుచేసి ఆరు నెలలుశిక్ష విధించింది ఆయనఆరోగ్యం దెబ్బతిన్నది.

మోతీలాల్‌గారు 1931 జనవరి 12 వ తేదీన నైనిలోఉన్న తమ కుమారుణ్ణి చూచేందుకు వెళ్ళారు. అప్పటికి ఆయన ఆరోగ్యం పూర్తిగా పాడైపోయింది. ఫిబ్రవరి 4 వ తేదీ ఉదయం కాస్త బాగానే కనిపించారు. ఈ పరిస్థితిలో వారిని లక్నోకు తీసుకువెళ్ళి చికిత్స చేయించే ఏర్పాట్లు జరిగాయి గాంధిజీ ప్రభృతులు కూడా వారి వెంట వెళ్ళారు 6 వ తేదీ ఉదయ మోతీలాల్‌గారి పరిస్థితి విషమించింది క్రమంగా ఆయన ముఖంలో నిశ్చలత, ప్రశాంతత కనిపించాయి. చూచేవారికి నిద్రపోతున్నట్లు కనిపించారు. కాని అది మామూలు నిద్ర కాదు శాశ్వత నిద్ర.

## నాయకుల శ్రద్ధాంజలి

పండిత మోతీలాల్ తమ త్యాగ నిరతితోను, సంకల్పబలంతోను దేశప్రజలను మేల్కొల్పారనీ, కేంద్ర శాసన సభలో స్వరాజ్యపార్టీ నాయకుడుగా వారు మహత్తరమైన సేవచేశారనీ, రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ ఢిల్లీలో ఏర్పాటైన శతవార్షిక జయంత్యుత్సవ సభకు అధ్యక్షత వహిస్తూ, చెప్పారు. ఉప రాష్ట్రపతి డా. ఎస్. రాధాకృష్ణన్ ప్రధాని శ్రీ నెహ్రూ, ఆచార్య కృపలానీ, డా. సయ్యద్ మహమ్మద్, డా. హెచ్. ఎన్. కుంజ్రూ, డా. పి. సుబ్బరాయన్, శ్రీఎన్. సి. చటర్జీ మొదలైన ప్రముఖులు ఈ సభకు హాజరయ్యారు.

వ్యక్తి స్వాతంత్ర్యం, సాంఘిక పునర్నిర్మాణం, జాతి సమైక్యత అనే ఆదర్శాలకోసం కృషి చేయటమే మోతీలాల్‌గారికి మనం సమర్పించతగు శ్రద్ధాంజలి అనీ, ఆ ఆదర్శాల సాధనకే ఆయన తమ జీవితం ధారపోశారనీ, డా. రాధాకృష్ణన్ అన్నారు. ఆచార్య కృపలానీ ప్రసంగిస్తూ, ప్రజలలో సమైక్యతాభావాన్ని అభివృద్ధి పరిచేందుకే పండిత మోతీలాల్ జీవితం అంకితం అయిందని తెల్పారు.

"మోతీలాల్ గొప్ప వ్యక్తి; ఉత్తముడు. ఆయనకు ఆత్మగౌరవం ఉన్నా, అహంకారం, సోత్కర్ష లేవు ఆనాటి ప్రభుత్వంతో సక్రమంగా వ్యవహరించడానికి ఆత్మగౌరవం ఎంతైనా అవసరమైంది. మళ్ళీ అలాంటి నాయకులను పొందటం తేలికకాదు" అని స్వతంత్రపార్టీ నాయకుడు శ్రీ సి రాజగోపాలాచారి మద్రాసులో జరిగిన సభకు అధ్యక్షత వహిస్తూ చెప్పిన మాటలలో అతిశయోక్తి ఏమాత్రం



క్షణం తండ్రీ కొడుకులు ఒకర్నొకరు అలాగే రెప్పవాల్చకుండా చూసుకున్నారు. ఇద్దరి మనసులు ఆర్ద్రమైనాయి.

విశ్వనాథం వ్రాసిన ఉత్తరం చాలా కలత బెట్టింది రమణను !

మామూలుగా వచ్చే ఉత్తరాల్లా గాకుండా, యింతవరకు తన జీవితాన్ని, కొన్ని సందర్భాల్లో, తన ప్రవర్తనను, మళ్లీ పునరాలోచించుకోమని, ఆ అవసరాన్ని పరోక్షంగా సూచిస్తున్నట్లు అనిపించింది

అంతదాకా ఎందుకు, క్షణం స్తంభీంభృతుడే అయినాడు ఆ తర్వాత, తన ఆఫీసు, సహ ఉద్యోగులు, యివన్నీ మదిలో మెదిలి, తేరుకుని ఉత్తరం చదవటానికి ఉద్యుక్తుడయ్యాడు

" యిదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే, కనీసం నీ చర్యవల్ల కలిగే ఫలితం యిన్నాళ్ళకు యింత దారుణంగా పరిణమిస్తుందని ఆనాడు నువ్వు అనుకొని ఉండవు ఆయనైతే రిటైర్డు పోలీసు సూపర్నెంటే లోకానికి నిజానికి, ఆయనలో యిదివరకటి పులుపు చావలా ! గంభీరంగా చూస్తూ, నిండుగా ఉన్న తెల్లని మీసాలు అలా తమాషాగా, షోగ్గా మెలితిప్పుకుంటూ, మీ యింటి వరండాలో ఆయన పచార్లు చేస్తుంటే ఆదర్పం, ఠీవి, అడుగులు వెయ్యటం యివన్నీ ఆయన ఒకనాటి, వృత్తికి నిదర్శనాలు అయినా అవే జ్ఞాపకాలు గూడ !"

ఒక్కసారి రమణ కళ్లముందు తన తండ్రి రూపం మెదిలింది ఆజానుబాహువైన ఆ మనిషి కళ్లల్లోకి సూటిగా చూస్తే, సూర్య కిరణాలంత వేడి, వాడి ఉండేవి మనిషి మాట్లాడినా అలాగే ఉంటుంది బాగా ఆలోచించి, నిదానించి, మరీ మాట్లాడుతాడు ఆయన ఒక నిర్ణయాని కొచ్చి, ఆ నిర్ణయం వెలిబుచ్చిం తరవాత దానికి తిరుగంటూ ఉండకూడదు ఉంటె సహించడు అది ఆయన మనస్తత్వం ! దాన్ని వృత్తిలో చాలా జాగ్రత్తగా కాపాడుకున్నాడు 'చండప్రచండుడు' అని పదుగురుచేత అనిపించుకున్నాడు రమణ కీనాటికీ ఒక్క సందేహం అలాగే మిగిలివుంది

ఆయనకున్న గుణాల్లో ఒక్కటైనా తనకు సంక్రమించిందా ? అని

" ఆయనకూ, నీకూ పోలికే లేదు ఏ విషయంలోనూ, ఒక్క దానిలో తప్ప ! ఆయన జీవితంలో యింతవరకూ ఏ పనిలోనూ—వృత్తిలో

గాని, ప్రవృత్తిలో గానీ—అపజయం విరుగడు. అలా అందరికీ రోజులు గడుస్తయ్యి అన్నది అనుమానమే కానీ ఆయనకు అలానే గడిచింది, ఒక్క నీ విషయంలో తప్ప !"

తను ఏం చేశాడు ?

రవణ చిన్నప్పటినుంచీ ప్రేమగానే పెంచబడ్డాడు లందుకు కారణమూ ఉంది

తల్లి లేదు రవణకు, మూడేళ్లప్పుడు—రవణ తల్లి అకస్మాత్తుగా చనిపోయింది

అందుకు బాధపడ్డది వెంకటరత్నంగారు మాత్రమే! దానికి కారణమూ ఉంది

వెంకటరత్నంగారు, తనతోపాటు చదివే, ఒక అమ్మాయిని ప్రేమించి పెళ్లిచేసుకున్నారు. అందుకు వెంకటరత్నంగారి తండ్రి, తల్లి అంగీకరించక వేరైపొయ్యారు

వెంకటరత్నంగారు యిలాంటి అవాంతరాలన్నీ వూహించుకునే, జాగ్రత్తపడ్డాడు నా అన్నవాళ్ళ లేని జానకిని తీసుకు వేరే కాపురం పెట్టారు చదువు మధ్యలో ఆగిపోయింది కొన్నాళ్ళ అలాగే గడిస్తే ఎలా ఉండేదో గానీ, అలా గడవలా !

వెంకటరత్నంగారు, పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరుగా సెలెక్ట్ అయ్యారు దాంతో ఆయన ధైర్యంతో పుంజుకుని, జీవితనావను మరింత వేగంగా, శ్రద్ధగా, మెళకువగా నడుప ప్రారంభించారు

అలా ఎంతోకాలం గడవలా !

జానకి, చనిపోయింది! అప్పటికి రమణకు మూడేళ్ళ !

అన్నిటికీ దూరమై, జీవిత సంగ్రామంలో ముందుకు పోతున్న వెంకటరత్నంగారికి జానకి లేని లోటు తెలిసి ఆయన అంతర్గతంగా జీవచ్ఛవమై పొయ్యారు

ఆయనకు మిగిలిం దేమిటి ?

ఒక్క మూడేళ్ల రమణ !

వాడి కిహ అన్నిటికీ తానేనన్న వూహ కలిగి ఏదో ఆర్ద్రత ఆయన్ను ఆవహించింది కర్కశముగా ప్రవర్తించాల్సిన ఆయన వృత్తిధర్మానికి రమణ పెంపకం ఆటంకమే అయినా, ఆయన బాధపడలా !

పైకి ఎంత గంభీరంగా, దయారహితంగా ఉన్నా, మనస్సుని మాత్రం ప్రేమ, వాత్సల్యం, ఆత్మీయతతో నింపుకున్నారు ఆయన !

రమణ తల్లి లేనివాడు అని ఆయన కనిపిస్తూ ఉండేది, రమణను చూస్తుంటే !

ఆయన ఆ భావం కొడుక్కి కలక్కూడదు అన్న వూహతో తల్లీ, తండ్రీ అన్నీ తానే అయి రమణను పెంచాడు

అందుకే, ఒకానొక సమయంలో యిద్దరూ తమ తమ పంతాలు నెగ్గించుకోవాలని పట్టుపట్టారు

ఇన్నాళ్లూ తను పెంచిన తీరును, చూపిన ప్రేమను పూతంగా తీసుకుని తన తెలివితేటలు, ఎదురులేని తన మాటను ప్రయోగించి, తన మాట నెగ్గించుకోవాలని వెంకటరత్నంగారు !

ఒక్కగానొక్క కొడుకుగా ఆయన చూపిన ఆప్యాయత, ప్రేమ ఆధారంగా, తనమాట నెగ్గించుకోవాలని రమణ ప్రయత్నించాడు.

"అదీ అంత విపరీతంగా పరిణమించేది కూడా కాదు ఇద్దరిలో ఎవరైనా మెలకువ చూపినట్లయితే! కానీ యిద్దరికి అదే కొరవడింది ఈమధ్య ఒకసారి ఆయనతో మాట్లాడుతుంటే ఆయనే అన్నాడు మాటల సందర్భంలో,

విశ్వనాథం ! మావాడు నిజంగా, దయలేనివాడయ్యా ! కాకపోతే, ఇన్నాళ్ళయింది, ఒక్కసారన్నా నా యోగక్షేమాలు, ఎలా ఉన్నాను ఏమన్నా ఆలోచించాడా ! తండ్రన్నమాటే వాడికి జ్ఞాపకం లేకుండా పోయింది

బొటబొటా కళ్ల నీళ్ళు జారినయ్

"అప్పుడు ఆయనను బాగా పరిశీలించా! నిజంగా ఆయన హృదయం, మారిందా, అందులో నిజాయితీ ఉన్నదా అని !

మీరైనా వెళ్లివస్తే బాగుండేది ! ఎంతైనా కొడుకు గదూ ?

నేనా ?

ఒకతను వారపత్రికకు వ్యాసం వ్రాస్తూ "నేను యెందుకు జీవించాలి?" అని పేరు పెట్టి పంపాడు. వెంటనే తిరుగు జవాబు యిలా వచ్చింది. "మిత్రమా ! నీవు జీవించాలి. కారణం ఏమంటే నీవు వ్యాసం పోస్టుద్వారా పంపావుకనుక."

న. చ. సత్యనారాయణాచార్యులు
(తిరువూరు)

ఏం ? మీరే ! మీరు పోతే వాడు మటుకు మారడంటారా ? నేను ప్రశ్నించా.

నమ్మక మేమిటి ?

"ఆ ప్రశ్నకు నే నిజంగా ఆశ్చర్యపోయినాను ఇన్నాళ్లనించీ ఆయనకు నీమీద గల అభిప్రాయంలో నిన్ను నమ్మటానికి సంశయిస్తున్నాడంటే ఆశ్చర్యపడక చేసేదేముంది !

ఏం ? ఎందుకు మారడు ? వాడికి మాత్రం తండ్రిని, తన వున్నతికి కారణభూతుడనీ, తెలియదా ? వాడికి మాత్రం మీమీద ప్రేమ లేకుండా ఉంటుందా ! ఏదో ఆవేశంలో అలా వెళ్లిపోయాడే గానీ !

అంతేనంటావా ?

అక్షరాలా పెద్దవాళ్ళు, మీరే చొరవ తీసుకుని ఏమి జరగనట్లు అన్నీ మర్చిపోవాలి గానీ, వాడితో మీకు పంత మేమిటండీ !

అంటే ! అంటే ! .. అయితే రేపు వెళ్తాను ! ఏమంటావు ? తండ్రీ కొడుకుల మధ్య తగూ లేమిటి ?

తప్పకుండా వెళ్లండి

అలాగే వెళ్తాను. రేపే పోతాను .... నువ్వు గూడా రారాదూ !

"ఎలాగైనా మీ యిద్దరి మధ్య ఈ సమయం లోనైనా సయోధ్య కూర్చాలని, ఇదే అదను అని నిశ్చయించుకుని, అలాగే ! వాణ్ణి చూసి గూడ చాలారోజులైంది ఎలాగైనా చూసినట్లవుతుంది ! అని అన్నాను

అయితే యింకేం, రేపు ఏడింటికల్లా రా ! ఎనిమిది గంటల బండికి వెడదాం ! నేనే లోపల అక్కడికి తీసుకెళ్లాల్సిన సామాన్లు అన్నీ సిద్ధం చేయిస్తాను

అలా మీ యిద్దరి మధ్య సన్నిహితత్వం కలుపుదామని ఆశించాను

కానీ సాధ్యపడలా !

నే రాను విశ్వనాథం ! అన్నాడు మీ నాన్న మర్నాడు, నే వెళ్లేసరికి ప్రయాణమై !

ఏం ? ఎందుకు రారు ? ఏం జరిగింది ? ఆత్రంగా అడిగాను

ఏముంది జరగటానికి ? యింతవరకూ జరిగింది చాలదూ ! యింకా ఏం జరగాలి ? నన్ను, నా మాటను కాదని, ఎగిరితంతి వెళ్లాడే ! అట్లాంటివాడి దగ్గరకు ఏ మొహం పెట్టుకు వెళ్లేది ? నేను మటుకు మనిషినిగానూ ! నాకు మటుకు మానాభిమానాలు లేవూ ? వస్తే ఏనాటికైనా వాడే రావాలి ! అంతే ! నే మాత్రం పోయేది లేదు

"ఇలా అన్నాడు మీ నాన్న ! కానీ, ఒక్కటి, ఎంత దాచుకోవా లనుకున్నా, ఆయనలో, మమతకు, అభిమానానికీ మధ్య తీవ్రంగా సంఘర్షణ చెలరేగుతున్నది

విశ్వనాథం! రాత్రంతా నిద్రపోలా ! ఏమిటో ఆలోచిస్తూ, గొణుక్కుంటూనే తిరుగుతున్నారు. రాత్రి సరిగ్గా భోజనం గూడ చెయ్యలా !

ఆయ నటు వెళ్లింతరువాత నరసమ్మ వచ్చి చెప్పిం దీ సంగతి ప్రస్తుతం నరసమ్మే ఆయనకు వండి, యిల్లు చక్కదిద్దుతున్నది

నర్సమ్మ !

రమణ ఆమెను పిన్నమ్మా అని పిలుస్తాడు. అలా అని ఆమెకు, రమణకూ బంధుత్వ మేం లేదు ఋణబంధం తప్ప ! చిన్నప్పుడు రమణను ఆమె పెంచింది ఆమె ఎవరో, ఏమిటో ఈనాటికీ రమణకు తెలియదు తెలుసుకోవాలని ప్రయత్నించనూ లేదు ఇష్టమైనప్పుడు ఉంటుంది కానప్పుడు అంతర్ధాన మవుతుంది ఉన్నప్పుడు మాత్రం ఆ ఇంటికి ఆమె సర్వాధికారిణి

ఆయనలో జరుగుతున్న అంతః సంఘర్షణ దానురాను తీవ్ర మవుతున్నది ఎప్పుడన్నా వీలు చేసుకుని ఆయన దగ్గరకు వెళ్తున్నా! ఒక్కోసారి ఉన్న స్థితిలో మరోసారి ఉండటంలా ! ఆమధ్య ఒకసారి వెళ్తే యింట్లో లేడు నర్సమ్మే ఉంది.

ఎక్కడి కెళ్లాడని అడిగా.

గుళ్లోకి

నిజమా !

ఇలారా ! అని వెంట తీసుకుపోయింది.

"మేడమీది గదిలోకి వెళ్ళాం అక్కడ మీ అమ్మ పెద్ద ఫోటో ఉంది గదూ ! ఆ పటాన్ని






# యాదృచ్ఛికం

బాగుచేయించి చుట్టూతా చిన్న చిన్న ఎలక్ట్రిక్ లైట్లు పెట్టి ఉన్నాయి ఓ పూలమాల, పటం ముందు అగరుబత్తీ వెలిగించినవి ఉన్నాయి. ఇంకా కుంకుమ, పసుపు యివన్నీ గూడా ఉన్నాయి.

"నాకేమీ అర్థంగాలా !"

"క్రింద వంటగది, ప్రక్కనున్న గదిలో ఇన ప్పెట్టె ఉన్నదాంట్లో, పూజామందిరం ఏర్పా టైంది అందంగా ఉన్న ఓ కొయ్య మందిరం, అందులో సీతారామలక్ష్మణ ఆంజనేయ సహిత విగ్రహాలూ, ఇంకా లక్ష్మీదేవి, వెంకటేశ్వర స్వామి, బ్రహ్మంగారి పటమూ యివన్నీ ఉన్నయ్! పైన దణ్ణెముకు పట్టుబట్ట ఆరేసి ఉంది. క్రింద యివతలగా ఓ చిన్న పీటమీద భగవద్గీత, తావళాలు తదితరపూజాసామగ్రులు ఉన్నయ్.

"అప్పుడు అర్థం చేసుకున్నా పరిస్థితంతా !

నెలబట్టీ, ఈ పూజా పునస్కారాలు, చన్నీళ్ల స్నానమూ, నేలమీద గుడ్డ పరుచుకునే నిద్ర పోవటమూ, భగవద్గీత పారాయణ ... ఏమిటో అంతా అగమ్యంగా ఉంది. ఇన్ని చేసి, వాచేతి కూడు. ఎవర్నయినా మంచి వంట బ్రాహ్మణ్ణి మాట్లా డతానంటే 'ఏమీ వద్దు, నువ్వు చాలు నాకు' అని అన్నారు !" అనంది నర్సమ్మ.

"ఇంతకీ నువ్వేకులం నర్సమ్మా !" ఆమా టడిగేసరికి, అక్కడ్నుంచి వెళ్లిపోయింది.

"కాసేపుండి, నే బయటి కెళ్తుంటే మీ నాన్నగారే ఎదురొచ్చారు. మొహాన ఆంజనేయ స్వామి సింధూరం, చెవుల్లో పూలు, మెళ్లో రుద్రాక్షమాల, మనిషి బాగా చిక్కిపోయి ఉన్నారు చేతిలో బాలకృష్ణుని బొమ్మ చూపించి "ఎలా వుంది ?" అనడిగారు.

బాగానే ఉంది.

చూడు ! ఈ బొమ్మే యింత అందంగా, బావుందే ముద్దొస్తూ ! నిజంగా ఆ బాల కృష్ణుడు యింకెంత బావుండేవాడో ? అలాగే ఆలోచిస్తూ, ఎటో చూస్తూ నిలబడ్డారు ఆయన!

"ఆయన్ను ప్రస్తుతం నువ్వు చూస్తే విస్తు పోతావ్ ! చాలా చిక్కిపొయ్యారు. బుగ్గలన్నీ పీక్కుపొయ్యాయి. కళ్లల్లో, మాటల్లో యిదివర కున్న గాంభీర్యం, వాడితనం, అన్నీ అదృశ్య మైనాయి. ఇంతగా ఆయన ఎందుకు మార్పుకు ప్రయత్నిస్తున్నాడో అర్థంగాలేదు.

ఇదో చూడు విశ్వనాథం! మంచి ఉయ్యాల వొకటి కావాలోయ్ ! నీకు తెలిసినచోట ప్రయ త్నించు ఏం ! మర్చిపోతావా ?

ఎందుకు ?

ఎందు కేమిటయ్యా ! ఈ బాలకృష్ణుణ్ణి రోజూ జోలపాడి నిద్రపుచ్చొద్దూ ! లేకపోతే మా చిన్నతండ్రి మారాము చెయ్యడు ! అని ఆ బొమ్మను ముద్దుపెట్టుకున్నారు ఆప్యాయంగా.

మీ రమణకు కొడుకు పుట్టాడు ! తెలుసా ?

నిజంగానా ! ఒక్కసారి ఆయన కళ్లల్లో విద్యుత్తు వెలిగింది. ఒళ్లంతా, ఎందుకో ఉబి

కింది ! అంతా క్షణం.

ఎప్పుడు పుట్టాడు ! నాకు చెప్పలేదేం. ఇన్నాళ్ళబట్టీ. ఎలా ఉంటాడు ఏమిటో పోదా మంటే వీలు చిక్కటంలా ఈసారైనా పోయి రావాలి. కొడుకుతో పగ గాని, మనమడితో నాకేం ఉంది ! ఏమంటావు ?

నిజం, మనమడిని తెచ్చుకోండి.

వూరుకుంటావా ఏమిటి ? వాడ్ని నా యిష్టం వచ్చినట్లు పెంచుతాను, ఏమంటావ్ ! వీడు ఎలాగూ . నా మాట . వినలేదుగదూ ! వాణ్ణయినా జాగ్రత్తగా పెంచాలి! అయినా విశ్వనాథం ! ఇంత బంగళాలో నేనూ నర్సమ్మేనా ఉండాల్సింది ! కొడుకూ, కోడలూ, పిల్లలూ అంతా కళకళ లాడుతూ ఉండాల్సింది పోయి. ఏమిటీ నిశ్శబ్దం ! పిడిరాళ్లలా యిద్దరం ! రవణకు మటుకు యింత ఆస్తి ఉండి, వెధవ అణాకానీ ఉద్యోగం చెయ్యాల్సిన అగత్య మేమిటి ? నామాట వినలేదు గానీ, ఏ కలెక్టర్లో, డైరెక్టర్లో చెయ్యకపొయ్యేనా ?

జరిగిందేదో జరిగిపోయింది. యిహనైనా అంతా ఒకచోట ఉండండి !

నాకూ అలానే అనిపిస్తుంది విశ్వం ! నాకు మటుకు కొడుకు, కోడలు హాయిగా తిరుగుతుంటే చూడాలని లేదూ ! అది పోతూ, పోతూ నాచేత ఒట్టు కూడా వేయించుకుంది, "వాడికి ఏ కష్టం రాకుండా పెంచుతారు గదూ ! .... యిహ అన్నీ మీరే ! ... మరో భార్యని మీరు తెచ్చుకున్నా వాడిని మాత్రం కష్టపెట్టకండి. అదే కావాల్సింది నాకు. నామాట కాదనకండి ! ఎన్ని జన్మ లెత్తినా, ఏ లోకాన ఉన్నా, మీ సాన్నిహిత్యాన్ని మీతో గడిపిన రోజుల్ని మర్చిపోలేను. అని అంది విశ్వం ! కానీ యిచ్చిన మాట దక్కించుకోలేకపోయినా ! కనీసం వాడు మాత్రం నా సంగతి తెలుసుగా, తెలిసీ తొందరపడట మెందుకు చెప్పు !

ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే, నీకు యీ విషయా లన్నీ తెలియవు. ఎంతగా ఆయన హృదయం క్షోభపడి నలిగిపోతున్నదో తెలియ చెప్పటానికి ! ఆయన చేసే పూజలూ, స్నానాలూ, ప్రతిచర్య, నీ నుంచి ఆశించిన సౌఖ్యానికి కలిగిన నిరాశను కప్పిపుచ్చుకోటానికే ! నీ ఆ చర్యవల్ల తనకేం నష్టంలేదని, తెలియజెయ్యాలని లోకానికీ, మనసులో మండే ఆశను నిరాశను ఈవిధంగా దాచుకుంటున్నాడు. కానీ ఆ ముసలి గుండెలో నీకోసం ప్రతిభాగం తపించిపోతున్నది. ఇలాగే కొన్ని రోజులు గడిస్తే పరిస్థితు లెంత విషమంగా మారుతాయో వూహించలేను

ఇదీ విశ్వం ఉత్తరం

ఉత్తరంలోని విషయాలు, జీవితంలోని సంఘటనలు అన్నీ ఒక్కసారి పర్యాలోకనం చేసుకుంటే, చాలా ఆశ్చర్యకరంగా అవుపడ్డవి రమణకు

చాలా చిన్నవిషయాలమీద తండ్రీ, కొడుకులు, అనుబంధాలు, ఆత్మీయత తెంపుకుని వేరైపోవటం ఆశ్చర్యమే. కానీ ఆ పశ్చాత్తాపం మూడు సంవత్సరాలక్కానీ అనుభవంలోకి రాలేదు

అపూట ఆఫీసుకి సెలవు వ్రాసి, భార్య యామినిని, కొడుకును తీసుకు బయలుదేరాడు తండ్రి దగ్గరకు.

దారిలో కూడా ఆలోచిస్తూనే ఉన్నాడు రమణ, తను యిద్దరిమధ్యగల వైరుధ్యానికి గల కారణాలు

యామినిని రమణ ప్రేమించాడు. యిది లోకానికి తెలిసిన యథార్థం!

యామిని తండ్రి జూదరి, త్రాగుబోతూ, పైగా దొంగ కూడా ! పేరు వీర్రాజు.

వీర్రాజు, వెంకటరత్నం గారలు దూరపు బంధువులు, అంతకుమించి స్నేహితులు.

కానీ ఆ స్నేహం, ఆ బంధుత్వం, ఒకానొక సందర్భంలో అక్కరకు రాలా !

వీర్రాజు భార్య, భర్త దురలవాట్లకు, చెడు నడతకు బాధపడ్డది. సహించినన్నాళ్ళు, సహించి వూరుకుంది.

జీవనం సాఫీగా జరగటమే కష్టంగా ఉన్న గడ్డురోజుల్లో భర్త దుబారా ఆపటానికి ఆమె ప్రథమ యత్నంగా వెంకటరత్నంగారి సహాయాన్ని అర్థించింది

వెంకటరత్నంగారు మిత్రుణ్ణి హితుడిగా, స్నేహితుడిగా చెప్పి చూశారు. ఫలితం నాస్తి. ఆఖరి యత్నంగా అధికారపు హోదాతో వీర్రాజుగారిని జూదరిగా పట్టుకున్నారు.

"మానం, అభిమానం ఉన్నవాడికి యింతకన్నా అప్రతిష్ట లేదు రాజా ! మనిషి, మర్యాదగా, మంచిగా బ్రతికితేనే మానవజన్మ సార్థకం. చూడు, ఈ వెధవ పనులవల్ల లోకంచూపులో చులకన గావటం, తప్ప ఫలిత మేముంటుంది ? ఇప్పటికైనా సక్రమంగా నడుస్తానంటే విడుదల చేయిస్తాను లేదా, నా బాధ్యత విషయంలో బంధుత్వానికి! స్నేహానికి విలువ వుండదు "

అని వెంకటరత్నంగారు హితబోధ చేశారు. వీర్రాజు ఏమీ మాట్లాడలేదు. నిశ్చలంగా నిలబడ్డాడు. మౌనాన్ని అంగీకారంగా యెంచి వీర్రాజును విడుదలచేయటం జరిగింది.

కానీ నిజంగా వీర్రాజు హృదయం, పరివర్తన పశ్చాత్తాపత చెందలేదు. అభిమానం ఆవేశం ప్రతీకారవాంఛ చెలరేగినయ్ ! తనకున్న అధికారాన్ని ఈ విధంగా తనమీద ప్రయోగిస్తున్నాడనే దురూహ కలగటం జరిగింది. ఫలితంగా, ఇంటికి వెళ్లిందే తడవుగా, భార్యను చితకతన్నాడు. నెలలు నిండిన ఆ మాతృమూర్తి, నిలువునా కూలి ప్రాణాలు విడిచింది

ఆ దృశ్యం చూసి వెంకటరత్నం చలించాడు నిండు గర్భవతి ఒక దుర్మార్గుడి దౌష్ట్యానికి బలైపోయింది. చిక్కి, శల్యావశిష్టమైన ఆమె మరణం చూస్తే దేహం కంపించిపోయింది, చూచిన జనానికి

ఇదంతా జరిగిన నెలరోజులకు వీర్రాజు యావజ్జీవిత ఖైదీ కావటం, యామిని బోర్డింగ్ స్కూల్లో జేరటం జరిగింది.

ఇదంతా యామిని చిన్నతనంతో జరిగింది. అప్పటికి రమణకు పధేళ్ళు, చూచాయగా అన్నీ జ్ఞాపకమే.

(39-వ పేజీ చూడుడు)



# జేబులూ — గుండీలూ

క్రొవ్విడి లక్ష్మన్న

నిన్న గోపాలరావుగారింట్లో విస్తరి ఉగాది కదూ, సరదాగా కాలక్షేపంచేద్దాం రమ్మన్నాడు. నేను వెళ్ళేసరికి అప్పుడే తలంటుపోసుకుని, కొత్త సూటు తొడుక్కుంటున్నాడు గోపాలరావు ఫ్యాషన్లకి పెట్టింది పేరు వాడో. నన్ను చూడగానే వో మందహాసం పారేసి, స్టూలుమీద కూచుని మేజోళ్లు తొడుక్కుంటూన్నవాడల్లా నిటారుగా నుంచుని, కాళ్ళు ఒక్కసారి రలాయించి, ముని వేళ్ళతో సిల్కుషర్టు పంట్లాంలోకి సర్దుకుంటూ, "షర్టు బావుందా? జేబుల్లేవు మరి" అన్నాడు జేబులమయంగాఉన్న నా ఉడుపులు చూస్తూనూ.

"నిజం చెప్పొద్దూ, జేబుల్లేకపోతే యేదో వెలితిగ ఉంటుంది నాకు" అన్నాను. అక్కణ్ణుంచి జేబుల పుట్టుపూర్వోత్తరాలు ఆరాతియ్యడం మొదలెట్టేం "జేబుల చరిత్ర" అంటూ యెవ్వడూ రాసేడుకాడు కాని, వాటి సంగతి తరిచి చూసినకొద్దీ జేబులు ఎంత ఎక్కువగాఉంటే దుస్తులు అంత నవనాగరికంగా ఉన్నయేమో ననిపిస్తుంది.అసలా మాటకొస్తే జేబులే లేకపోతే దుస్తుల్లో నాగరికతే కొరతపడేదేమో! మరీ అన్ని జేబులు అనవసరం అనుకుంటారు కొందరు. కాని నిజం ఒప్పుకోవాలిసివస్తే అనవసరం అయిన వస్తువులు ఎన్ని ఉంటే అంత "మోడర్న్" అన్న మాట తట్టక మానదు. ఒక్క నిమషం మీరే ఆలోచించండి. నాలుగుమూలలా వెలుతురు వెదజిమ్ముతూ ప్రకాశిస్తూన్న బల్బుకి చుట్టూ వో 'డోము!' అది లేకపోతే "ఏవిటో వెల్తురు మరీ ఎక్కువగా ఉంది! ఆ 'డోము' బురఖా తొడిగేస్తే చాలా బావుంది' అని మెచ్చుకుంటాం. అది అలా ఉండగా వెలుతురు చాలనట్టు టేబిలు లైటు కూడా ఉంటేనేగాని, బల్లమీద హంగు పూర్తికాదు. ఈ పంపిణిలోదే సేవింగు ఫేను ఉంటూ ఉండగా టేబిలు ఫేను! అనవసరప్రసక్తివచ్చి, ఏదో పట్టా తప్పిపోయేనులాగుంది— జేబుల గురించికదూ అంటున్నానూ?

మరేం. నా సూటు చూస్తే—ప్యారిస్‌లో కుట్టించింది సుమండీ, ఏవిటో అనుకునేరు!—వో డజను జేబులు కనిపిస్తాయి, కోటుకి అయిదూ, వేస్టుకోటుకి మూడూ, పంట్లానికి నాలుగూనూ. సివిలియన్‌సూటుకి అంతకన్నా ఎక్కువ జేబులు ఉండడానికి మరి అవకాశంలేదు మిలటరీవాళ్ళపంట్లాంకయితే పై తొడలమీదుగా జేబులుంటాయి. కాని వాళ్ళవూసు మనకెందుకూ ?

అయితే యీ జేబుల చరిత్రలో విచిత్రం ఏవిటీ అంటే అవి అన్నీ పాపం మొదట్లో ఎందుకో ఒకందుకు ఉపయోగించాలని నిర్దిష్టంగా ఏర్పడ్డాయి టెయిలర్ల ధర్మమా అని. కాని మానవుడున్నాడే అది ఆపనికి ఉపయోగించకుండా ఎలా ఉండడమా అని ఆలోచిస్తూ ఉంటాడు. ఎప్పుడూను! మాట చెబుతున్నాను. ఎవడో టెయిలరు ఎంతో ఆలోచించి, విడిగాఉన్న పై జేబులో పెట్టుకుంటే విలువయినవస్తువ క్రిందపడిపోయి పాడయిపోతుంది కదా అని, ఆ షర్టు పై జేబుకి పక్కనించే "వాచీ పోకెట్టు" ఒక్కటి చమత్కారంగా సృష్టించేడు. కాని ఆ వాచీ జేబు ఏ ముహూర్తాన సృష్టించాడో కాని, పాపం ఆ వాచీలే వాడడం మానేసేరు ప్రజలు. రిస్టువాచీ ఫేషనయిపోయింది. వాచీ జేబు పూరికే ఉండిపోయింది. కాని, వాచీ జేబులేనిదే బెంగాలీ కుడతా కళ్ళపడదు, యిప్పటికీనీ. వాచిజేబు గురించి ఏదో చమత్కరించేను అనుకుంటున్నారు కాబోలు. అబ్బే—మీ కోటు పైపోకెట్టే తీసుకోండి మాటకి. క్రిందటి శతాబ్దంలో కేవలం జేబు రుమాలుకోసమే పుట్టింది అది. అందుకేకాదూ వస్తువపేరు కూడా 'జేబురుమాలు" అయిపోయింది! కాని ఉపయోగించే మానవుడి బుర్ర పని చేస్తూనే ఉంది. వెంటనే ఫేషను మారిపోయింది ఆ జేబు జేబులా ఉండిపోగా,రుమాలు మాత్రం కోటు చేతుల్లో స్థావరం ఆక్రమించుకుంది.

నిజం చెప్పాలంటే, జేబులు పుట్టేసరికి వాట్ని ఎలా నిరుపయోగంగా ఉంచడమా అన్న ఆలోచనే నాయె, మానవుడికి!పంట్లాం జేబుల్లో చేతులుపెట్టుకువిఆఫీసరుముందు నుంచుంటే ఇంకేమయినావుందీ? పంట్లాం జేబుల్లో చేతులు పెట్టుకోవడం 'సభ్యత' కాదని స్కూలు మాస్టర్లు చెవులు నులిమి చెబుతారు—డాక్టర్లయితే బొత్తిగానూ—గూని వస్తుందిట. అసలు పంట్లాం జేబులు అంత నిరుప





యోగం అయితే, ఆదిలో ఎందుకు పుట్టేయి? అందులోనూ రెండెందుకూ? ఇన్ని అనుకున్నా జేబుల్లోందే పంట్లాం అని మాత్రం అనిపించుకోదు.

పంట్లాం జేబుల మాట అలా ఉండనివ్వండి. కోటుకిఉన్న జేబులు కూడా సవ్యంగా వినియోగించుకుంటున్నా'వా అని నా సందేహం కాని యదార్థం ఆలోచిస్తే మట్టుకు మొగాడికి కావలసిన నిత్యావసరాలు అన్నీ రెడీగా ఉంచుకోడానికే పుట్టేయి ఈ జేబులు—బస్సుస్టాండు దగ్గిర కొనుక్కున్న పత్రికా, రైలు స్టేషనులో కొనుక్కున్న నోవెల్సూ, నక్షత్ర ఫలితాల పుస్తకాలూ, సిగరెట్టు ప్యాకెట్లు అగ్గిపెట్టెలూ, కలం, పెన్సిలూ, తాళాల గుత్తి, మనీపర్సూ యిత్యాదులు వోసారి తెల్లవారుఝాంనే ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. కుంపటి అంటించి కాఫీ కాద్దాం అనుకుంటే మా ఆవిడకి అగ్గిపెట్టె దొరకలేదు యిల్లంతా గాలించినానూ. చెడ్డ విసుక్కుంది కాఫీ అందివ్వలేకపోయినాను కదా అని. ఆ తరవాత నేను బట్టలు తొడుక్కుంటూంటే సూటు జేబుల్లోంచి బయట పడ్డాయి—మూడు పెట్టెలూ, వో లైటరున్నూ!! కాని స్టూడెంటుగా ఉన్నంతకాలవూ మాత్రం వీటిని సవ్యంగా ఉపయోగించుకోలేకపోయేను. (జేబులు సుమండీ అగ్గిపెట్టెలుకావు — అవి పాపం నిత్యాగ్నిహోత్రానికి బాగానే తోడుపడేవి) ఆ రోజుల్లో అంటే స్టూడెంటుదశ రోజుల్లో జేబుల్లో వస్తువులు పెట్టుకుంటే సూటు ఆకారం చెడిపోతుందని నమ్మకం. బంగాళాదుంపలు వేస్తే బస్తా ఆకారం చెడిపోతుందా? కాని ఏవిటో ఆ రోజుల్లో అలా అనిపించేది—యిప్పటికీ స్టూడెంట్సుకి అలాగే అనిపిస్తుంది "ఆ నయాపైసలన్నీ




అక్కడ పారేసి, రెండు రూపాయి నోట్లు పట్టికెళ్ళకూడదు కక్కా? చూడు, ఆ సిల్కు కోటు జేబు ఎలా సాగిపోతోందో కోతిదవడల్లాగ!!" అంటూడు మా అన్నయ్య కొడుకు నానిగాడు. అంతెందుకూ మొన్నమొన్నటి ముచ్చట—హఠాత్తుగా మీటింగుకి వెళుతూ చొక్కాజేబులో ఏవో వో దొంతి ఉత్తరాలూ, కోటులోపలిజేబులో పర్సూ, ప్యాసు పోర్టూ ఆజాపతు తతిమ్మా కాగితాలూ, పైజేబులో రుమాలూ ఆ వీ యి వీ యేవో పెట్టుకుని ఎయిల్‌డ్రోముకి వెళ్ళేసరికి—



అక్కడ ఎక్సయిజు గుమాస్తా నాఘాతీ ఒక్కక్షణం పరీక్షగా చూసి—నన్ను కాస్త మెడికల్ ఆఫీసరికి వప్పజెప్పేసేడు మొగాడినో ఆడదాన్నో తెలీకా! ఇంతకీ చెప్పొచ్చేదేవిటంటే, జేబుల్లో వస్తువులు పెట్టుకుంటే సూటు పాడయిపోతుందనే సూత్రం నాకు అర్థంకాలేదు బట్టలు పెట్టుకుంటేసూటుకేసు తగులబడిపోతుందా? ఏవిటో చాదస్తపు కబుర్లు

జేబులు ఒక్కటే యిలా అలంకరణార్థం మిగిలిపోయేయి అనుకునేరు! గుండీలు మరీనీ!! బుష్ షర్టుకి కాలరుకింద ఎందుకూ ఆ బొత్తాయి? కానీ, అదే లేకపోతే "అబ్బీ పెయిలరేకుట్టేడా ఆ బుష్‌షర్టు? లేకపోతే చవకని ఏ గోడారివాడి చేతనయినా కుట్టించేసేవా?" అని పరామర్శిస్తారు మిత్రులు కోటుకయితే చేతులక్రింద చెరి నాలుగు బొత్తాయిలు ఉండవలసిందే అజాగళస్తనాల్లాగ 'స్పోర్ట్సు' కోటు అయితే ప్రతీ జేబుమీదా వో కొమ్ముగుండీ ఉండితీరాలి. నడుంమీద పట్టీకి యిరుపక్కలాఉన్న రెండూ కాక! అవి పెట్టుకోవడం మాత్రం నిషేధం. డబుల్ బ్రెస్టు కోటుకయితే కాజాలయినా లేకుండా కనీసం రెండు బొత్తాయిలు అఘోరిస్తాయి. సింగిల్ బ్రెస్టుకోటు చివర గుండీ కాజా ఉన్నా పెట్టుకోవడం ఫ్యాషనుకాదు కాలక్రమేణా ఒక్కొక్కటి చొప్పున ఆ వేస్టు కోటు బొత్తాయిలు ఏవీ పెట్టుకోవడం ఫ్యాషను కాకుండా పోయినా, బొత్తాయిలు మాత్రం చిరస్థాయిగా నిలిచిపోతాయి అనడానికి సందేహం లేదు—సింగిల్ బ్రెస్టు కోటుగుండీల్లాగ హాఫ్‌హేండు షర్టుపై గుండీ గూడా యీ పంపిణిలోకే వస్తుంది.

ఇహ మిలటరీ డ్రెస్సుల బొత్తాయిలయితే లెక్కాపత్రం లేదు. వాళ్ళ యూనిఫారాలకి ఆ బొత్తాయిలు వో అలంకారం అన్నీ యిత్తడి గుండీలూ అవీ అవడం మూలాన్ని, వాటిని పోలిష్ చేసి దర్జా వెలిగిస్తారు వాళ్ళ వాళ్ళ బొత్తాయిలు అలా వెలగనూ వెలుగుతాయి మెరిసిపోతూనూ. కాని మనవో? కత్రతోనో, కొమ్ముతోనో, ప్లాస్టిక్‌తోనో చేస్తారు—వెలాతెలాపోతూనూ. పైగా బట్ట తాలూకు రంగుతో యిమిడిపోయి మరీ యేడుస్తాయి. ఎవడి కంటయినా పడితే దిష్టి గొట్టిపోతుందేమోనన్నట్టు! అయినా సూటూ అనుకునేసరికి వెరశి యిరవైయ్యెనిమిది బొత్తాయిలూ ఉండాల్సిందే మూడు ముక్కలకినీ. వాటిలో ఏ ఒక్కటి తక్కువయినా ఎంత వెలితి! ★



# రాశిఫలాలు




**24-5-1961 బుధవారము మొదలు**
**30-5-1961 మంగళవారము వరకు**

## మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఎంత శ్రమనైనా భరించగలుగుతారు. కాని, అవతలివారికి సంతృప్తి కనుపించకపోవటంవల్ల విసుగుదల వస్తూఉంటుంది. మీ ఆరోగ్యం ఇంతకు ముందుకన్నా మేలుగా ఉంటుంది. వ్యాపార వ్యవహార రంగాలలో మీరు అనుకున్నంత సులభంగా ముందుకు పోయినా బుద్ధిబలంతో అంతస్తు, ఆదాయము తగ్గకుండా చూచుకోగలుగుతారు. చాలాకాలంనుంచి లావాదేవీ జరిపే మనుష్యులతో కలహ ప్రసంగాలు రాగల అవకాశా లున్నవి. బంధుమిత్రులకు మీరు వ్రాసే ఉత్తర ప్రత్యుత్తరాలలో పొరపాట్లు రాకుండా చూచుకొనండి. కుటుంబవిషయాలలో ఏర్పడిన అసంతృప్తి తొలగిపోతుంది. మీరు కోరితే అప్పు లభిస్తుంది. కాని ఈ సమయంలో అటువంటి పనులకు దిగటం మంచిదికాదు. 28, 29 సాటివారి సహాయంతో కార్యసిద్ధి, బంధు విరోధం, వృధా ఆందోళన.

*　*　*

## వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఎవరితో ఏవిధంగా పరిచయం కలుపుకుందా మనుకున్నా అవకాశం లభించకుండా పోతుంది. ఏదోవిధంగా విశేషంగా డబ్బు చేతికి వస్తూ పోతూ ఉంటుంది. బంధువుల మూలంగా ఖర్చులు అధికమవుతవి. అధికారులతో అభిప్రాయ భేదాలు వచ్చి నిదానంగా అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. మీ అప్తులలో కొందరు మాత్రం మీ మాటను చక్కగా బలపరుస్తారు. ఈ సమయంలో ధనం కొంచెం అధికంగా పెట్టుబడి పెట్టవలసి వచ్చినా ఆందోళన చెందవలసిన అవసరం కనుపించదు. కుటుంబంలో సుఖము, శాంతి లభిస్తవి మీ వృత్తి, ఉద్యోగాలలో ఏమైనా చిక్కులు రావచ్చుననే భావం తోస్తుంది. దైవబలం బాగున్నందున ప్రశాంతంగా జరిగిపోతుంది. 29, 30 లలో కుటుంబంలోని వారికి అనారోగ్యం, పొరపాట్లు, వస్తు నష్టము.

*　*　*

## మిధునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

స్వశక్తితో నిలబడగలుగుతారు. ప్రతి పనీ సులభంగా జరుపుకునే విధానం తెలుసుకో గలుగుతారు. సంఘంలో పేరు ప్రతిష్ఠలు లభిస్తవి. ఉత్తరదిక్కునుంచి ధనలాభం ఉంటుంది. అయితే హాస్య ప్రసంగాలలో పాల్గొనటంవల్ల వాతావరణం విషమించకుండా చూచుకొనటం అవసరం కార్యభారం అధికంగానే ఉంటుంది కాని, నౌకరులు మొదలయినవారు సమయంలో సహాయం చేస్తారు. రాజకీయాలలో అధికంగా జోక్యం పెట్టుకోతగిన సమయం కాదు. పట్టుదలలు పెరుగుతవి. కాని, ప్రయోజనం కనుపించదు. అనేక ఆలోచనలు చేస్తూ ముందు చేయవలసిన పనులను మరచిపోతూ ఉంటారు కోర్టు కచేరీలలో అనుకూలత తక్కువ. 24, 25 లలో దైవ కార్యాలు, అధికారులతో స్నేహం.

### గ్రహస్థితి

వృషభంలో సూర్యుడు, మిధునంలో బుధుడు, కర్కాటకంలో కుజుడు, సింహంలో రాహువు, మకరంలో గురు, శనులు, కుంభంలో కేతువు, మీన మేషాలలో శుక్రుడు సింహ, కన్య, తులా, వృశ్చికాలలో చంద్రుడు.

*　*　*

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

ప్రస్తుతం క్రమక్రమంగా బుద్ధిబలాన్ని వినియోగించుకుని పది మందితో పేరు ప్రతిష్ఠలు పొందగలుగుతారు. కొన్ని కార్యక్రమాలలో సందేహాలు వచ్చినా ధైర్యంతో రంగంలో ప్రవేశించ గలుగుతారు పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. ధనాదాయం బాగుంటుంది. ఈ సమయంలో తమ గొప్పతనాన్ని ప్రదర్శించుకొంటూ మీవల్ల సహాయం పొందటానికి ప్రయత్నించేవారుంటారు. బంధుమిత్రులతో నిష్కర్షగా మాట్లాడవలసినఅవసరం కలుగుతుంది ప్రతి పనీ అసంపూర్తిగా నిలచిపోతూ ఉండటంవల్ల ధైర్యం తగ్గుతూ ఉంటుంది పట్టుదలతో మీ ధర్మాన్ని నిర్వర్తించుకొంటూ ముందుకు పోగలుగుతారు. దైవ కార్యాలు అంత ప్రోత్సాహకరంగా జరుపలేక పోవచ్చు. 29, 30 లలో నిరుత్సాహం, అపవాదులు.

*　*　*

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

మీరు ప్రయత్నం చేయకుండా ఉన్న సమయంలో ప్రతి పనీ జరిగేటట్లు తోస్తూఉంటుంది. తీరా మీరు ఆరంభించుదా మనుకునే సమయంలో అవకాశాలు వెనుకకుపోతూ ఉంటవి బెట్టు సరిగా ఉండి గౌరవం పొందవలసిన సమయం. దూరమందున్న స్నేహితులవద్దనుంచి అనుకూల వార్తలు తెలుస్తవి. వ్యవహార రంగంలో ఆదాయాన్ని మించిన ఖర్చులు కనుపిస్తవి. స్థిరాస్తులు మొదలయినవి కొనటం వంటి కార్యక్రమాలు ప్రస్తుతం నిలుపుకొనటం మంచిది. చాలాకాలంగా మీరు చేసిన శ్రమకు ఫలితం దక్కుతుంది వారం రెండవ భాగంలో తలవని తలంపుగా ఆదుర్దా కలిగే వార్తలు వింటారు విలువగల వస్తువులు కొనే ముందు ఉన్న ఉత్సాహం కొన్ని తరువాత ఉండదు. 25, 26 లలో కుటుంబంలో శుభకార్యాలు, అకస్మాద్ధనలాభం.

*　*　*

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా)**

వృత్తి వ్యాపారాలలో మీ అంతస్తు పెరుగుతుంది. ఏదైనా ఒక విషయం అనుకుంటున్న సమయంలోనే స్నేహితుల ప్రోత్సాహము, సహాయము లభిస్తవి. శత్రుబాధ తొలగిపోతుంది. శుభకార్య ప్రయత్నాలు నెరవేరుతవి. సాటివారి మెప్పు పొందగలుగుతారు. విందులు, వినోదాలు మొదలైన కార్యక్రమాలలో పాల్గొంటారు. ఈర్ష్య, అసూయలు గలవారు ఒకరిద్దరు మిమ్ములను ఒకవిధంగా హాస్యం చేయటానికి ప్రయత్నిస్తారు. కాని, చివరకు వారికే అవమానకరమైన పరిస్థితి ఏర్పడుతుంది. బంధువుల ఇండ్లకు ప్రయాణం చేయవలసి రావచ్చు. మధ్యమధ్య ఆదాయాన్ని గురించిన ఆందోళన కనిపిస్తూ ఉంటుంది. కాని, మొత్తంమీద లోపం లేకుండా జరుగుతుంది. 27, 28 తేదులలో ఇష్టవస్తు ప్రాప్తి, బంధుదర్శనం

*　*　*

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ఒక పని తలుచుకుంటే పూర్తి అయ్యేటంత వరకు ఆందోళన పడుతూ ఉంటారు కొన్ని దండుగ ఖర్చులు తప్పవు పైన పెట్టుకున్న భారం కొంత తగ్గే సమయంలో మరొక బాధ్యత పైన పడుతూ ఉంటుంది. మధ్యవర్తిత్వం వంటి కార్యక్రమాలు అధికంగా ఉంటవి ఆదాయం పెరుగుతుంది. కాని, అందుకు తగిన శాంతి, సుఖము అనుభవంలోకి రావు మీ సొమ్ము తిని మీమీద నింద మోపేవారు ఉంటారనే విషయం మరచిపోవద్దు ప్రయాణాలు సుఖంగా జరుగుతవి పిల్లల ఆరోగ్యం మాత్రం సరిగా ఉండదు. పదిమందిలో ఆడంబరంతో సంచరించ గలుగుతారు వారాంతంలో నిరుత్సాహము, నరములయందు బలహీనత కనుపించవచ్చు 27, 28 లలో సంఘ గౌరవం, వస్త్ర అలంకార వస్తుప్రాప్తి, ధన యోగం.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ఈ వారం మీరు ఎంత తొందర పడినా ఫలితం నిదానంగా లభిస్తుంది. మధ్య మధ్య విరోధులవల్ల చిక్కులు రాగల అవకాశా లున్నవి ఇతరులవద్ద నుంచి రావలసిన డబ్బును నమ్ముకుని ముందుగా ఏ పని ప్రారంభించవద్దు ఇతరులకు సంబంధించిన వ్యవహారాలలో మీకు శ్రమ ఎక్కువ అవుతుంది చక్కని యోచన, కార్య నిర్ణయంలో సమర్థత చూపగలుగుతారు ఎదురుచూస్తున్న వార్తలు సకాలంలో అందుతవి అధికారులతో పోటీచేసే అభిప్రాయం పెట్టుకోవద్దు అప్పులు కదా అనే భావంతో ఏ సమాచారము బయట పెట్టకొనటం మంచిదికాదు. 25, 26 లలో గౌరవప్రాప్తి, లాభవార్తలు.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

గౌరవము, ధనాదాయము బాగుంటవి మనస్సు మాత్రం అనేక రకాలుగా పోతూఉంటుంది ఏ విషయాన్నీ పూర్తిగా నమ్మలేకపోతారు. తల పెట్టిన పనులు స్వశక్తితో నెరవేర్చుకో గలుగుతారు బంధువులవల్ల ఖర్చులు పెరుగుతవి. వృత్తి వ్యాపారాలలో మీ మాటను చెలామణి చేసుకుని లాభం పొందగలుగుతారు. కుటుంబంలో స్వల్ప కారణాలతో ఆరంభమైన చర్చలు అశాంతికి దారితీయవచ్చు. ఇంతకుముందుకన్నా ఆరోగ్యం బాగుంటుంది అధికారము, గౌరవము గలవారితో పరిచయం లభిస్తుంది. స్నేహితులు మిమ్మును అనవసరంగా బాధిస్తూ ఉండటంవల్ల అసంతృప్తి ఏర్పడుతుంది. 26, 27 లలో వృత్తిలో అభివృద్ధి, వ్యవహార రంగంలో అనుకూలత

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)**

ఇంతకుముందు మీరు చాలా ఆసక్తి చూపిన వ్యవహారాలలో ప్రస్తుతం కొంత నిరుత్సాహం తోస్తుంది మీ నిత్యకృత్యాలలో చాలవరకు ఉత్సాహం, అభివృద్ధి కనిపిస్తవి ఈ సమయంలో ఆకస్మాత్గా జరిగే మార్పులు ముందు ముందు మీకు బాగా లాభిస్తవి తరచుగా దైవకార్యము లందు పాల్గొనగలుగుతారు వృత్తి వ్యాపారాలలో ఒకప్రక్క ప్రతిబంధకాలు కనుపిస్తున్నా మరొక మార్గంలో సహాయంచేసి మిమ్ములను ముందుకు నడిపించే మనుష్యులు లభిస్తారు పదిమందిలో మీ పెద్దరికం నిలుస్తుంది వారం రెండవ భాగంలో ఆదాయం బాగా పెరుగుతుంది ప్రయాణాలు చేయవలయు ననుకొంటారు కాని సాగవు. 27, 28, 29 తేదులలో మనశ్శాంతి, వ్యవహార పరిష్కారాలు, ధనలాభం.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ప్రస్తుతం ఆహార విహారాలలో జాగ్రత్తగా ఉండి ఆరోగ్యాన్ని కాపాడుకొనటం అవసరం ఉష్ణప్రకోపం చేయగల సమయం. ఆదాయం బాగానే ఉంటుంది వృత్తి ఉద్యోగాలలో చిక్కులు కనుపిస్తూ, అభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది పై అధికారులు మీమీద కోపంగా ఉన్నట్లు కనుపించవచ్చు కుటుంబంలో ప్రశాంతత లభిస్తుంది వినోద కార్యకలాపాలలో పాల్గొంటారు వ్యవహార విషయాలలో అసంతృప్తి, నష్ట సూచనలు ఉంటవి. విశేషంగా డబ్బుఖర్చు అవుతుంది కాని, చివరకు ఏ పనీ పూర్తికాదు అవకాశాన్నిబట్టి మసలుకొనటంవల్ల పదిమందిలో మర్యాద నిలుపుకో గలుగుతారు 29, 30 లలో శ్రమతో కార్య సాధన, నీచులతో కలహాలు.

* * *

## ఈవారము ధరలు

ఈ వారం రెండవ భాగంలో గాబంరుధర ఆకస్మాత్తుగా తగ్గి పెరగగల అవకాశాలున్నవి. వెండి ధర కొంచెం మందీలో నిలుస్తుంది. పసుపు ధర వారం ఆరంభంలో పెరిగి మరల తగ్గుతుంది వేరుశనగ పప్పు ధర పెరిగే అవకాశా లున్నవి. నూనె ధర మామూలుగానే ఉంటుంది. నూవుల ధర కొద్దిగా పెరుగుతుంది నూవులనూనె ధరలో పెద్ద మార్పులు కనుపించవు

మినుముల ధర గతవారంకన్నా పెరుగుతుంది కందుల ధరలో తాత్కాలికంగా మందీ ఆరంభం కాగల అవకాశా లున్నవి. గోధుమల ధరలో పెద్ద తేడా కనుపించదు

ప్రత్తి ధరలో గిరాకీ కనుపిస్తుంది. నూలు ధరలో తాత్కాలికంగా మందీ వచ్చి వారాంతంలో క్రమంగా పెరుగుతుంది.

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

ముఖ్యంగా బాహ్యా విషయాలలో మీ స్థితిగతులు బాగుంటవి విశ్రాంతి మాత్రం ఉండదు. ఇతరుల వ్యవహారాలలో పెత్తనం చలాయించగలుగుతారు. యంత్రాలు కొనటం, ఆస్తి వృద్ధి ప్రయత్నాలు మొదలయినవి చాలా అనుకూలంగా జరుగుతవి కుటుంబంలోనివారితో మాట కలవక పోవచ్చు ఎప్పటికప్పుడు గత విషయాలను మరచి పోగలుగుతారు గనుక మీ పనులు సులభంగా జరుగుతవి ఎదురుచూస్తున్న వార్తలు సకాలంలో అందుతవి అయితే ఉపయోగం తక్కువ క్రొత్త మనుష్యులతో ప్రసంగించవలసివస్తుంది. జాగ్రత్తగా ఉండవలసిన సమయం ప్రతి విషయము సమయంలో మరచిపోతూ ఉంటారు. వారాంతంలో దండగ ఖర్చులు. 25, 26 లలో ధన లాభం, శుభవార్తలు, వృత్తిలో గౌరవం ★



మా ఆవిడలాంటి పరమగయ్యాళి యిక పుట్టబోదనుకో.

-చిత్రకారుడు—ఎం. వెంకటేశ్వరశాస్త్రి (విజయపురి)

# మేనరికం

రంగధామ్



ప్రపంచంలో మానవుడికి అన్నిటికన్నా కష్టమైనదీ, క్లిష్టమైనదీ ఏదీ?—అని ప్రశ్నిస్తే 'తనను తాను తెలుసుకోవడం' అంటారు వేదాంతులు. ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా— ఆ మాట అక్షరాలా నిజం! — అంటాడు శ్రీధర్.

శ్రీధర్ వేదాంతి కాదు. కేవలం ఇంజనీరింగ్ డిగ్రీ పుచ్చుకున్న ఇరవై రెండేళ్ళ యువకుడు. అయినా అతను, ఈ బ్రహ్మాండ సత్యాన్ని గుర్తించే దానికి కారణం ఏమిటంటే, అతను ఇప్పుడు ఎదుర్కొంటున్న జటిల సమస్య. అది—తాను 'శశి' ని పెళ్ళాడగలడా? లేదా? అనే విషయం గురించి అతి తీవ్రంగా ఆలోచించి, ఏ నిర్ణయానికీ రాలేకపోవటం.

శ్రీధర్ తలిదండ్రులు, శ్రీధర్ మేనత్త కూతురైన 'శశి' ని శ్రీధర్ పెళ్ళి చేసుకోవాలని పట్టుబట్టారు, దగ్గర సంబంధం అవటంవల్లా రెండు వైపుల వారికీ పెద్దపెద్ద ఆస్తు లుండి వాటిని బయటికి పోనీయడం ఇష్టంలేకా.

పెద్దవాళ్ళు, ఎంత నచ్చచెప్పినా శ్రీధర్ అంగీకరించలేదు. శశి అంటే శ్రీధర్‌కి ఇష్టమే. ఇద్దరూ చిన్నతనంనుంచీ కలిసి మెలిసి ఆడుకునేవారు. ఒకరియందొకరికి ఆప్యాయతా, అభిమానం ఉన్నాయి.

కాని, పెళ్ళి చేసుకోవటమా!— అసంభవం అనుకొన్నాడు శ్రీధర్. శశియెడల తన కేనాడూ అటువంటి భావం కలుగలేదు. అసలు శశిని తన భార్యగా వూహించుకోవా లంటేనే, అదేదో చాలా చెడ్డపనిలా మనస్సుకు తోస్తుంది తనకు.

చిన్నప్పటినుంచి కలిసి మెలిసి తిరిగిన శశిని శ్రీధర్ చెల్లెలిగానో, స్నేహితురాలుగానో వూహించుకోగలడు కాని—భార్యగా, ప్రేయసిగా—అబ్బే! ఎంతమాత్రం లాభం లేదనుకొన్నాడు.

పెళ్ళి చేసుకోవాలంటే, ఆ—చేసుకోబోయే యువతిని చూడగానే, తనలో ప్రేమా, మోహం ప్రణయం అన్నీ ఉద్భవించాలి. రాగోదయం కావాలి. గుండె దడదడా కొట్టుకోవాలి. ఎలక్ట్రిక్ షాక్ తిన్నంత పనవ్వాలి. 'ప్రేయసీ, ప్రేయసీ, ప్రియుడనే ప్రేయసీ, వేయి కన్నులతో నిన్ను వెదుకుచున్నానే' అని వెళ్ళి ఆమెతో చెప్పుకోబుద్ధవ్వాలి. ఆమె తన దృష్టిపథంనుంచి జారిపోగానే—విరహం, నిట్టూర్పులూ, వెన్నెల వేడిగా ఉండడం, చంద్రుణ్ణి తిట్టటం, పాటలు పాడటం —ప్రారంభం కావాలి. ఆమె దర్శనంకోసం తహతహ లాడాలి. ఆమెకోసం ప్రాణాల్నయినా లెక్కచెయ్యకుండా గొప్పగొప్ప సాహసాలు చేసి, ప్రేమ

శేఖలు రాసెయ్యాలనిపించాలి ......

ఇంత గొడవ జరగవలసిన విషయాన్ని, తన తలిదండ్రులు అతి తేలికగా "నువ్వు శశిని పెళ్లాడెయి" అని ఒక్క ముక్కతో నిర్ణయించడం, శ్రీధర్ ఎంతమాత్రమూ హర్షించలేదు.

కాని పెద్దవాళ్లను ఎదిరించి, "నే నిప్పుడు పెళ్లాడను. నా వూహాసుందరి నా కళ్లెదుట సాక్షాత్కరించేదాకా ఆగుతాను. నాతోకూడా ఇంజను దగ్గర బ్రేకు వేస్తే తక్కిన పెట్టెలన్నీ ఆగిపోయినట్లు మీరంతా ఆగాలి!" అని చెప్పే ధైర్యం శ్రీధర్‌కు లేదనలేము కాని, కలగలేదు. ఎందుచేతో!

శ్రీధర్ ఎటూ తేల్చి చెప్పలేకపోవడం చూసి, శ్రీధర్ తండ్రి ఎందుకైనా మంచిదని శ్రీధర్‌ని ఒక్కసారి వాళ్ల మేనత్తగారి వూరెళ్లి శశిని చూసి అతని మనస్సులో ఉన్న విషయం వాళ్లతోనైనా చెప్పి రమ్మన్నారు.

అందుకు శ్రీధర్ వెంటనే అంగీకరించాడు. ఎందుకంటే శశిని చూసి చాలుగేళ్లయింది. తను ఇంటర్ పాసైనప్పుడు వాళ్ల వూరెళ్లాడు. అంత వరకూ ప్రతి సంవత్సరం, వేసంగి సెలవలకి మేనత్తగారింటి కెళ్లడం అతని కలవాటు. కాని, తను ఇంజనీరింగు చదువుకు మద్రాసు వెళ్లిన దగ్గర్నుంచి వాళ్ల వూ రెళ్లలేదు.

ఈ నాలుగేళ్లలోనూ శశి, బి. ఎస్‌సి. ప్యాసయిం దని విన్నాడు. ఇంకా పై చదువు చదువుతా నంటోందట. ఒకసారి ఆమెను చూస్తే తన మన స్సెలా మారుతుందో!—ఏమో!

అవాళ సాయంకాలమే రైలెక్కి మేనత్తగారి వూరైన విశాఖపట్నం బయల్దేరాడు శ్రీధర్.

శ్రీధర్‌కు రైలెక్కిన తర్వాత ఆలోచించు కోవడానికి కొంత అవకాశం లభించింది. బెజవాడ వదలిపెట్టి రైలు పరుగెడ్తూంటే, శ్రీధర్ సామానులన్నీ సర్దుకొని కూచొని ఆలోచించడం మొదలెట్టాడు, శశి ఎలా ఉంటుందా!—అని.

"ఒరేయ్, నువ్వట్రా! ఎవరో అనుకున్నాను. ఎక్కడికి వెళ్తున్నావ్?" అన్న మాటలు విని వంచిన తల ఎత్తి చూశాడు, తన ప్రక్కనే నిల్చొనివున్న తన పాత స్నేహితుడు శేఖరాన్ని

"వోహో! శేఖరమా! బలేవాడివిరా! ఇంత సేపు ఎక్కడున్నావ్?"

"ఆ చివర బెంచీలో కూచున్నానులే. అక్కడ మా అమ్మా, మా చిన్న చెల్లెలూ ఉన్నారు. మేమంతా విశాఖపట్నం వెళ్తున్నాములే. నువ్వు బెజవాడలో ఎక్కినట్లున్నావు ఏమీ రెళ్తున్నావు?"

శ్రీధర్ తను కూడా విశాఖపట్నం వెళ్తున్నానని చెప్పాడు శేఖరం తల్లి, చెల్లెలితో సహా తెనాలి నుంచి వస్తున్నాడు. శేఖరం, శ్రీధర్ బెజవాడ కాలేజీలో ఇంటరు చదువుతున్నప్పుడు సహాధ్యాయులు శేఖరం ఇంటర్ తరువాత బి. ఏ చదివి తరువాత బి. ఇడి పాసయి ఏడాదినుంచి విశాఖ పట్నంలో స్కూలు టీచరుగా పనిచేస్తున్నాడు.

పరస్పరం కుశల ప్రశ్నలు వేసుకోవడం జరిగాక శేఖరం శ్రీధర్‌ని తన తల్లి దగ్గరికి తీసుకొని వెళ్లి "ఇతనే నమ్మా శ్రీధర్. బెజవాడలో నాకు ఎంతో సాయంచేసిన ముఖ్య స్నేహితుడు" అని ఒక వయసు మ్ళ్ళిన స్త్రీకి పరిచయం చేశాడు. శ్రీధర్ ఆమెకు నమస్కరించాడు.

ఆమె "అలాగా నాయనా! నీ గురించి మా అబ్బాయి ఎప్పుడూ చెప్తూంటాడు. తనకెంతో సాయం చేశావని. చాల సంతోషం" అని శ్రీధర్ ఏం చేస్తున్నదీ, ఏం చెయ్యదల్చుకున్నదీ అన్నీ అడిగింది.

శేఖరం తల్లి, విధవ, అయినా ఆమె పచ్చని శరీరచ్ఛాయా, గంభీరమైన విగ్రహం, బొట్టు లేకపోయినా కళగా ఉన్న మొహం, చూసేవారిలో ఒకవిధమైన గౌరవం కలిగిస్తాయి. కొద్ది నిముషాల్లో శ్రీధర్‌ని తన కుటుంబంలో ఒకవ్యక్తిగా పరిగణిస్తూ మాట్లాడసాగింది.

రైలు ప్రయాణంలో ఉన్న విశేష మేమంటే కొన్ని గంటల తరబడి, మనకు సన్నిహితమైన వ్యక్తులతో మాట్లాడవచ్చు. ఎంత ముభావంగా ఉండే వ్యక్తయినా, ప్రయాణంలో ఉన్న విసుగు దలని పోగొట్టుకోవడానికి, తప్పక మాట్లాడతాడు. మామూలు సమయంలో అంత తీరికా ఉండదు. అంత అవసరమూ ఉండదు.

శ్రీధర్, శేఖర్ చాలాసేపు కాలేజీ ముచ్చట్లు మాట్లాడుకున్నారు. వాళ్లు విడిపోయిం తరువాత ఎవరెవరు ఏం చేసిందీ చెప్పుకున్నారు. మధ్య మధ్యలో శేఖర్ తల్లి ప్రశ్నలు వేస్తూ శ్రీధర్ తల్లిదండ్రు లెవరో అతనికి అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ ఎంతమందో, ఆస్తిమాత్రం ఉందో అన్నీ వివరాలు కనుక్కుంది.

శేఖర్ తల్లి మనస్సులో శ్రీధర్ తమకు అందుబాటులో లేడనుకుంది. శేఖర్‌కి పెళ్లీడు చెల్లెలుంది. శేఖర్ తల్లికి శ్రీధర్‌ను చూసిన దగ్గర్నుంచీ కొంత ఆశ కలిగింది గాని, అంత ఆస్తిపరుడూ, ఇంజనీరూ, కనీసం పదివేల కట్నమైనా ఇవ్వందే లభిస్తాడా! అని నిరాశ చెందింది.

శ్రీధర్ శేఖర్‌ని ఎం. ఏ. చదవలేకపోయావా? అని అడిగాడు. శేఖర్ తన తండ్రి చనిపోవటం వల్ల కుటుంబ బాధ్యతంతా తనమీద పడిందనీ, చెల్లెలు పెళ్లి చెయ్యవలసి ఉందనీ, అందువల్ల తన చదువు సాగలేదనీ, చెల్లెలికి బి. ఎస్‌సి వరకూ చెప్పించామనీ చెప్పాడు. —

శ్రీధర్ అడక్కుండానే, శ్రీధర్ మిత్రుడి కష్టాలకి సానుభూతి చూపిస్తూంటే శేఖరం మరి కొన్ని వివరాలు చెప్పాడు వాళ్లు తెనాలి, చెల్లెలి పెళ్లి విషయం వెళ్లామనీ, అక్కడ వాళ్ల మేనమామగా రున్నారనీ, వాళ్లబ్బాయికి తన చెల్లెలి నివ్వాలనుంది అనీ చెప్పాడు.

పెళ్లి, మేనరికం—మాటలు వినగానే శ్రీధర్ ఉలిక్కిపడ్డాడు స్నేహితుడు కనిపించాడుగదా ఏవో యితర గొడవలు మాట్లాడవచ్చు ననుకుంటే, ఇక్కడ కూడా పెళ్లిళ్ల గొడవే వచ్చింది. పైగా స్నేహితుడు మేనరికాల గురించి మాట్లాడేప్పటికి శ్రీధర్‌కి ఒళ్లు మండింది.

"ఒరేయ్, ఈ పెళ్లి అనేది లేకుండాఉంటే ఎంత బావుండునురా!"

"నిజమేరా, బ్రదర్! ఇవి మన ప్రాణాలు తీసేస్తున్నాయిరా! ఆడపిల్లల పెళ్లి గురించి, పరువుగ బ్రతకదలచినవాళ్లం, ఎంతో బెంగపెట్టుకుని చస్తున్నాం అనుకో."

"అది కాదురా! ఆడయితే నేం, మగయితేనేం. పెద్దవాళ్లు అనవసరంగా కలుగజేసుకుని వాళ్ల జీవితాలు నాశనం చేస్తున్నారు. పెళ్లి అనేది

ఇద్దరి వ్యక్తులకు సంబంధించింది. ఆ యిద్దరి వ్యక్తులకూ ప్రాధాన్యత లేదు. ఇప్పటి పెళ్లిళ్లలో, పైవాళ్లంతా పెత్తనం వహించడమే. మనం ఏమైనా అంటే పెద్దవాళ్లను ధిక్కరించినవాళ్ల మవుతున్నాం. వాళ్లు చేసే పనేమిటి—కట్నాలు బేరమాడ్డం, వాళ్లకు నచ్చిన సంబంధాలు అంట గట్టడం, చివరికి వీళ్లిద్దరికీ సుఖం లేకపోయినా ఆ విషయం పైకి రాకుండా చూడడం."

శ్రీధర్ మాటలకు శేఖర్ అతని తల్లీ కూడా నవ్వారు. ఒక్క నిముషం ఎవరూ మాట్లాడ లేదు. రైలు మోత అందరికీ, ఆ నిశ్శబ్దంలో, విన్పిస్తూ అంతవరకు వాళ్ళసంభాషణలో మైమర చిన వాతావరణాన్ని జ్ఞాపకంచేసింది ఒక ముష్టి వాడు పాటలు పాడుకుంటూ, అందరిదగ్గరా డబ్బులు వసూలుచేసున్నాడు—అడుక్కోడం వాడి హక్కుగా భావించి!

శేఖర్ తన స్నేహితుడి వాదంతో మనసులో అంగీకరించినా, ఎదురుగా తన తల్లి ఉండడం వల్ల పూర్తిగా బయటపడడం ఇష్టంలేక "కట్నాలనేవి మరీ బాధిస్తున్నాయిరా!" అన్నాడు.

శ్రీధర్ ఏదో ఆలోచిస్తూ "ఇవ్వడం మానేస్తే సరి" అన్నాడు.

శేఖర్, "ఇవ్వకపోతే పెళ్లిళ్లవడమే కష్టంగా ఉందిరా"

"అదే అవుతుంది. అనవసరంగా బెంగపెట్టు కోకురా."

రైలు తునిలో ఆగింది శ్రీధర్, శేఖర్ భోజనాలు చేసివచ్చారు. శేఖర్ తల్లి పాలూ, పళ్ళూ పుచ్చుకుంది. శేఖర్ చిన్న చెల్లెలు పూరీలు తిని వూరుకుంది అనుకోకుండా రైలు ప్రయాణంలో ఒకరి కొకరు తటస్థపడడం మిత్రుల కెంతో ఆనందం కలిగించింది మధ్యమధ్యలో కుటుంబ విషయాలు మాట్లాడుకొంటూ విశాఖపట్నం వచ్చేదాకా కబుర్లతో కాలం గడిపేశారు.

శ్రీధర్ని, శేఖర్ తమ ఇంటికి రమ్మన్నాడు. అవాళ ప్రయాణబడలికవల్ల రాలేననీ, మర్నాడు తప్పకుండా వస్తాననీ, శేఖర్ ఇంటి అడ్రసు తీసు కొని శేఖర్‌వద్దా, శేఖర్ తల్లివద్దా సెలవు తీసు కొని విశాఖపట్నం స్టేషను బయటికి వచ్చి రిక్షాలో సామాను పెట్టించాడు శ్రీధర్.

శ్రీధర్ రిక్షాను చెంగల్రావుపేట పోనిమ్మని, అక్కడ ఒక మేడముందు ఆపించాడు. లోపలికి వెళ్లగానే హాల్లో ఎవరితోనో ఒక నడివయ స్సామెతో, సోఫాలో కూర్చొని మాట్లాడుతున్న శ్రీధర్ మేనత్త, శ్రీధర్‌ను చూసి "అరె! శ్రీధర్, ఎప్పుడొచ్చావు? అమ్మా, నాన్నా అంతా కులాసాయేనా?" అని సంతోషంతో అడిగింది.

"ఇప్పుడే వచ్చా నత్తయ్యా. శశి ఏదీ?"

"మేడమీద తన గదిలో ఉన్నట్లుంది. నువ్వు మేడమీదకు వెళ్లు. నేను కాఫీ పంపిస్తా" అని శ్రీధర్ అత్తయ్య తన స్నేహితురాల్ని సాగనంపి, ఇంటిలోపలికి వెళ్లింది. శ్రీధర్, రిక్షావాడికి డబ్బు లిచ్చి పంపేసి, హాలు ప్రక్కగదిలో ఉన్న మేడ మెట్లు ఎక్కసాగాడు.

మేడమెట్లు ఎక్కుతూన్నకొద్దీ, పై గది లోంచి రేడియో సంగీతం—మాల్‌కోన్ రాగంలో రాధాకృష్ణుల ప్రేమగీతం వినిపిస్తోంది. ఆ మధుర ధ్వని తరంగాలు వీనులవిందుగా మనమోహన జనకంగా, హృదయాన్నీ, మనస్సుని స్పృశిస్తూ బుద్ధికి పారవశ్యం కలిగిస్తూంటే శ్రీధర్‌లో ఒక నూతన ఉత్సాహం కలిగింది.

మేడ చివరి మెట్టుకి ప్రక్కగా ఉన్న గది ద్వారంలో నుల్చుని గదిని కలయ చూశాడు. లోపల అతన్నాకర్షించింది—చక్కని చారల సిల్కుచీర కట్టు కుని, సన్నని నడుమూ, పిరుదుల వంపులతో.. ఆకర్షణీయమైన విగ్రహం, పొడుగాటి జడా, తెల్లని మెడా కన్పిస్తూ—ఒక యువతి తన వెనుక భాగము గది ద్వారమువైపుండేటట్లు నుల్చుని, రేడియో దగ్గర పాట వింటూఉన్న దృశ్యము

శ్రీధర్ తన రాక ఆ యువతి గుర్తించలేదని గ్రహించాడు. ఆ యువతి శశే అయివుంటుందని భావించాడు. రేడియోలో పాట, కృష్ణుడు రాధను చిలిపిగా ఆడించడం వర్ణిస్తోంది., శ్రీధర్‌కి చిన్న చిలిపి వూహ తట్టింది. మెల్లిగా తివాసీమీద అడుగులు వేసుకుంటూ వెళ్లి ఆ యువతి కళ్ళు మూశాడు.

"అబ్బ .. శశి .... నీ చేతు లింత గట్టిగా ఉన్నాయేమిటి?" అంటూ ఆ యువతి శ్రీధర్ చేతుల్ని తొలగించింది. శ్రీధర్ ఆ గొంతుక విని, చేతులు లాగేసుకుని ... ఆ అమ్మాయి ఇటు తిర గ్గానే అమ్మాయి మొహం చూసి ఒక్క గంతే శాడు.

అమ్మాయీ .... శ్రీధర్ .... ఇద్దరూ గాభరా పడ్డారు.

"సా—సా—సారీ! మేడం .... ఎక్స్క్యూజ్ మీ."

"మీరు ...."

"నేను మా శశి అనుకున్నా. వెరీసారీ—క్షమించండి."

"నేనూ శశే అనుకున్నా"

"ఎక్జాట్లీ! నేనూ అదే అనుకున్నా .... వెరీ వెరీ సారి ఎక్స్క్యూజ్ .."

"ఫరవాలేదులెండి శశి, వాళ్ల బావగా రొస్తా రని డ్రెస్ చేసుకోడానికని క్రిందకు వెళ్లింది. ఇప్పుడే వస్తుంది కూచోండి"

"థాంక్స్. మీరు చాలా మంచివారు."

శ్రీధర్ ఆ యువతి కెదురుగా ఉన్న సోఫాలో కూచొన్నాడు. తను చేసిన పొరపాటుపనికి దవడ వాయగొడ్తుం దనుకొన్న ఆ యువతిలలామ, తన యందు అంత దయ చూపించడంతో శ్రీధర్‌కి వణుకూ, ఖంగారూ తగ్గింది.

"మీరు నుల్చొనే ఉన్నారు కూచోండి!"

ఆమె కూడా కూర్చుంది. ఇద్దరూ కాస్సేపు మౌనంగా ఉన్నారు. శ్రీధర్ తనవైపే చూస్తూం డడం ఆమె గమనించి, కొంచెం సిగ్గుపడింది. శ్రీధర్ ఆమెవైపు చూస్తూ .... గ్రేస్‌కెల్లీ, సుసాన్‌హేవర్డ్ — మెరిలియన్‌మన్రో, ఎలిజబెత్ టైలర్ అబ్బే!. వాళ్లెవరూ ఈ ఆమ్మాయి కాలిగోటికైనా పనికిరారని నిర్ణయిం చేశాడు.

ఏమి అందం! ఆహా .... కాళిదాసు, శకుంతల ..

"ఏం శకుంతలా! మా బావకీ, నీకు అప్పుడే పరిచయమైనట్లుందే? ఏం బావా! ఇంతసేపూ నీకోసం ఎదురుచూసి ఇప్పుడే క్రిందికి వెళ్లాను" అంటూ ఒక పందొమ్మిదేళ్ల యువతి, చామన చాయగా ఉన్నా, చక్కని కనుముక్కు తీరుగల మొహం—అమెది-వెనక్కాల నౌకరు ట్రేలో కాఫీ, టిఫిన్ తెస్తూండగా ప్రవేశించి శ్రీధర్‌కి శకుంతల అనే తన స్నేహితురాలికీ ఒకరినొకరికి పరిచయం చేసింది

ఆమే, శశి! శ్రీధర్, మేనత్త కూతురు.

శకుంతల శ్రీధర్ శశి బావ అని తెలియ గానే మరికొంచెం సిగ్గుపడింది. సహజంగా, ఎర్రగా ఉన్న ఆమె బుగ్గలు, మరింత ఎరుపెక్కాయి.

శ్రీధర్ ఒక్కసారి గుండెలు తడిమి చూసు కొన్నాడు—హృదయం తన దగ్గరే ఉందా, ఎక్కడి కైనా షికారెళ్లిందా—అని

శశి, బావని ఏవేవో ప్రశ్నలు వేస్తోంది బావ గురించి తమాషా, తమాషా కబుర్లు చెప్తూ శకుంతలని నవ్విస్తోంది శ్రీధర్‌కి మాత్రం దృష్టంతా శకుంతలమీదే. అతని ధ్యాసంతా ఆమె చిరునవ్వుతో కూడిన సుందరవదనం మీదే

"మా బావకి పాటలంటే చాలా యిష్టం. నువ్వు బాగా పాడ్తావని తెలిస్తే ఒక్క నిముషం వూరుకోడు శకుంతల ఎంత బాగా పాడుతుం దనుకున్నావ్! బావా, అద్భుతం, లత గొంతుకలా ఉంటుందనుకో. ఏం, బావా!"

"అబ్బే .... ఏంలేదు . . ఒక్క పాట . . పాడి వినిపిస్తారేమోనని."

"నిజమే, శకుంతలా! మా బావ వింటాడు. ఒక్క పాట పాడు"

శకుంతలకు ఎంత నవనాగరిక యువతి అయినా ఒక్కసారిగా పరపురుషుడు తన కళ్ళు మూయటం అతనే యిన్నాళ్లనుంచీ శశి తనతో వర్ణించి చెప్తున్న శ్రీధర్ కావటం, పైగా వచ్చిన దగ్గ ర్నుంచీ అతను కళ్లతో తన సౌందర్యాన్ని తాగే స్తున్నవాడిలా కన్పించడం, ఉక్కిరిబిక్కిరయిన ట్టుంది అసలు ఆ బావామరదళ్ల మధ్య తనెందుకు? తను మర్యాదగా నిష్క్రమిస్తే మంచిది. కాని ... అతను. అతనిలో ఏదో ఒక ఆకర్షణ వుంది; అది తనని కదలనీయటంలేదు.

"అబ్బ! ఇప్పుడేమిటి శశి! మీ బావ ఎంతో ప్రయాణబడలికతో ఉంటే, ఇప్పుడేనా? మళ్లీ ఇంకోసారి వస్తాగా."

"అబ్బెబ్బే, నా కసలు బడలికే లేదు. నాకు పాటలంటే తగని పిచ్చి ఒక్క పాట పాడండి .. ప్లీజ్!"

శకుంతల మెత్తబడసాగింది. శశి కూడా బల వంతం చేసింది ఇంతలో శ్రీధర్ అత్త కూడా మేడమీదికి వచ్చింది.

"అత్తయ్యా! మంచి సమయానికి వచ్చావ్. మిస్ శకుంతల పాడ్తారు."

"అవునురా ఆ అమ్మాయి చాలా బాగా పాడ్తుంది ఏదమ్మా ఒక్క పాట."

శకుంతల, ఇంతమంది చేరి తనని పాడమనటం

అందులో శ్రీధర్ ఉత్సాహంగా ఉండటం చూసి, తను పాడకపోతే బాగుండదని ఒక చిన్న పాట పాడింది పాట అయిపోగానే శశీ, శ్రీధర్ చప్పట్లు కొట్టి మెచ్చుకున్నారు

శకుంతల తను ఇంటికి వెళ్తానని లేచింది. శశీ, శశి తల్లి ఆమెను భోజనానికి ఉండిపొమ్మని బలవంతం చేసినా ఆమె ఉండలేదు వెళ్తూ, వెళ్తూ ఆమె శ్రీధర్‌వైపు ఒకసారి చూసి 'ఒక సారి మా యింటికి రండి' అని చెప్పి వెళ్లింది

శకుంతల వెళ్లిన తరువాత శ్రీధర్ మొహం చూసి శశి "బావా! శకుంతల చాలా అందమైనది కదూ ?" అని అడిగింది కొంటెగా.

శ్రీధర్ ఏదో ఆలోచిస్తున్నవాడల్లా "ఏమిటీ ?' అన్నాడు

శశి, "ఏంలేదు బావా! శకుంతలని చూసి కాలేజీలో అబ్బాయిలంతా పరధ్యానంలో పడిపోతూంటారులే ఎంచేతో తెలుసుకుందామని నిన్ను అడుగుతున్నాను"

శ్రీధర్ అత్తయ్య వంక చూశాడు. ఆమె కూడా కుతూహలంగా తమవైపు చూస్తూండడం గమనించి, శశి ముందర తను బైటపడిపోయానని గ్రహించాడు

"చూశావా, అత్తయ్యా శశి నన్ను వేళాకోళం చేస్తోంది ఆ అమ్మాయిని ఎక్కడో చూసి నట్టుగా ఉందనుకుంటూ ఆలోచిస్తూంటే ."

"అవునులేరా ఆ అమ్మాయి చాలా మంచిది అందమైనది కూడాను ఎవడు చేసుకుంటాడో కాని, చాలా అదృష్టవంతుడు మేనరికం ఉందిట గాని, ఆ అమ్మాయి కిష్టంలేదుట వాళ్లవాళ్లంతా బలవంతం చేస్తున్నారట"

"ఏం మేనరికాలు పోనిద్దూ, అత్తయ్యా! ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లని పెళ్లి చేసుకోనివ్వాలి గాని.."

"నువ్వు కూడా అలాగే అంటావా శ్రీధర్. శశి ఒక్కత్తే అనుకున్నాను. నేనూ, మా అన్నయ్య, శశి పుట్టినప్పట్నుంచీ కొండంత ఆశ పెట్టుకున్నాం—మీ యిద్దరిమీదా. అదేమో, "నాకు పెళ్లొద్దు, పై చదువు చదువుకుంటానూ' అనీ, నువ్వేమో 'నా యిష్టం వచ్చిన పిల్లని పెళ్లి చేసుకుంటా'ననీ, మీకు మేం చెప్పగలమా నాయనా!"

శ్రీధర్ ఆశ్చర్యంతో శశివైపూ, అత్తయ్య వైపూ చూశాడు గబుక్కున ముఖకవళిక మార్చేశాడు, "శశీ! నేను నిన్ను ఎంత ప్రేమించాను! నీకోసం ఎంత కష్టపడ్డాను! నా ప్రేమ యిలా తోసేస్తావా?" అన్నాడు సినిమాల్లో హీరోలాగా.

శశి చప్పట్లుకొట్టి "బలేగా ఉంది బావా. నువ్వు సినిమాల్లో బాగా రాణిస్తావు" అంది నవ్వుతూ. శ్రీధర్ అత్తయ్య కూడా నవ్వింది.

"ఏవిట్రా! మీ వేళాకోళాలు. ఒకమూల మేమేమో మీ యిద్దరి మనస్సు ఏమైనా మారుతుందేమోనని చూస్తూంటే, మీ యిద్దరూ ఇంత సులభంగా కొట్టిపారేస్తున్నారు. ఇలా మిమ్మల్ని వదలి లాభంలేదు. శ్రీధర్! నీ ఉద్దేశమేమిటో చెప్పరా ?"

"ఏమిటత్తయ్యా ?"

"శశిని చేసుకోవడం నీ కిష్టమేనా ? లేదా ?"

"అమ్మా "

"నువ్వూరుకో శశి! శ్రీధర్ నువ్వు చెప్పు!"

"అదికా దత్తయ్యా. శశంటే నాకు చాలా యిష్టం. కాని, మాడూ—అత్తయ్యా పెళ్లి చేసుకోవాలంటే ఎలాగో ఉంటుంది."

"అదే నేనూ అంటున్నాను బావా. నువ్వంటే నాకు చాలా యిష్టం. ఇద్దరం చాలా చనువుగా తిరిగాం. ఇప్పుడు నిన్ను భర్తగా .."

"అదే, అదే .. కానీ, అత్తయ్యా శశీ నేనూ ....

"అమ్మా, బావా నేనూ ......"

"ఎంతో స్నేహంగా ...."

"ఎంతో ఇష్టంగా . ."

"ఉంటాం"

"ఉంటాం"

శ్రీధర్, శశి ఇద్దరూ ఆవిడకి చెరోవైపూ చేరి గబగబా ఈమాట లనేశారు. ఆవిడ, "సరే నర్రా, మీ యిష్టం. పదండి, వెళ్లి భోంచేద్దాం" అని క్రిందకు వాళ్లిద్దరితోసహా వెళ్లింది.

శశికీ, శ్రీధర్‌కీ కూడా హృదయాలు తేలికయ్యాయి. శశెంతో మంచిదని శ్రీధర్ అన్నాడు. బావది ఎంతో గొప్ప హృదయమని శశి మెచ్చుకుంది

మర్నాడు సాయంకాలం శ్రీధర్ శేఖర్ ఇంటికి వెళ్లాడు శేఖర్‌కు అవాళ సెలవవటంవల్ల ఇంటి వద్దనే ఉన్నాడు శేఖర్, శ్రీధర్‌ని అవూ రెందు కొచ్చిందీ, ఎవరింటి కొచ్చిందీ అన్నీ అడిగాడు

శ్రీధర్ శేఖర్‌తో జరిగినదంతా చెప్పాడు. తనూ తన మరదలు శశీ, పరస్పరం వివాహం చేసుకోమని నిర్ణయాని కొచ్చామనీ, తను శకుంతల అనే అమ్మాయిని చూసిన దగ్గర్నుంచీ ఆ అమ్మాయిని ప్రేమించాననీ చెప్పాడు

అంతా విని, కొంచెం ఆలోచించి శేఖర్ "అయితే మరి ఆ శకుంతలని చేసుకోవడానికి మీ తలితండ్రులు ఒప్పుకోవద్దూ."

"ఆ విషయం ఫరవాలేదు. శశిని చేసుకోనన్నట్లయితే నా వివాహవిషయంలో వారి జోక్యమేమీ ఉంచుకోమని చెప్పారు"

"అసలీ శకుంతల ఎవరో ?"

"మా శశి ఫ్రెండురా. మా శశి నిన్నటి నుంచీ నన్ను వేళాకోళం చేస్తోంది, అందుకని శశిని వివరాలేమీ అడగదల్చుకోలేదు."

"మరి ఆమెను గురించి ఎలా తెలుసుకుంటావు ?"

"అందుకే, నిన్ను ఆమె విషయం కనుక్కోమని ప్రార్థిస్తున్నాను"

"బావుందిరోయ్. ఎవరో అమ్మాయిట, పేరు శకుంతలట, ఆ అమ్మాయి విషయం నేను కనుక్కోవాలిట. నావల్ల కాదు."

"బ్రదర్. ఈ చిన్న సాయం చెయ్యలేవురా!"

"అబ్బే!"

"ఒరేయ్! నువ్వీమాత్రం సాయం చెయ్యకపోతే నాకు గత్యంతరం లేదురా"

ఇంతలో లోపల్నించి "అన్నయ్యా" అన్న పిలుపు విని శేఖరం లోపలికి వెళ్లాడు. అయిదు నిమిషాల్లో లోపల్నించి రెండు కప్పులతో కాఫీ పట్టుకొని శేఖరే వచ్చాడు. శ్రీధర్ కొక కప్పిచ్చి తనొక కప్పు తీసుకున్నాడు.

"ఒరేయ్, శ్రీధర్! నువ్వింత గట్టిగా చెప్పన్నావు కాబట్టి, ఆ శకుంతల గురించి అన్నీ కనుక్కుంటాను. వాళ్ళు కట్నాలూ, కానుకలూ ఏమీ యివ్వలేమంటే . ."

"ఏమీ అక్కర్లేదురా, నేను అసలు దమ్మిడీ కట్నం తీసుకోను ఆ అమ్మాయి ఒప్పుకుంటే చాలు"

"సరే అయితే నే నా విషయం కనుక్కొని, రెండు రోజుల్లో చెప్తాను."

"రెండు రోజులే!"

"మనం ఇలాంటి విషయాల్లో తొందర పడకూడదు నీ కోరిక నెరవేర్చే పూచీ నాది."

"అయితే సరే. మరి వస్తా. ఎల్లుండి మళ్ళా కలుస్తా"

"అలాగే"

"శ్రీధర్ మెల్లిగా, బరువుగా అడుగులేస్తూంటే శేఖర్ వీధిగుమ్మందాకా వచ్చి సాగనంపాడు. శ్రీధర్ సందు చివరదాకా వెళ్లడం చూసి, శేఖర్ లోపలికి వెళ్లిపోయాడు

సందు మలుపు తిరుగుతూంటే శ్రీధర్‌కు ఒక ముఖ్య విషయం జ్ఞాపకం వచ్చింది. శకుంతలకీ మేనరికం ఉన్న సంగతి శేఖర్‌తో తను చెప్పలేదు. అందుకని మళ్లీ వెనక్కి తిరిగి వచ్చాడు.

శ్రీధర్ మెల్లిగా శేఖర్ ఇంటి మెట్లు ఎక్కి ద్వారంకున్న కర్టెన్ తొలగించి లోపల కెళ్లేటప్పటికి ఎదురుగా శేఖర్ శకుంతలా కూర్చొని మాట్లాడుకొంటున్నారు. శ్రీధర్‌ని చూచి ఇద్దరూ ఆశ్చర్యపోయారు. శ్రీధర్ కూడా ఆశ్చర్యపోయి శకుంతలను చూస్తూ నిల్చుని ఉండగా శేఖర్ "అరే శ్రీధర్. భలేవాడివే. నన్నే తమాషా చేశావు. సరేలే ఇదిగో ఈమే నా పెద్దచెల్లెలు. శకుంతల. చెల్లాయి యితను .

"నాకు తెలుసు శశి బావగారు. నమస్తే."

"మీరు శేఖర్ సిస్టర్ అని నాకు తెలియలేదు.'

"తెలియకపోవడమే మంచిదైంది. ఒరే శ్రీధర్! పాపం, నిన్ను సస్పెన్సులో పెట్టడం ఎందుకుగానీ, మా చెల్లాయి నిన్ను పెళ్లి చేసుకోవడానికి అంగీకరించిందిరా. ఏం చెల్లాయ్, నిజమే కదూ ?"

"నువ్వు ఫో! అన్నయ్యా" అంది శకుంతల కోపంగా.

"పోతాలే. మీ యిద్దరి మధ్యా నే నెందుకు ?" అని శేఖర్ లోపలికి వెళ్లిపోబోయాడు. శ్రీధర్, శేఖర్‌ని జబ్బ పట్టుకుని "శేఖర్, మీ అమ్మగారేరి ?" అని అడిగాడు

"ఎందుకూ ?"

"నమస్కరించడానికి" అన్నాడు శ్రీధర్, శకుంతల వైపు కొంటెగా చూస్తూ.

"అబ్బే! ఇంకా ముహూర్తానికి వారం రోజులు పైముంది. అప్పుడూ, అవన్నీ."

ముగ్గురూ నవ్వుకున్నారు. 



జూల్స్ వెర్న్ నవల

# ౮౦ రోజులలో భూప్రదక్షిణం

డిసెంబరు 5 వ తేదీ రాత్రి అంతా రైలు ఆగ్నేయంగా50మైళ్ళు వెళ్ళి అక్కడనుంచి పైకి—దాదాపు ఉత్తరానికి తిరిగి ప్రయాణంచేసి గ్రేట్ సాల్ట్ లేక్ వేపు పోసాగింది ఉదయం 9 గంటలవేళ పాస్పోర్తు గాలి మేద్దామని ప్లాట్‌ఫారం మీదికి పైరుకు వెళ్ళాడు గాలి బాగా చల్లగావుంది. ఆకాశం బూడిద రంగులోనే ఉంది. మంచు మాత్రం కురవడంలేదుకాని పొగమంచుమాత్రం దిగిపోలేదు ఆ మంచుతెర వెనక సూర్యబింబం బ్రహ్మాండమైన బంగారుముద్దలా కనబడింది అది పౌండుస్టెర్లింగుతో ఏపాటి విలవచేస్తుందోనని పాస్పోర్తు శ్రద్ధగా దానిని తూచి చూసి లెక్కలు కడుతున్నాడు కాని అంతలో అక్కడొక చిత్రమైన వేషం తారసిల్లి, పాస్పోర్తు చేస్తున్న 'విలవైన పని'కి అడ్డు తగిలింది.

ఆశాల్తీ ఎల్కో-స్టేషన్‌లో రైలెక్కింది. భారీ విగ్రహం. నల్లటి మీసం, నల్లటోపీ, నల్ల వెయిస్ట్ కోటు, నల్లపంట్లాం, నల్ల స్టాకింగులు, చేతులకు నల్లటి డాగ్‌స్కిన్ గ్లోవ్‌లు—గోధుమరంగు దేహం, మెడలో తెల్లటి కావెట్ (పూర్వకాలపు టై) మినహా విలువునా నల్లగావున్న ఆ ఆసామిని గబుక్కున చూస్తే ఫాదిరీలా వున్నాడు అతను ఆ చివరనించి ఈ చివరకి పనిగట్టుకుపోతూ ఒక్కొక్క పెట్టెకీ తలుపు దగ్గిర వేఫర్ జిగురుబిళ్ళలతో ఒక చీటీ అంటిస్తున్నాడు

పాస్పోర్తు తలుపు దగ్గరకు వెళ్ళి చూశాడు అది అచ్చునోటీసు కాదు. రాసినది విలియంహిచ్ (పెద్దాయన) 48 వ నంబరు రైలుమీద ప్రయాణం చేస్తున్న సందర్భం పురస్కరించుకొని 117 వ నంబరు పెట్టెలో ఉదయం 11 నుండి 12 గంటల వరకూ మోర్మనిజంపై ఉపన్యసించ సంకల్పించారనిన్నీ, ఈ విధంగా "పిదప కాలపు గురువులు" కాక ఉత్తరకాలపు సాధువులు ప్రతిష్ఠించిన మతం తాలూకు మహత్తర ధర్మ సూక్ష్మాలను తెలుసుకోగోరేవారు ఈ మహదవకాశాన్ని సద్వినియోగపరచుకోవచ్చుననిన్నీ, ఆ చీటీ తాత్పర్యం.

"ఎంతమాట. తప్పకుండా వెళ్ళాలి వెళ్తాను" అనుకున్నాడు పాస్పోర్తు. అతనికి మోర్మనిజం గురించి ఇంకేం తెలిసినా మానినా, ఆ మతానికి ప్రాతిపదిక బహుభార్యాత్వం అనేదిట అని మటుకు విన్నాడు

రైలుతో ప్రయాణికులు వంద మందిలోను సుమారు 30 మంది ఆ పూట 11 గంటలకి 117 వ నంబరు పెట్టెలో పోగయ్యారు పాస్పోర్తు ముందు వరసలో కూర్చున్నాడు వీరమోర్మన్‌లా అతని యజమానిగాని, ఫిక్స్‌గాని ఈ వేపుకు రాలేదు—పనికిమాలిన గోల అన్న భావంతో.

సరిగ్గా పదకొండు కొట్టగానే విలియంహిచ్ తంగున లేచి నిలబడి విసురుగా, కోపంగా, ఉద్రిక్త స్వరంతో తను చెప్పబోయేదాన్ని ముందే ఎవరో ఖండించినట్లు వారిని చితగ్గొడుతున్నట్లు ఉపన్యాసం ఆరంభించాడు

"ఆ మీరేమన్నాసరే. జొస్మితు అమరజీవి. జా అన్న, దమ్ముడు హిరాం అమరజీవి. యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వం ఈ ప్రవక్తలపట్ల అవలంబించే దమననీతివరస చూడగా బ్రైంగాంయంగ్ కూడా ఖచ్చితంగా ఇంకో అమరజీవి అయి తీరతాడనిపిస్తోంది దీనినికాదనగలరా? ఎవరు? ఎవరా అనేది. ఎవరు కాదంటారు. ఆ?" అన్నాడు విసురుగా.

ఎవరూ కాదనలేదు. ఏమీ అనలేదు. వేషంవాలకం చూడగా సాత్వికుడులాఉన్న ఆ మనిషి భాష ఇంత దూకుడుగా ధాటీగా వచ్చేసరికి అంతా ఆ విడ్డూరం చూస్తున్నారు ఇక్కడి ప్రేక్షకులు మాటాడ కూరుకున్నంత మాత్రాన అతనికోపం అకారణమైనదనడానికి వీలులేదు. అతని మతాన్ని అమెరికన్ ప్రభుత్వం నిశితంగా ఖండించి, అనుయాయులను దండించి చర్యలు తీసుకుంటున్నమాట నిజమే. అప్పటికే ఈ మతపిచ్చవాళ్ళలో పిచ్చిదనాన్ని పరిమార్చి మతాన్ని మార్చి మోర్మాన్‌ల సంఖ్యను చాలవరకు తగ్గించడం జరిగింది ముందు యుటా రాష్ట్రాన్ని స్వాధీనపరచుకొని, ఆపైన మోర్మాన్ నాయకుడు బ్రైగాంయంగ్‌పై తిరుగుబాటు లేవదీస్తున్నాడని, బహుభార్యాత్వానికి ఒడిగట్టి, ప్రచారం చేస్తున్నాడని నేరాలారోపించి అతని ఖైదులో వేసింది తరవాత ఆ రాష్ట్రం అంతటా యూనియన్ ప్రభుత్వపు శాసనాలు అమలు జరిపించి అదుపు చేసింది. ఆ దరిమిలాను మోర్మన్ ప్రవక్త శిష్యులంతా ఏకమై ద్విగుణీకృతమైన పట్టుదలతో ఆవేశంతో అమెరికన్ ప్రభుత్వాన్ని—కార్యరూపంలో కాకపోయినా వాగ్రూపంలో ఎదిరించసాగారు ఇపుడు ఎల్డర్ విలియంహిచ్ ఇలా రైళ్ళలో కూడా ఇంత ఉన్నతంగా ప్రచారం చేయడానికి కారణం అదే.

పై విధంగా నాంది ప్రస్తావించి, అక్కడనుంచి మరింత ధాటీ అయిన మాటలతో ఉధృతంగా చేతులూ తలా ఎగరేస్తూ బైబుల్ కాలంనుంచి నేటివరకూ మోర్మనిజం చరిత్ర నడచిన తీరు చెప్పుకుపోయాడు. ఇజ్రేలులో జోసెఫ్ వంశానికి చెందిన ఒక మోర్మన్ ప్రవక్త తొలిసారిగా ఈ కొత్త మతంగురించి ప్రచారంచేసి ధర్మాలను నిర్దేశిస్తూ గ్రంథం చేశాడనీ— దానిని తన కుమారుడు మోర్మన్‌చేతుల్లో పెట్టిపోయాడనీ—

ఈజిప్షియన్ లిపిలో ఉట్టంకించిన ఆ అమూల్య గ్రంథంలోని విషయాలను తిరిగి కొన్ని శతాబ్దాల అనంతరం వెర్మాంట్ రాష్ట్రంలో జోసెఫ్‌స్మిత్తు జూనియర్ అనే ఒక రైతు తర్జుమా చేయడం జరిగిందనీ, తాను ప్రవక్తనని 1825 లో ఉద్ఘాటన చేసిన మహాపురుషుడు ఆయనేననీ— జ్యాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్నట్టి ఒకానొక అరణ్యంలో ఒకానొక రోజున ఒకానొక దేవదూత ఆయనకు సాక్షాత్కరించి, ఆయొక్క పవిత్రగ్రంథాన్ని తర్జుమా నిమిత్తంభగవంతుడు పంపినట్లు చెప్పి ఈయనకు అందజేశాడనీ విలియం హిచ్ చెప్పుకొచ్చాడు.

మార్మనిజం చరిత్రనూ, నేటి ఉపన్యాసం వరకు జరిగిన కధను వినాలన్న ఉబలాటం పుష్కలంగాలేని ప్రేక్షకులు కొందరులేచి వెళ్ళిపోయారు. వక్తమాత్రం ముందుకు సాగాడు—అవిధంగా గ్రంథం అందాక, స్మిత్ జూనియర్ తన తండ్రిని, అన్నదమ్ములిద్దరినీ, మరికొందరు శిష్యులను పోగేసి "పిదప కాలపు సాధువుల మతం" నెలకొల్పిన ప్రకారం—ఆమతం అమెరికాలో మాత్రమే కాదు, స్కాండినేవియా, ఇంగ్లాండ్, జర్మనీలలో కూడా జనాదరణ పొందింది కార్మికులు—కాయకష్టంచేసేవారూ ఎక్కువగా ఇందులో చేరారు.—దరిమిలాను, ఈ మతస్థులంతా ఓ హి యో రాష్ట్రంలో వలస ఏర్పాటు చేసుకున్న ప్రకారము—రెండులక్షల డాలర్ల వ్యయంతో దీనికొక ఆలయం నిర్మించిన ప్రకారము, అటుపైన కర్క్‌లాండ్‌లో ఒక నగరం నిర్మించిన ప్రకారము, స్మిత్ బ్యాంకువ్యాపారముపెట్టి ధన మార్జించిన విధము, అబ్రహాం, కొందరు ఈజిప్షియన్ మహాపురుషులు వ్రాసిన ఒక శాసనపట్టము స్మిత్తుకు ప్రసాదించబడిన ప్రకారము—వివరించాడు

కథ ఆ ఘట్టాని కొచ్చేసరికి కథ పట్టునుబట్టి విలియంహిచ్ ఉత్సాహంకొద్దీ కాస్త విపులంగా చెప్పడం ఆరంభించాడు. అప్పటికే కథ తెగసాగడం వల్ల మరికొందరు శ్రోతలు తెగించిలేచిపోయారు. ఇక 20 మంది మిగిలారు. శ్రీ విలియం హిచ్ ది ఎల్డర్ చిన్నబుచ్చుకోలేదు అసలు పట్టించుకోలేదు. కథ కొనసాగించాడు. ఆ తరువాతి ఘట్టాలలో జోస్మిత్ దివాళాతీసిన విధము—దెబ్బతిన్న బాంకు స్టాక్ హోల్డర్లంతా ఆయనను పరాభవించిన ప్రకారము కొద్ది సంవత్సరముల పిమ్మట మిస్సోరీలోని ఇండిపెండెన్స్ పట్టణంలో జోస్మిత్ పునస్సాక్షాత్కారము, పిమ్మట మతము మూడువేలమంది భక్తులతో బలపడి ఉచ్చదశకువచ్చిన ప్రకారము, మోర్మనేతరధూర్తుల విద్వేషంవల్ల జోస్మిత్ పశ్చిమ తీరానికి పరారీ అయిన ప్రకారము—పూర్తి అయే వరకు, పదిమంది శ్రోతలు మిగిలారు. వారిలో చెవులు రిక్కపొడుచుకు కూర్చున్న శ్రోత పాస్పొర్తూనే—ఈ విధముగా ఎన్నో కడగండ్లు పడి పడి పిమ్మట స్మిత్ ఇలినాయ్‌లో తిరిగి అవతరించుట, 1839 లో మిసిసిపీ నదీతీరాన నేవూ అను సుందర నగరాన్ని నెలకొల్పుట, దాని జనాభా అచిర కాలములోనే 25 వేల ఆత్మలకు దేహగేహములు ప్రసాదించుట, ఆ నగరమునకు స్మితు మేయరు, ప్రధాన న్యాయమూర్తి, సైనికాధిపతి పదవులను చేపట్టుట—1843 లో అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షపదవికి అభ్యర్థిగా నిలుస్తున్నట్లు ప్రకటించుట, చివరకు కార్తేజ్ వద్ద కొందరు దుష్టులు చుట్టుముట్టి పట్టుకుని చెరసాలలో వేయుట, తరువాత ఒక ముసుగు మనుషుల ముఠా స్మితును వధించడం చెప్పుకొచ్చాడు.

అప్పటికి శ్రోత ఒక్కడే మిగిలాడు—పాస్పొర్తు. వక్త, ఈ శ్రోత ముఖంలోకి సూటిగా తేరిపార చూశాడు. చూపుతో, తన అమోఘ వాగ్ధాటితో అతడిని మంత్రముగ్ధుణ్ణిచేసివేశాడు. గుర్తుకు తెచ్చుకో అన్నాడు అంటూనే స్మిత్ హత్యతరువాత రెండేళ్ళకి అతని వారసుడు, బ్రైగాంయంగ్ నవ ప్రవక్తగా అవతరించిన విధాన్ని గుర్తుకుతెప్పించాడు పాస్పొర్తూకు. బ్రైగాంయంగ్, నేవూచుట్టుపట్టులు వదలిపెట్టి సాల్ట్‌లేక్ దగ్గర సారవంతమైన సీమలకు వలసపోయిన విధము, యూటానుండి కాలిఫోర్నియా వలసపోయేవారి దారిలోఉన్న ఆసుక్షేత్రంలో కొత్త వలస నెలకొల్పుట మోర్మన్ మతానికి మూలధర్మమైన బహుభార్యాత్వం ధర్మమా అని జనాభా తామరతంపరగా వర్ధిల్లిన ప్రకారమూ వివరంగా తెలియజెప్పాడు

"ఇదే. ఇదే అసలు కారణం, అంటూ పుంజుకున్నాడు వక్త, "కాంగ్రెసుకు మా పట్ల అసూయ కలగడానికి కారణం ఇదే. అమెరికన్ సైనికులు ఈ భూమికి దండెత్తివచ్చిన దిందుకే. న్యాయం ధర్మం లేకుండా మా కులపెద్ద బ్రైగాంయంగ్‌ను బందీ చేసిన దిందుకే. అయితే ఈ దండనీతికి, భుజబలానికి మేము లొంగిపోతామా? లొంగం. ఎంతమాత్రం లొంగం వెర్మాంట్‌నుంచి వెళ్ళగొట్టారు. ఇలినాయ్‌నించి పొమ్మన్నారు. ఓహియో నుంచి తరిమేశారు. మిసోరీనించి తోసేశారు. ఇక యూటానించి వెళ్ళగొడతారు. కొట్టనీ. పోతాం. పోయి విశాల భూమిలో ఎక్కడో ఇంకోచోట స్వతంత్రమైన సీమ వెతుక్కుంటూాం. అక్కడే వలస దిగుతాం. బిడ్డా! నువ్వూ మాతో వచ్చి మాపతాకం నీడలో తలదాచుకుంటావా? ఆ?" అన్నాడు వక్త ఉద్రేకంగా పాస్పొర్తూ. మొహంలో మొహంపెట్టి.

అంతవరకూ కళ్ళూ చెవులూ ఒప్పగించి కదలకుండా కూర్చున్న పాస్పొర్తు, "ఊహు" అనేసి లేచి పరుగెత్తి వెళ్ళిపోయాడు.

ఈ ఉపన్యాసం జరుగుతున్నంతసేపూ తప్పించుకుంది కన్నట్టు జోరుగా పరుగుపెడుతున్న రైలు చాలాదూరం గడచిపోయింది. పన్నెండున్నరకల్లా గ్రేట్ సాల్ట్‌లేక్ వాయవ్య భాగానికి వచ్చింది. ఇక్కడినుంచి చుట్టూ తిరిగి వెళ్ళాలి' దేశమధ్యంలో ఉన్న ఈ ఉప్పు చెరువు చాలా విశాలమైనది. అందముగా ఉంటుంది దీన్నే 'డెడ్‌సీ' అని కూడా అంటారు. అమెరికన్ జోర్డాన్ నది ఇందులోవచ్చి కలుస్తుంది. విశాలమైన తిన్నెలలా పైకి తన్నుకు వచ్చిన పెద్దపెద్ద బండలు ఇందులో చాలా కనిపిస్తాయి. వాటిమీద తెల్లటి ఉప్పు పెచ్చుకట్టి ఉంటుంది. ఒకప్పుడు ఇది ఇంకా పెద్దదిగా ఉండేది కాని కాలక్రమేపీ గట్టు ఎత్తుకావడంతో వైశాల్యం కొంత తగ్గి లోతు పెరిగింది 70 మైళ్ళ పొడుగు 35 మైళ్ళ వెడల్పూవున్న ఈ చెరువు సముద్ర మట్టానికి 3800 అడుగుల. ఎత్తున ఏర్పడింది. ఎత్తు అయినా, సముద్ర మట్టానికి 12 వందల అడుగులు దిగువుగావున్న ఆస్ఫాల్ట్‌లేక్‌లా కాక ఈ చెరువునీటిలో ఉప్పు బాగా పడింది. ద్రవ్యంగా కొలిస్తే నీటి బరువులో నాలుగో వంతుదాకా ఉంటుంది ఉప్పు. దీని తారతమ్య సాంద్రత 1170. నీటిది 1000 ఇందులో చేపలు బతకవు. జోర్డాన్ వంటి నదులలో ఏరులలో కొట్టుకువచ్చే జీవాలన్నీ త్వరలోనే చనిపోతాయి. అయితే మనుషు లెవరేనా అందులోకి దూకాలని ముచ్చటపడితే అభ్యంతరపెట్టే పాటి సాంద్రత మాత్రం కాదు.

## జరిగిన కథ

80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమని 20 వేల పౌన్లు పందెం వేసి సేవకుడు పాస్పొర్తుతో బయలుదేరుతాడు ఫిలియాస్ ఫాగ్. బాంకు దొంగ ఫాగ్ దొరికాడని, అరెస్టుకు బొంబాయికి వారంటు పంపమనీ లండన్‌కు టెలిగ్రామ్ పంపి, ఫాగ్ వెంట సూయజునుంచి బొంబాయికి చేరతాడు డిటెక్టివ్ ఫిక్స్. కాని వారంటు చేరలేదు. బొంబాయినుంచి కలకత్తాకుకు రైలుబండిలో ప్రయాణం అవుతాడు ఫాగ్. దారిలో అయూడాను రక్షించి ఆమెతో కలకత్తా చేరుకొంటాడు. అక్కడ వారిని నిలపడానికి ఫిక్స్ చేసిన యత్నం విఫలమైంది. ఫాగ్ ప్రభృతులు 'రంగూన్' ఓడలో పయనం ప్రారంభించారు. ఆ ఓడలోనే ఉన్నాడు ఫిక్స్. ఫాగ్ ను అరెస్టుచేయడానికి భోగట్టా సేకరించాలని పాస్పొర్తూను చేరదీశాడు. కాని అంతు చిక్కలేదు. లండన్ విడిచిన36రోజులకు హాంకాంగ్ చేరుకొని, అయూడాతో యోకహామా ప్రయాణమవుతాడు. కాని ఆ ఓడ తప్పిపోయింది. దానిని షాంగ్‌హైలో అందుకునేందుకు ఫాగ్ ఒక పడవను కుదుర్చుకొని బయలుదేరాడు. పాస్పొర్తూ 'కర్ణాటిక్'లో అంతకుమునుపేఎక్కి యోకహామా వెడతాడు. ఫాగ్, అయూడా సురక్షితంగాయోకహామా చేరుతారు. అక్కడ వారికి పాస్పొర్తూ కనిపిస్తాడు. ముగ్గురు శాన్ ఫ్రాన్సిస్కోకు బయలుదేరుతారు. ముగ్గురు శాన్‌ఫ్రాన్సిస్కోకు వెడతారు. అక్కడనుంచి వారు న్యూయార్కు పోతూ, గ్రేట్ సాల్ట్ లేక్ ప్రాంతంలోని యూటా రాష్ట్రం ప్రవేశిస్తారు.

# 80 రోజులలో భూప్రదక్షిణం

చెరువు చుట్టుపక్కల అంతా సాగు బాగా సాగుతోంది. మోర్మన్‌లకి సాగుబడిపద్ధతులు బాగా తెలుసు. ఇంకో ఆర్నెల్లుపోతే ఈ ప్రాంతం అంతా పంటపొలాలతో, పచ్చిక బీళ్ళతో, పూల మొక్కలతో, ఫలవృక్షాలతో నిండుగా కళకళలాడుతూ కనిపిస్తుంది. ప్రస్తుతానికి ఆ మనోహరదృశ్యం మీద మంచుతెర పడివుంది.

మధ్యాహ్నం రెండుగంటలకి రైలు ఆగ్డెన్ చేరింది. అక్కడ ఆరుగంటలసేపు ఆగుతుంది. ఈలోగా ఆ సాధుగ్రామం చూసిరావచ్చునని ఫిలియాస్ ఫాగ్, అయూదా, పాస్పార్తు, ఫిక్సులు బయలుదేరి వెళ్ళారు. ముమ్మూర్తులు కర్తీలేని అమెరికన్ బస్తీ అది. మిగతా రాష్ట్రాలలో ఇళ్ళూ వాడలూ, చౌకులూ అన్నీ చదరంగా అమర్చి ఉన్నాయి. విక్టర్ హ్యూగో మాటల్లో చెప్పాలంటే అవన్నీ దిగులు పడేలా ఎటుచూచినా సమకోణాలతో నిర్దిష్ట రూపు రేఖలతో కనిపించాయి. కుడి ఎడమలలో సమాన రూపం పొంకం ఉండాలన్నది ఆంగ్లోశాక్సన్‌ల పద్ధతే అయినా, మోర్మన్ ప్రవక్తకి ఇందులో మాత్రం స్వంతపంథా కుదిరినట్లులేదు. మొత్తంవీద మనుషులూ బుద్ధులూ సమకోణాలలో చదరాలతో ఖచ్చితంగా సరళరేఖలలా సూటిగా కాకపోయినా, భవంతులు వ్యవస్థలూ మటుకు ఆరూపు రేఖలను నిలబెట్టుకున్నాయి ఊరు చుట్టూ బంకమట్టి గులకరాళ్ళు కలిపి పోసిన చుట్టు గోడ ఉంది. ఊళ్లో గుళ్ళూ గోపురాలూ లేవు. ఆ పేరిట చెప్పుకోవలసినవి ప్రవక్తనివాసం, కోర్టు భవనం, ఆయుధశాలాను. వీధుల్లో జనం కిటకిటలాడడం లేదు. నిజానికి దాదాపు అన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. ఆలయందగ్గిర మాత్రం మానవ సంచారం అనేది కనబడింది. కనబడ్డ జనంలో స్త్రీ జనం అధికం. మోర్మన్‌లది బహు భార్యాత్వమతం కాబట్టి ఇది సహజం అయితే, అంతమాత్రాన మోర్మన్‌లు అందరికీ అనేక మంది భార్య లున్నారను కోరాదు. కావాలంటే చేసుకోవచ్చు. చేసుకోమని వెంటపడేందుకు కావలసినంత మంది ఆడవాళ్ళున్నారు. పెళ్ళి చేసుకోవాలన్న ఆరాటం అక్కడ స్త్రీలకే ఎక్కువ. వివాహంకాని స్త్రీలకు స్వర్గంలో ప్రవేశం ఉండదని వాళ్ల మతగ్రంథం హెచ్చరిక. ఇక్కడి స్త్రీలంతా విలువగలవలువలు ధరించి వగలుపోతూ విలాసంగా ఆనందంగా తిరుగాడటం లేదు. అందరికీ ఆ వసతులున్నట్టు లేదు. ఉన్నకొందరూ మాత్రం నల్లటి సిల్కు గౌనులు మెడ పట్టి బాగా దిగువకి ఉండేవి ధరించి పైబట్ట వేసుకున్నారు. మిగతావారంతా ఇండియన్‌ల ఫక్కీలో దుస్తులు అమర్చుకున్నారు

డజను మందో అర డజనుమందో కలిసి ఒక్కొక్క పురుషుడికి ఇల్లాళ్లై సుఖపెడతారని విన్నప్పటి నుంచీ, పాస్పార్తుకు ఇక్కడి స్త్రీ జనాభాఅంటే కొంచెం బెరుగ్గానేవుంది. ఆవూరి పురుషులమీద అతనికి కరుణ కలిగింది. ఇందరేసి ఆడవాళ్ళని కట్టుకుని వీళ్ళని జీవితం పొడుగునా కష్టసుఖాల మధ్య ఈడ్చుకుపోతూ, అది అయిపోయాక వాళ్ళని స్వర్గీయస్మిత్ అలంకరించిన మోర్మన్ స్వర్గవాసం తీసుకువెళ్ళి నివాసాలు ఏర్పాటు చెయ్యాలి ఒక్కొక్క పురుషుడూను. పాస్పార్తు గుండె దిగజారిపోయింది. దానికితోడు దారేపోయే స్త్రీలు అతనికేసి అదోలా చూడడం గమనించేసరికి ప్రాణం మరింత బేజారైపోయింది. రోజు బావుండి, కొద్ది నిమిషాలలోనే ఫాగ్ వెనక్కి తిరిగి స్టేషన్‌కు బయల్దేరడం జరిగింది. నాలుగు గంటలవేళ నలుగురూ రైలెక్కి కూర్చున్నారు.

రైలు కూతకూసి కదలబోయింది. ఇంజను చక్రాలు జర్రునజారి గిర్రునతిరిగి పట్టుచూసుకి బరువుగా బండిని కదిపాయి రైలు మెల్లిగా ముందుకు సాగింది. అంతలో ఎవరో ప్రయాణికుడు "ఆపండి ఆపండి" అని గావుకేకలు పెడుతూ రొప్పుతూ రొజుతూ పరుగున వచ్చాడు.

కదిలిన రైలును ఆపడం జరగదు. వస్తున్నవాడెవరో మోర్మన్ అయివుండాలి. అదృష్టవశాత్తు స్టేషనుకు కంచెలూ, గేట్‌లూ లేనందువల్ల అడ్డపడి పరుగెత్తి చిట్టచివరిపెట్టె అందుకుని ఒక్క దూకున లోపలపడి ఆయాసంతో నోట మాటలేకుండా పడిపోయాడు

అతను ఎక్కగలడా లేడా అని అంతసేపూ ఊపిరి బిగబట్టి చూస్తున్న పాస్పార్తు నిట్టూర్చాడు లేచి అతని దగ్గరకు వెళ్ళాడు. ఒక్క నిముషంతో స్నేహం కలిసింది. అతను ఇంటిలోని పోరు పడలేక ఇంతగా రొప్పుతూ పరుగెత్తి పారిపోయి వచ్చి ఈ రైలులో పడ్డాడని వినగానే పాస్పార్తుకు ఆ మోర్మన్‌మీద ఇంతింతనరాని అపేక్ష జాలి కలిగాయి.

అతను కొంచెం స్థిమితపడి ఊపిరితీసుకోగానే, మృదువుగా అడిగాడు పాస్పార్తు— "అయ్యా తమరి కెందరు భార్యలు?" అని. అతను పరుగెత్తిన వేగం, ఆవేశం చూడగా హీనపక్షం ఇరవై మందేనా ఉంటారని పాస్పార్తు అంచనా. ఎంత మోర్మనలయినా అంతకన్న ఎక్కువ ఉండడం కష్టం

"ఎందరెక్కడ స్వామీ! ఒక్కర్తె! చాలు బాబూ చాలు. ప్రాణం చాలొచ్చింది. ఈ జన్మకదే కొల్లలు" అన్నాడు మోర్మన్—స్వర్గవాసి జోస్మిత్‌వేపు కేలొమ్మోడ్చి నిస్పృహతో నమస్కరించి.

[ఇంకా ఉంది]

యామినిని ప్రేమించి మనసిచ్చాడు రమణ.

యామినీ వాళ్ల కుటుంబ మంటే ఒక విధమైన సానుభూతి ఉంది రవణకు. అది, జాలి గాదూ, అభిమాన మంతకన్నా గాదు. తల్లీ, తండ్రీ లేని అనాథ యామిని తల్లి దారుణంగా చనిపోయింది. తండ్రి ఖైదులో ఉన్నాడు అందుకనే రమణకు యామినిమీద సానుభూతి కలిగింది

అక్కడ ప్రారంభమైంది తండ్రీ కొడుకుల మధ్య మనస్పర్థ.

అడ్డమైనవాడి కూతుర్ని ప్రేమించటమేనా ? అదేం కుదరదు. నే చూసి నాకు నచ్చి చేసుకోమన్న పిల్లని తప్ప, చేసుకోటానికి వీల్లేదు." వెంకటరత్నంగారు గర్జించారు.

యామినిని తప్ప మరొకర్ని ఈ జన్మలో చేసుకోను.

అయితే నీ యిష్టం. ఆ పెళ్లితో నీకూ, నాకు సంబంధమూ తెగిపోయిందని మాత్రం తెలుసుకో.

వెంకటరత్నంగారు అలాగని వెళ్లిపోయారు అక్కడనుండి. రమణ మాత్రం, ఆలోచనలో పడిపొయ్యాడు

వెంకటరత్నంగారు కూడా ఆలోచించారు. యామిని వీర్రాజు కూతురు అవటం తప్ప తనకు తెలిసినంతవరకు మంచి లక్షణాలు గలదే ! వాడికిష్టమైన అమ్మాయిని కోడలుగా తేవటమే మంచిదన్న నిర్ణయానికి వచ్చారు. అదేమాట కొడుక్కి చెబుదామన్న భావమూ ఉంది ఆయనకు

తీరా ఆయన కొడుక్కోసం వెతికేసరికి రమణ యింట్లోంచి వెళ్లిపొయ్యాడు.

వెంకటరత్నంగారి అహం దెబ్బతిన్నది. తన మాట వినకుండా, తనను మంచి మార్గానికి తేకుండా, అన్నీ వదులుకు వెళ్లాడన్న భావమూ, మరుక్షణం "కానీ చూద్దాం. ఎంతవరకో వీడి ఆవేశమూ" అన్న నిర్ణయానికి వచ్చారు.

అంతా విన్న విశ్వం "తొందరపడ్డావు రమణా! నిదానించి ఆయన్ను ఒప్పించాల్సింది. అంతగా కాదూ కూడదంటే ఈ పని అప్పుడే చెయాల్సింది" అని అన్నాడు.

"లాభంలేదు విశ్వం ! ఆయన మాటకు తిరుగులేదు ఆయన తత్వం అంతే. ఆయన పెద్దరికానికి భంగం కలిగితే సహించలేడు. ఆ ఉద్యోగమూ ఇన్నాళ్ల జీవితమూ ఆయన్నలా తయారు చేసివయ్" అన్నాడు రవణ.

"నావల్ల మీ రిద్దరు వేరవటం బాగాలేదండి. ఆయన అంగీకారం తీసుకుంటే బాగుండేది" అన్న యామిని మాట, దూరలేదు.

పెళ్లి దేవాలయంలో జరిగిపోయింది. విశ్వనాథం బరువు భారంనెత్తినవేసుకు జరిపించాడు పెళ్లికి ముందు విశ్వనాథం వెంకటరత్నంగారి దగ్గర కెళ్లాడు "జరిగింది మర్చిపోండి. ఇప్పుడు మీరు వస్తే వాడు అన్నీ మర్చేపోతాడు. అంతా సలక్షణంగా ఉంటుంది. రండి పోదాం" అని బతిమిలాడాడు.

"నువ్వెళ్లు విశ్వం ! కడుపున పుట్టిన బిడ్డకే లేని అభిమానం నీ కెందుకు వెళ్లు ! వాడిమీద కోపమూ లేదు, అభిమానమూ లేదు, నాకు.

# యాదృచ్ఛికం

(27-వ పేజీ తరువాయి)

కొడుకనే బంధాన్ని ఎప్పుడో తెంపుకున్నా !" కళ్ళు తుడుచుకున్నారు వెంకటరత్నంగారు.

"పెద్దవారు. మీరు అలా అంటే ఎలా ! ఎన్ని జరిగినా వాడు మీ కొడుకు కాకపోతాడా ?"

"ఆస్తికి మాత్రమే కొడుకు !"

విశ్వనాథం మారు మాట్లాడలేక పోయినాడు. అలా గడిచిపోయింది, రమణ వివాహం.

వెంకటరత్నంగారి ప్రవర్తన గమనించిన రమణ మరే అనుబంధమూ పెట్టుకోదలచుకోలా తండ్రితో ! ప్రయత్నించీ, ఫలితం లేదని అతని వూహ.

ఇదంతా కళ్లముందు మెదిలింది, వెంకట రమణకు

"లేవండి, స్టేషనొచ్చింది. ఏమిటో ఆలోచిస్తున్నారు" యామిని మాటలకు ఉలిక్కిపడి బండి దిగాడు

ముందు కబురు చెయ్యకపోవటంవల్ల స్టేషనుకు విశ్వనాథం రాలేదు

వెంకటరత్నంగారు పూజ ముగించుకొని అన్నీ సర్దుకుని గుళ్లోకి పోయే ప్రయత్నంలో ఉన్నారు.

"నర్సమ్మా నే నలా దేవాలయాని కెళ్తున్నా" అని కేకేసి హాల్లో కొచ్చేసరికి ఎదురుగా రమణ, యామినీ ఉన్నారు.

ఓ ముసలావిడ మొట్టమొదటిసారి విమానప్రయాణం చేయటం తటస్థించింది. ఆమెకు చాలా గాబరాగా ఉంది. లోపలికి వెళ్లి కూర్చుని పదినిముషాలయిన తరువాత కిటికీలోంచి చూచి తోటిప్రయాణికునితో "త్వరలోనే విమానం ఎంతపైకి పోయిందండీ! అప్పుడే క్రింద ఉన్న మనుష్యులు చీమల్లాగా కనిపిస్తున్నారు కదూ !"అంది.

అతడు నవ్వుతూ "అవి చీమలేనండి మనం ఇంకా భూమిమీదే ఉన్నాము" అన్నాడు.

ఆర్. సరస్వతి (హైదరాబాదు)

వెంకటరత్నంగారు మొదట ఆశ్చర్యపోయినారు. కల గాదుగదా అన్న అనుమానమూ వచ్చింది. దేదీప్యమానంగా వెలుగుతూన్న లైట్ల ముందు కల అన్న అనుమానం కల్లగా అనిపించింది.

క్షణం తండ్రీకొడుకులు ఒకర్నొకరు అలాగే రెప్పవాల్చకుండా చూసుకున్నారు.

ఇద్దరి మనుసలు అర్థమైనాయి.

యామిని యిద్దర్నీ చూస్తూ నిలబడ్డది.

"అరెరె ! యిదేనా రావటం రమణా ! రారా ! అలానే నిలబడ్డావేం, పద మేడమీదికి .... మిమ్మల్నే. అలా నిలబడ్డారేం, మనవడ్ని అందుకోక" అని నర్సమ్మ అనేదాకా అలానే ఉన్నా రంతా.

యామిని మామగారికి పిల్లవాణ్ణి అందించి మామగారి పాదాలకు నమస్కరించి "మా తప్పులుంటే క్షమించండి" అనంది.

రమణ తలొంచుకు నిలబడ్డాడు.

వెంకటరత్నంగారు ఏదో అనబోయ్యేసరికి చంకలో మనవడు తమాషాగా ఉన్న మీసాలు కటిక్కిన లాగాడు.

"అమ్మా ! .... ఉండరా బాబూ ! ఆ మీసాల పని అయిపోయింది. తీసేస్తాలే !" అని గుండెల కద్దుకున్నారు.

"అలాగే ఏం కుదరదు. తీరా మనవడు వచ్చింతర్వాత అవి తీసేయిస్తానంటే ఎలా ? వాడేంబెట్టి ఆడుకుంటాడు ?" అన్న నర్సమ్మ మాటలకు అంతా నవ్వుకున్నారు.

పునస్సమాగమం యింత శుభంగా జరిగినందుకు అంతా సంతోషించారు.

ఆమర్రోజు విశ్వనాథం షాపులో కూర్చొనున్నాడు. రమణ కూడా ప్రక్కనే ఉన్నాడు.

"అయితే ఉద్యోగమునకు రాజీనామా యివ్వటం ఖాయమేగా !"

"తప్పదులా ఉంది. ఆయన యిక్కడే ఉండమంటున్నాడు ! తెలుసుగా, ఆయనమాట కాదంటే మళ్ళీ అదొక పేచీ.

"అంతే !"

ఇంతలో షాపు కుర్రాడు విశ్వనాథానికి వో చీటీ అందించాడు. అది చూడంగానే "అరేయ్ ! ఆయనున్నాడేమో చూడు పద !" అని కుర్రాణ్ణి పురమాయించి విశ్వం వీధిలో కొచ్చాడు. అటూ యిటూ చూశాడు. వెతుకుతున్న మనిషి కనుపించలేదు.

"ఏమిటిరా ! ఎవరొచ్చారు !" రమణ కూడా బయటకొచ్చి అడిగాడు.

విశ్వం రమణ కళ్లల్లోకి చూసి చీటీ చేతికిచ్చాడు.

"విశ్వనాథం గారికి !"

నేను ఎవరో మీకు తెలియకపోవచ్చు. యామిని నా కూతురు. ఆదరించి నా పిల్లను కోడల్ని చేసుకున్నారుట వెంకటరత్నంగారు. వారి దయకు సర్వదా కృతజ్ఞుణ్ణి. దూరంగా ఉండి వాళ్లను చూసి వచ్చాను. అంతకు మించి అదృష్టం నాకు లేదు. ఈ సంగతి వాళ్లకు చెప్పండి. ముఖ్యంగా మా అమ్మాయికి ! ఇహ నా కోసం వెతకొద్దు !

వీర్రాజు. ★

# వీరన్న వెంకన్న

— [illegible]



(గతసంచిక తరువాయి)

## 3

**అటువంటి** ప్రాంతంలోని ఒక ఊరుమధ్యగా వెడుతున్నారు ఈ యాత్రికు లిద్దరూను. రామయ్యకి దాహం వేసింది. దారి ప్రక్కన ఎక్కడా నూయి వంటిది కనిపించ లేదు. అందుకని వీరన్నని ముందుకు నడుస్తూ ఉండమని, దారికి దగ్గరి లోనే ఉన్న ఒక యింటివైపు నడిచాడు మంచినీళ్లు త్రాగివద్దామని. తలుపులు వేసి ఉండడంవల్ల చేతితో తట్టి "ఎవరండీ లోపల?" అని పిలిచాడు. సమాధానం రాలేదు. మళ్లీ తట్టి "ఏమండీ! కొంచెం మంచి నీళ్ళిస్తారా దాహంగా ఉంది" అని పిలిచాడు కొంచెం గట్టిగా. ఉఁహుఁ! ఈసారీ సమాధానం రాలేదు. రామయ్యకి ఆశ్చర్యం వేసింది. తలుపు యింకొంచెం గట్టిగా తట్టపోయాడు. కాని ఆ రెండుతలుపులూ హఠాత్తుగా విడిపడ్డాయి. అప్పుడు తెలుసుకొన్నాడు రామయ్య ఆ తలుపులు గడియవేసి లేవు అని. అదే ఆశ్చర్యంతో లోపలికి నడిచాడు. మనుష్యులున్న అలికిడి లేకపోవడంతో ఆశ్చర్యం మరింత ఎక్కువైంది. చివరికి ఒక గది గుమ్మం దగ్గరికి వచ్చేటప్పటికి ఏదో మూలుగు వినిపించి ఆ వైపుకి నడిచాడు. మూలుగు వినిపించే గది గుమ్మంలో అడుగుపెట్టేటప్పటికి అతని కళ్లకి కనిపించినదృశ్యం అతణ్ణి దిగ్భ్రాంతుణ్ణి చేసింది. ఆ గదిలో ఒక గోడదగ్గరిగా ఉన్న నుక్కిమంచం మీదఒక్కనడివయస్కురాలునీరసంగా పడిఉంది. రెండోవైపు దగ్గర నేల మీద చిరికిచాపమీద ఇంకో అతను ముడుచుకుని పడుకున్నాడు. ఆ

గదిలో ఒకమూలగా ఒక గాదెవంటిది ఉంది. దాని వెనకాలనుంచి వస్తోంది ఆమూలుగు. గాదెను దాటి వ్యాపించిన ఒక మంచం, దానిమీద చివరగా కనిపించే కాళ్లుచూస్తే దానిమీద పడుకున్నవారు కూడా రోగులనే తెలిసిపోతోంది. ఆగాదె సందులోంచి ఒక అమ్మాయి తొంగి చూస్తోంది. ఒక చంటికుర్రాడు ఆ కుక్కిమంచం ఎక్కడానికి నీరసంగా ప్రయత్నం చేస్తున్నాడు.

ఈ దృశ్యం కంటపడేటప్పటికి రామయ్యకి తనగుండె ఎవరో పిండినంత బాధపడ్డాడు. గట్టిగా నిట్టూరుస్తూ, లోపలికి వచ్చి, తన భుజంమీద నున్న మూట.దగ్గరలో ఉన్న పీటమీద పడేశాడు. ఆ శబ్దానికి అక్కడివారంతా కళ్ళు విప్పి చూశారు. "కొంచెం మంచి నీళ్లిస్తారా?" అని అడిగాడు. దానికి సమాధానం ఆ మంచంమీద పడుకునిఉన్న ఆవిడ చెప్పింది. "ఎవరికీ ఓపికలేదు నాయనా! యివ్వడానికి. నాలుగురోజులనుంచి తిండీతిప్పలు లేకుండా యిలా పడిఉన్నాం. నీకు ఓపికఉంటే దొడ్డిలో బావిఉంటుంది. వెళ్లి తోడితెచ్చుకో." నీరసంతో ఆమెకి కొంచెం ఆయాసంకూడా వచ్చింది. రామయ్య జాలి ఉట్టిపడే స్వరంతో "అరెరే! పాపం. అయితే ఉండండి." అని అంటూ తనమూట విప్పి అందులోని కొన్ని తినుబండారాలు తీసి ఆమెకి అందించబోయాడు. అంత ఆకలితో ఉన్నా ఆమె వాటిని తినకుండా, కుర్రాడివైపు అమ్మాయివైపు చూపించింది. "వాళ్లకీ పెడతాను. నువ్వు తీసుకో అమ్మా అని" అంటూ రామయ్య చేతిలోకొన్ని తినుబండారాలతో, ఆ అమ్మాయివైపు నడిచాడు. మొదట్లో తీసుకోడానికి ఆపిల్ల సంశయించింది. "ఫరవాలేదమ్మా. తీసుకోవచ్చు. తినిచూడు ఎంత బావుంటాయో" అని బుజ్జగించాడు. అప్పుడు ఆపిల్ల ఆ వస్తువులని అందుకుని గాదెసందులోంచి బయటికి వచ్చి మంచం దగ్గర ఉన్న కుర్రాడి వైపు వస్తోంది. ఆమెచేతిలోని తినుబండారాలనిచూసి కుర్రాడు కూడా ఆమెవైపు చకచకా ప్రాకి వెళుతున్నాడు. అదిచూసిన రామయ్య కళ్లల్లో నీళ్ళు నిలిచాయి. ఆ పదార్థాలు అయిపోగానే, సంచీలోంచి తీసి మళ్లీ యింకొంచెం పెట్టాడు. అవీ తినేశారు ఆ పిల్లలు. అంతలోనే రామయ్య దొడ్డిలోకి వెళ్ళి బావి దగ్గరఉన్న డొక్కుచేదతో నీళ్ళు తెచ్చి యిచ్చాడు. ఎంతో ఆప్యాయంగా త్రాగారు వారిద్దరు.

అప్పటికి నేలమీద పడుకున్న మనిషి కొంచెంలేచి, గోడకి జేరపడి కూర్చున్నాడు. అతనికి కూడా రెండు రొట్టెలు పెట్టి మంచి నీళ్ళిచ్చాడు, రామయ్య. మంచం మీద ఆవిడకూడా లేచి కూర్చుని, ఆ పదార్థాలు తిని, యిన్నిమంచి నీళ్ళుత్రాగి కొంచెం తేరుకుంది. "దేవుడిలా వచ్చావు నాయనా నువ్వు ఎవరివో కాని నువ్వు అడిగిన మంచినీళ్ళు యివ్వలేకపోగా, నీ పదార్థాలన్నీ తినేశాం. మా ప్రాణాలు నిలబెట్టావు. నీ కెంతైనా పుణ్యం ఉంటుంది. నీమేలు..." అని ఆమె యింకా యేదో అనబోతుంటే రామయ్య మధ్యలో ఆపి "దానికేం గాని, ఎందుకిలా జరిగింది? మీస్థితి యింత దారుణంగా ఉండడానికి కారణం యేమిటి?" అని అడిగాడు.

దానికి ఆమొగతను సమాధానం చెప్పాడు. "ఏం చెప్పం బాబూ! మేము ఒకప్పుడు కొంచెం యిదిగా బ్రతికినవాళ్లమే. మాకు ఉన్న

## విద్యార్థికి సూక్తులు

శ్రీమతి కమలాదేవి

స్నేహంలో అన్యాయం
మూర్ఖులతో స్నేహం
విద్యార్థికి గర్వం
అనవసర విషయజోక్యం...

కూడదోయ్ కూడదు!
పరభాషా దాస్యం
పరనిందా లాస్యం
గురువులపై హాస్యం
నిరాశకే వశ్యం.........

కూడదోయ్! కూడదు!
అసూయాంతరంగం
అల్లరితో వ్యాసంగం
అసందర్భప్రసంగం
అకారణ సమయభంగం...

కూడదోయ్! కూడదు!
ఆత్మాభిమానహీనం
అసంతుష్ట జీవనవిధానం
స్వోత్కర్ష ప్రచారగానం
అనర్థకపు దురభిమానం...

కూడదోయ్! కూడదు!
ఆహారనియమ రాహిత్యం
అల్పగుణులతో సాంగత్యం
హాస్యానికైనా అసత్యం
అహరహమూ
సినిమా పైత్యం
కూడదోయ్! కూడదు!

పొలం పండించుకుంటూ అయిన వారిలో అవుననిపించుకొనే బ్రతికాం. అయితేనేం? వానలు కురవక ఒక యేడూ, అతిగా కురిసి ఒక యేడూ, వరసగా నీటిచుక్క అనేది లేక కొన్ని యేండ్లూ జరగడం వల్లమా వ్యవసాయంఅంతాపాడయి పోయింది. ఉన్నభూమి తాకట్టు పెడితేనేకాని జీవనోపాధి జరగలేదు. ఆ తరువాత యింట్లోఉండేవస్తువులు నాగలి, యెడ్లతో సహా పరాధీనం అయిపోయాయి. ఎంతచేసినా తిండి గడిచే మార్గమే దొరికేది కాదు."

అతను ఆగిన తరవాత ఆ నడి వయస్కురాలు చెప్పడం మొదలు పెట్టింది. "ఆకలిబాధ చంపుకోలేక ప్రక్కయిల్ల వాళ్లని యాచించడం మొదలు పెట్టాం బాబూ" ఆ గడ్డీ ఈ గడ్డీ తినడంవల్ల రోగాలు కూడా పట్టుకొన్నాయి. అందరం పడిన తరవాత దిక్కులేక ఆ ఎడపిల్లని పంపే దాన్ని గింజలు అడుక్కుని రమ్మని. చిన్నదైనా ఆ పని చేసేందుకు అది ఎంత అభిమానంపడిందో? రెండు మూడు రోజులు వెళ్లి తరవాత ససేమిరా వెళ్ళనని కూర్చుంది. ఇంక మార్గంలేక కడుపుల్లో కాళ్లు పెట్టుకుని కూర్చున్నాం. ఇప్పుడు మీరు దేవుడికిమల్లే రాకపోతే యేమయి పోయేవాళ్ళమో! ఒక కుటుంబాన్ని చావునుంచి తప్పించిన పుణ్యం మీకు ఎంతేనా ఉంటుంది. ఆ భగవంతుడిమాట ఎలా ఉన్నా ప్రస్తుతానికి మీరే మాకు భగవంతునిలా ఉన్నారు." అని రెండు

## వీరన్న - వెంకన్న

చేతులూఎత్తి నమస్కారం చేసింది. ఎంతో సిగ్గుపడుతూ అక్కడనుంచి తప్పుకుని రామయ్య వచ్చి వీధిలో పడ్డాడు.

వాళ్ల పరిస్థితి చూచి, రామయ్య అక్కడ నుంచి కదిలి ముందుకు వెళ్ళలేకపోయాడు. రెండు రోజుల పాటు తానే గంజికాచి పోశాడు. అప్పటికి ఆ నడివయస్కురాలు ఆ మొగతను తేరుకుని తమపనులు తామేచేసుకునేశక్తిమంతులయ్యారు. పనులన్నీ అయిపోయాక, రామయ్య దొడ్లో ఉండే పాకలో చేరేవాడు నిద్రకి. మూట తలక్రింద పెట్టుకుని వెల్లకిలా పరుండి నక్షత్రాలతోనిండినఆకాశం వైపు చూస్తూ ఆలోచిస్తూ ఉండేవాడు. ఈపాటికి వీరయ్య "ఈపడు

> భార్య: (భర్తతో) "ఏమండీ!" కాళిదాసు ఎంత గొప్ప కవిత్వం చెప్పాడండీ! నేను స్వర్గంలోకి వెళ్ళినప్పుడు, ఆ గ్రంథాలన్నీ ఆయనే వ్రాసేరో లేక ఇంకెవరైనా వ్రాసారో కనుక్కుంటాను.
>
> భర్త: (తెలివి చూపిస్తున్నవాడిలాగ) మరి ఒకవేళ ఆయన నరకంలో ఉంటేనో.
>
> భార్య: ఆయన నరకంలో వుంటే మీరు కనుక్కుందురుగాని" అని పూరుకుంది.
>
> క. వీరభద్రాదేవి, (అనపర్తి)

కొండలసామిదగ్గరకి చేరుతూ ఉంటాడు. నేనుమాత్రం ఇక్కడే ఉండి పోయాను. ఏం చేయను మరి? చూస్తూ చూస్తూ వీళ్లని యిలా వదిలి ఎలా వెళ్ళగలను? వీళ్ళని ఒక దారిన పెట్టినతరవాత యిక్కడనుంచి బయటపడవచ్చు. తన మొక్కు చెల్లించనందుకు ఏడుకొండలవాడికి కోపం వచ్చినా మాత్రం ఏం చేయగలను? అన్నీ తెలిసిన ఆ దేవుడు నన్ను మన్నించకుండా వుంటాడా?

ఒక్కొక్కప్పుడు "ఈగొడవంతా నాకెందుకు" అని వెళ్లిపోదామనుకునేవాడు రామయ్య. అప్పుడు తనని ఎవరో వెనక్కి లాగుతున్నట్టు అనిపించి వెనక్కి తిరిగేవాడు. వారి చంటి కుఱ్ఱాడు తన కాళ్ళు పట్టుకుని నవ్వుతూ ఉండేవాడు. రోజులు గడిచినకొద్దీ ఆకుఱ్ఱాడు, ఎడపిల్ల అతనికి మాలిమి అయిపోయారు. వాళ్లు సంతోషంగా ఉండేటట్టు చేయడమే తనవిధిఅనుకుని ప్రయాణ ప్రయత్నం మానుకునే వాడు.

ఆ తరవాత, వివరాలు కనుక్కుని రామయ్య ఆయింటిఅతని పొలం తాకట్టులోంచి విడిపించాడు. నాగల్ని, ఎద్దుల్ని కూడా విడిపించాడు. మళ్లీ పంటలు వచ్చేవరకు సరిపోయేటంత జొన్నలు కొని యింటికి చేర్చాడు. అతను చేస్తున్న ఈ సహాయానికి ఆయింటిల్లిపాదీ అతనిని మనస్సుల్లో వేనోళ్ల పొగడుకునేవారు. వారి హృదయాల్లోని కృతజ్ఞతాభావం, వారుకన్నుల్లోకని పించి వింతగా వెలిగేది.అతనిని చూడగానే వారి అందరి మొహాలు విప్పా

లేవి. వారి పెదవులపై మెదిలే చిరునవ్వులు అతనికి ఎంతో హాయినిచ్చేది. ఎండి మోడువారిపోయిన వారిజీవితక్షేత్రాలకి అతను అమృతధార అయ్యాడు. ఆ విషయం వాళ్లు అతనిపట్ల చూపే ప్రతిపనిలోను వ్యక్తమయ్యేది.

కొద్దిరోజుల తరువాత, యింక ఆ యింటివారికి తను చేయవలసిన సహాయం యింకేం లేదనుకున్నాడు రామయ్య. ప్రస్తుతానికేకాక మళ్లీ పంటలు వచ్చేవరకు యేర్పాటుచేసి ఉంచాడు. అందుకని ఒకనాటి రాత్రి మామూలుగా పాకలో పడుకున్నట్టే పడుకుని, ఒకరాత్రివేళ ఎవరికి చెప్పకుండా తనమూట భుజానవేసుకుని రోడ్డుమీదకు వచ్చాడు. అప్పటికి ఖర్చుకాగా మిగిలిన డబ్బు లెక్క చూసుకుంటె తనయాత్రకి సరిపోదనిపించింది. అందుకని యేడుకొండలవాడి ఊరు ఉన్నవైపు తిరిగి, చేతులు జోడించి లెంపలువేసుకుని యింటి ముఖంపట్టాడు. "నా బదులు కూడా వీరన్నబావే మొక్కు చెల్లిస్తాడు పోనీ" అనుకున్నాడు.

ఇంటికి చేరినతరవాత, యింట్లో వాళ్ళువేసిన ప్రశ్నలకియేదో సమాధానం చెప్పాడు. తమ ముసలాడు తిరిగి వచ్చిందే చాలనుకున్నట్టు యింట్లో వాళ్లంతా ఎంతో ఆనందించారు. కొద్ది రోజుల్లోనే, అన్ని మరిచిపోయి మామూలుపనుల్లో లీనం అయిపోయాడు రామయ్య. మళ్లీ కోడిపెట్టలను జాగ్రత్తగా పెంచడం, తేనెటీగ పట్టులమీద శ్రద్ధవహించడం రామయ్యకి మామూలై పోయింది.

(ఇంకావుంది)

## విరహిణి - విరజాజి

ఎన్. రంగారావు

విరహిణి

అందమయిన అంబరాన,
మందముగా చందమామ,
తొంగిచూచు నెందులకో—?
దొంగచూపు లెందుకో—?

విరజాజి

ఘల్లు, ఘల్లు రవళులతో,
పల్లవించు పాటలతో,
అల్లనల్ల వనితనీవు,
మెల్లగ చనుదెంచినావు—
తొంగిచూచు చందమామ,
దొంగ చూపు లందులకే—!

విరహిణి

మినుకు, మినుకు మనుచు తార,
చినుకులల్లె చూపు విసర,
బెదరసాగె మనసెందుకో—?
అదరసాగె తనువెందుకో—?

విరజాజి

పరిమళించు ప్రకృతిలో,
పరిఢవిల్లు ఆకృతితో,
నిరీక్షించు నీ చూపును,
పరీక్షించె నా తారక!
బెదిరెను నీ మనసందుకే—!
అదిరెను నీ తనువందుకే!

విరహిణి

చల్లనైన పిల్లగాలి,
మల్లెపూల మత్తుగ్రోలి,
మదినితాకి కోయునేల?
ఎదను చెదరగొట్టునేల?

విరజాజి

సఖునిరాక పిల్లగాలి,
సుఖశాంతులు మల్లెమత్తు,
తెలియచేయు గుర్తులుగా,
కలిసివచ్చె నువ్వొత్తుగ,
మదికయ్యావి కానుకోక
ముద మొసగెడి చిగురు పూవ!

"లెండి" అంది అరుణ కోపంగా.

"పోనీ, యీ ఒక్కసారికీ నామాట దక్కించు. నీ ఫోటో చిన్న దొకటి నా పర్సులో వుందిగా! అది చూసి నీది ఫోటో జెనిక్ ఫేస్ అని తప్పకుండా ఫోటోలో ప్రైజు కొట్టవచ్చని వాడు వేపించుకు తిన్నాడు......"

"........మీరు వేగిపోయి కరిగిపోయారు విరుద్ధంగా. అంతేగా! డబ్బాళ చూపాడా?"

"అట్లా అపార్థం చేసుకుంటే -నేనేమి చెప్పను? వాడు బాల్యమిత్రుడు—నోరు తెరిచి అడిగాడు కదా అని ఒప్పుకున్నాను. ఇంత నిలేస్తావని తెలిస్తే మాటిచ్చేవాడిని కాదు" అని ముఖం చిన్నబుచ్చుకున్నాడతను.

శశికళ చిన్నగా నవ్వి "ఈ కాంపిటేషన్‌లో పొల్గొనేటందుకు మీరు సంతసించాలి కాని, ఇట్లా నిరుత్సాహపడతా రెందుకు? అంతగా ఆయనట్లా అడుగుతుంటే మీరు బెట్టుచేస్తారేమిటి?" అని అరుణతో అని, "......ఆమె తరఫున నేను మాటిస్తున్నాను. ఫోటోకి ఎప్పుడు రావాలి?" అని అడిగింది అతన్ని

"సరిగ్గా నాల్గు గంటలకి ప్రభాత్ స్టూడియోలో ఉండాలి. ఈ రాత్రే ఫోటో తయారయి పోవాలి. నే నిప్పుడు మళ్ళీ ఆఫీసుకు వెళ్ళాలి. నే నక్కడ కల్సుకుంటాను ఏమంటావ్ అరుణా!" అన్నాడతడు.

"తప్పదుగా! ఎప్పటికైనా మగవాళ్ళదే జయం" అంది అరుణ

"అది ప్రత్యక్షంగా అనిపిస్తుంది. కాని పరోక్షంగా ఆడవాళ్ళదే అసలైన విజయం శశికళగారూ! మీరూ రండి. అరుణా! సాధ్యమైనంతవరకు నీ నగలన్నీ పెట్టుకునిరా! అది ముఖ్యమని చెప్పాడు శేషగిరి. ఇక నేను వెడతాను లేకపోతే, నాల్గు గంటలకల్లా మిమ్మల్ని స్టూడియోదగ్గర కల్సుకోలేను" అని బయటకు నడిచా డతను. అరుణ యింకా ఏదో చెప్పబోయింది. కాని అతను వినిపించుకోలేదు.

"ఎప్పుడూ యింతే!-ఇట్లాంటి అవాంతర మేదో తెచ్చి గాలిలా వచ్చి గాలిలా వెళ్ళిపోతారు. ఈయనతో మహచెడ్డ చిక్కుగావుంది" అంటూ కుర్చీలో కూలబడింది అరుణ ఇద్దరూ నవ్వుకున్నారు

"అన్నట్లు నగలన్నీ పెట్టుకుని రమ్మన్నారు. కదూ!" అంది శశికళ. ఆ మాట అనేసరికి అరుణ ఉలిక్కిపడ్డట్టయింది. చచ్చాం! ఈయనో ఎపుడూ యింతే! నగలన్నీ పెట్టుకురమ్మన్నారు కాని, హోటల్లోని పెద్ద పెట్టె తీసుకు రాలేదు అందులో ఉన్నాయి అవన్నీ తాళం చెవులు తనదగ్గరే ఉంచుకున్నారు. ఆడవాళ్ళం—మనం అజాగ్రత్తలో ఉంటామట! ఇప్పుడాయన చేసిన పనేమిటో! ఇందాకనేకదా యీవేళ "బేవకూఫ్" ఆఖరిఆట కదా అని వెడదామనుకున్నాం. పైగా మీరు చూడాలని ఉబలాటపడుతున్నారు కూడా!" అంది అరుణ.

"అనుకున్నట్లుగా జరిగితే మనకు సమస్యలే ఉండవుగా!" అంది శశి నిరుత్సాహంగానే

"ఏమైనాసరే. మీ సినిమా ప్రోగ్రాం చెడ కొట్టడానికి వీల్లేదు. ఫోటో తీయించుకున్న వెంటనే

# ఆడపడుచు కట్నం

(18-వ పేజీ తరువాయి)

ఆయన రాక పోయినాసరే మనిద్దరం వెడదాం. ఇప్పుడీ నగల గొడవ ఎట్లాగా అని ఆలోచిస్తున్నాను.

కలిగిఖర్మం లేకాదరిద్రం — అన్నట్లుగా వుంది మెడలో యీ జిగినీ గొలుసు తప్పించి మరోటిలేదు నాకు వెయ్యి రూపాయలు ఖరీదుచేసే చంద్రహారం, నెక్లెసు, పాపిడి పిందిరీలు మొదలైనవన్నీ ఉన్నా పట్నం కాపురం వచ్చాక ఎబ్బెట్టుగా వుంటుందని ఎప్పుడూ పెట్టెలోనే ఉంచటం అలవాటయి పోయింది"

"పోనీ, నావి యిస్తాను. పెట్టుకోండి. ఫోటో అయిపోయాక తీసేసేవాటికోసం యింత ఆందోళన ఎందుకు?"

"స్టేషనులో కొచ్చిన సామాన్లు విడిపించుకువచ్చి యింటికి చేర్చటంలేదు; ఆఖరికి రేపటినుంచయినా వంట ప్రారంభించడానికి కావల్సిన సరకులు తెచ్చుకోవటంలేదు ఇంట్లో యిటువంటివి చూడరుకాని ఎవరో మిత్రుడికి మాటిచ్చారుట! నేను ఎంత కష్టంతోచినా ఆయనమీద చాడీలు ఎవరితోను చెప్పను. మీరు మనసిచ్చి మాట్లాడుతున్నారు. కనుక హృదయంలో ఉంచుకోలేక పోతున్నాను. ఆయనకు, నాకు ఎప్పుడూ యిటువంటి చోటనే తగవులు వస్తాయి. ముందింటగెల్చి రచ్చ గెల్వమనే సిద్ధాంతం నాది. అబ్బే! ఏ ఎండకా గొడుగు పట్టాలంటారాయన. మా మనస్తత్వాలు మీకు వింతగా కనిపిస్తాయి కదూ!" అని నవ్వింది అరుణ

"విడాకులవరకు వెళ్ళకుండా చూసుకుంటే భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు, జీవితానుభవాలకు గీటురాళ్ళుగా ఉంటాయి—అని అంటూ వుంటారు మావారు అనుభవిస్తున్నప్పుడు సుఖదుఃఖాల మధ్య వూగులాడినా జరిగినవి తల్చుకుంటే తర్వాత మనకే నవ్వువస్తుంటాయి."

"మీ దాంపత్య జీవితం స్వల్పమే అయినా అనుభవాలు వంటపట్టాయన్నమాట!"

"అన్నమంతా చూడాలా—ఒక్క మెతుకు పట్టుకుంటే చాలదూ!" అని నవ్వి అలారం టైంపీస్ వైపు చూసింది శశి "అబ్బా! అప్పుడే మూడు దాటింది. అయితే, మీ రొక్కరే స్టూడియోకి వెళ్ళండి. నేను వంట పూర్తి చేసుకొని థియేటర్‌కి వస్తాను. అక్కడ కల్సుకుందాము"

"మీకు చాల శ్రమ యిస్తున్నాము"

"అట్లా అంటే నాకు కోపం వస్తుంది స్నేహితుల మధ్య శ్రమ అనే దానికి తావెక్కడుంది?"

"పోనీ మనమంతా హోటల్లోనే భోజనం చేద్దాము లెండి"

"ఎందుకు; వృధాగా డబ్బు ఖర్చుపెట్టడం? అయినా నేను స్టూడియోకివచ్చి చెయ్యవల్సిన పనేమీలేదుగా, చేతులు కట్టుకొని నుంచోవటం తప్ప. సరిగ్గా ఐదున్నరకి థియేటర్‌కి వచ్చెయ్యండి. ఈలోపలే మీపని అయిపోతే యిక్కడికే వచ్చెయ్యండి"

పెట్టెలోని రాళ్ళ నెక్లెసు, చంద్రహారం, మరో జిగినీ గొలుసు తీసియిచ్చింది శశి తానే స్వయంగా అలంకరించింది అరుణ మెడలో.

"ఈ నెక్లెసుకంటె నాదింకా పెద్దది. ఈ చంద్రహారం మీద అదయితే యింకా బాగుండేది" అంది అరుణ.

"అటువంటిది మా పక్కింటి ఇందిరవద్ద వుంది. పోనీ, అది తెస్తాను."

"ఎందుకు లెస్తురూ! ఇవి చాలు. గంగిరెద్దు వేషం వేసుకున్నట్లుగా వుంటుంది... ."

"ఛ! అట్లాగంటారేమిటి? మీరివి వేసుకుంటే చాల బాగున్నారు. ముద్దుపెట్టుకోవాలనిపిస్తోంది" అంది శశి నవ్వుతూ.

"హతోస్మి. మీకు కూడానా? అయితే మీరు యింటికి రాగానే దిష్టితీసే సరంజామా సిద్ధం చేసి ఉంచండిసుమా! నా కంత పట్టింపు లేక పోయినా మావారి తాపత్రయం అట్లా వుంటుంది. విచిత్రంగావుంది కదూ! అందరి ఎదుటకు తీసుకు వెళ్ళాలి; అట్లా చేస్తే దిష్టి తగులుతుంది. అవ్వా కావాలి బువ్వా కావాలి అన్నట్లుగా వుంది. . సరే మూడున్నరయింది. మరినే వెడతాను. మీరు మా కోసం ఎదురు చూడకండి. థియేటరుకివెళ్ళి అంతగా పిక్చర్ మొదలయితే హాల్లోకి వెళ్ళిపొండి. ఆయన రాకపోయినా నేను వస్తాను" అని హేండ్ బ్యాగు తీసుకుంది అరుణ.

"నగలు తీసేస్తారేం?"

"ఇక్కడినుంచీ ఎందుకు వేసుకెళ్ళటం? అందరి కళ్ళూ వీటిమీదే ఉంటాయి స్టూడియోకి వెళ్ళాక పెట్టుకోవచ్చు" అని నవ్వి వాటిని చేతి సంచీలో పెట్టుకొని బయటకు నడిచింది అరుణ ఆమెను వీధిగుమ్మంవరకు సాగనంపింది శశికళ.

చకచకా గంటన్నరలో వంట పూర్తి చేసింది. ఆ దంపతులతో గడిపిన క్షణాలు పదే పదే గుర్తుకు వచ్చి లోలోపల నవ్వుకుంది శశికళ వాళ్ళింతో సన్నిహితులయినట్లు అనుభూతి చెందింది.. . రామం రాత్రికికాని రానని చెప్పాడు. కనుక సినిమాకి వెళ్ళినా ఫర్వాలేదు అరుణతో అనుబంధం రామానికిచెప్పి ఆశ్చర్యంలో ముంచాలనుకుంది శశి. ఇట్లా ఏదేదో ఆలోచిస్తూనే అన్ని పనులు చక్కబెట్టుకుంది ఈ లోపల పనిమనిషివస్తే చేయించుకోవల్సిన పని పూర్తి చేసుకుంది.

గులాబి రంగు జార్జెట్‌చీర కట్టుకొని, నీలి రంగు వెల్వెట్ జాకెట్ తొడుక్కుంది వేరే రాళ్ళ నెక్లెస్ చిన్నదివుంటే వేసుకుంది. అది ఉద్యోగం దొరికిన క్రొత్తలో రామం కొన్నాడు సాధారణంగా బయటకు వెళ్ళినప్పుడల్లా అది ధరించటం ఆమె కలవాటయిపోయింది. వేనిటీబేగ్ చేత్తో పట్టుకొని యింటికి తాళంవేసి, బయలుదేరింది—ఆ లోపలే ఇందిర, శ్యామల ఒకసారివచ్చి వెళ్ళటం, సినిమా ప్రోగ్రాం విషయంచెప్తే తమకు తీరికలేదని చెప్పటం జరిగిపోయింది.

సరిగ్గా పావు తక్కువ ఆరు గంటలకి థియేటర్‌కు రిక్షాలో చేరుకుంది శశి. ఆమె వొళ్ళంతా కళ్ళు చేసుకొని అరుణకోసం చుట్టూ చూసింది. ఆమె కనపడకపోవటంతో వాళ్ళింకా స్టూడియో

మంచి రాలేదనుకుంది.

పది నిమిషాలసేపు హాలు బయటనే నిలబడి నిరీక్షించింది. వచ్చేపోయేవాళ్ళ దృష్టులన్నీ తనపైనే పడటంతో ఆమెకు కొంచెం గర్వం కల్గించినా ముళ్ళ మీద నుంచున్నట్లనిపించింది. వాల్‌పోస్టర్లకంటె తనమీదనే ఎక్కువ మంది దృష్టి పడటం జనావళి సంకుచిత్వానికి, అసభ్యతకు తార్కాణమనుకుంది. మనసులో బాధపడినా, పైకి విమర్శించినా ఫలిత ముండదని ఆమెకు తెలుసు.

ఇంతలో టిక్కట్లు యివ్వటం ఆమె దృష్టిలో పడింది. అంతగా అరుణవస్తే లోపలికి రాకపో దనుకుని బాల్కనీ టిక్కట్లు తీసుకొని హాల్లోకి వెళ్ళింది శశికళ. అప్పటికే న్యూసురీలు రన్ అవుతోంది. అయినా, శశికళ చూపులు ద్వారం వద్దనే ఉన్నాయి. 'ఇంకా రాలేదేమిటి! ఇంకా స్టుడియోలో పని పూర్తి కాలేదేమో!'' అని ఎన్నిసార్లనుకుందో ఆమెకే తెలియదు.

అంతలో సినిమా మొదలుపెట్టారు. పావుగంట సేపటివరకు ఆమె సినిమా కథలో లీనంకాలేక పోయింది. ఇంటర్వెల్ వరకూ అరుణ విషయం మర్చిపోయింది. ఒక్కసారి హాల్లో మెర్క్యూరీ లైట్లు వెలిగేసరి కులిక్కిపడి వాస్తవికతలోకి వచ్చింది.

బాల్కనీ అంతా కలయజూసింది. ఆఖరిరోజు మూలాన ఆట్టే జనం కూడ లేరు. అరుణకాని, ఆమె భర్తకాని కనిపించక పోవటంతో ఆమె గుండె లెందుకో దడదడ కొట్టుకున్నాయి. మనస్సు పరిపరి విధాల పోయింది. అంతవరకు స్టూడియోలో పని పూర్తి కాలేదేమోనని సరిపెట్టుకోలేకపోయింది. హాలు బయటకువచ్చి చూసినా వాళ్లెవరూ కని పించలేదు. ఈలోపుగా ఏదైనా అర్జంటు పని తగి లిందేమో—ఒకవేళ హాలువద్దకు వచ్చేసరికి బుకింగ్ క్లోజ్ చేస్తే వెనక్కివెళ్ళిపోయారేమో—ఇట్లా అనేక రకాలుగా అనుకుంది. సినిమా వదలి వెళ్ళ బుద్ధి కాలేదు. పది గంటల కింటికి చేరుకోకపోరని సరి పెట్టుకుంది. ఇంతలో పిక్చర్ బిగిన్ అవటంతో హాల్లోకి వెళ్ళిపోయింది శశికళ.

తొమ్మిదిన్నరకి సినిమా అయిపోయింది. సినిమా సరదాగానేవున్నా, వెనుకటిలా ఆమె దృష్టి వాటి మీదకు పోలేదు. హాలు బయట అరుణకోసం వెదకినా వృథా అయింది. నిరుత్సాహంగానే రిక్షాఎక్కి యిల్లు చేరింది శశికళ

తాళంతీసి యింట్లో ప్రవేశించింది. అరుణ రాలేదు . బట్టలు కూడ మార్చుకోకుండ వాలు కుర్చీలో కూర్చుండిపోయింది ఆమె కేడుపొచ్చినంత పనయింది. హాలు దగ్గరకి వస్తానని చెప్పి అరుణ రాకపోవటంతో ఆమెపై కోపం వచ్చేసింది కళ్ళల్లో నిల్చిన నీళ్ళు చేతిరుమాలుతో ఒత్తుకుని కళ్ళు మూసుకుంది. అభిమానం ముంచుకొచ్చి కన్నీళ్ళ రూపం దాల్చింది.

అప్పుడే ఆమెకు నగల విషయం గుర్తుకు వచ్చి గుండె జల్లుమంది అరుణపై అనుమానం కల్గింది. కాని వెంటనే యింటి అద్దె ఎడ్వాన్సు యిచ్చిన విషయం, వాళ్ళ సూటుకేసు ఆ యింట్లో వుందన్న విషయం గుర్తుకువచ్చి కొంచెం ధైర్యం తెచ్చుకుంది.

పిచ్చిపిచ్చి ఆలోచనలతో మస్తిష్కం వేడెక్కింది. కణతలు బొటన వ్రేళ్ళతో నొక్కుకుంది. ఇందిరతోకాని, శ్యామలతోకాని చెపితే ఏదైనా సలహా యిస్తారేమో అనుకుంది మొదట. కాని అప్పుడు రాత్రి పదకొండు గంటలు దాటిందన్న విషయం జ్ఞప్తికివచ్చి ఆ ప్రయత్నం విరమించుకుంది. అదిగాక, తనేదో తెలివితక్కువపని చేసినట్లు కించ పడుతూ ఆ విషయం ఇంకొకళ్ళ దగ్గర బయట పెట్టుకోవటం మరీ చిన్నతనంగా వుంటుందను కుంది శశికళ.

క్షణంలో ఆశ, మరుక్షణంలో నిస్పృహ, మరొక నిమిషానికి జరగనున్నది జరక్కపోదన్న వైరాగ్యం, ఇదే తెలివి తక్కువ తనంగా రామం భావిస్తాడేమోనన్న బాధ.....యిట్లా అనేక విధాలుగా మెలి కలు తిరిగిపోయింది శశికళ.

కళ్ళనీళ్ళు తుడుచుకోవాలన్న ధ్యాస కూడా లేదామెకు. ఆకలి చచ్చిపోయింది. తా నరుణచేత మోస గింపబడ్డదో, లేదో కూడా నిర్ణయించలేని అనిశ్చిత పరిస్థితిలో ఉండిపోయింది.....అట్లా వాలు కుర్చీలో ఆలోచనలతో సతమతమవుతూనే మగత నిద్ర కొరిగింది. అదైనా రాత్రి ఒంటిగంటకు.

—వీధితలుపు చప్పుడయ్యేసరికి నిద్దట్లోంచి ఉలిక్కి పడింది శశి. ఆమెలో విద్యుద్వేగం ఉత్పన్నమైంది. అరుణవచ్చి వుంటుందనుకొని గబగబవెళ్ళి తలుపు తెరిచి ఎదురుగా నిలబడిన రామాన్నిచూసి కొయ్యబారి పోయింది.

అతడు లోపలికివెళ్ళి బట్టలు మార్చుకొని వచ్చినా శశికళ గుమ్మంవద్ద అట్లాగే నిలబడి పోయింది

"ఏం! బొమ్మలా నిలబడిపోయావ్?" అని పెదవులతో ఆమె చెక్కిలి నతడు తాకేవరకు ఆమె తేరుకోలేదు. పేలవంగా తెచ్చిపెట్టుకుంది చిరునవ్వును. సమాధానమేం చెప్పాలో తోచలే దామెకు

"ఏమిటి? షికారుకాని, సినిమాకుగాని వెళ్లావా? డ్రస్సు మార్చుకోకుండానే పడుకున్నావ్!" అన్నాడు రామం వాలు కుర్చీలో వెనక్కివాలుతూ.

"సినిమాకు వెళ్ళాను....." అంది క్లుప్తంగా. అరుణ ఆ యింట్లో అద్దెకు ప్రవేశించిన విషయం దాచటంవల్ల ప్రయోజనం లేదనిపించిందామెకు. నగ లిచ్చిన విషయం తప్పించి అరుణ ఉదయ మింటికి వచ్చినదాదిగా జరిగినదంతా చెప్పింది శశికళ. "..... ఇంతవరకు ఆమెకాని, ఆమె భర్త కాని రాలేదు. నాకేమిటో అర్థం కావటంలేదు."

"ఎక్కడికి వెడతారు? ఎడ్వాన్సు కూడా యిచ్చా రంటున్నావుగా! వాళ్ళను గురించి నువ్వింత ఆందోళన పడటమెందుకు?....అంత నీరసంగా వున్నావు, అన్నం కూడా తినలేదా?" అని అడిగాడు రామం మామూలుగా.

"తిన బుద్ధి కాలేదు....అబ్బా! అప్పుడే ఐద యింది" తన చేతి వాచీ చూసుకుంటూ అందిఆమె.

ఆమె చీర మార్చుకొని గృహకృత్యాలలోకి దిగిపోయింది. రామం అట్లా వాలుకుర్చీలోనే మాగన్నుగా నిద్రపోయాడు. ..ఉదయం ఎనిమిది గంటలవరకు నగలు అరుణ కిచ్చిన విషయం రామంతో చెప్పుదామా వద్దా అని మథనపడింది శశికళ. అరుణ రాకపోవటం ఆమెమీద మరింత అనుమానం ధృవపడేలా చేసింది..... ఇక ఆ మూగ బాధ భరించలేక రామంతో చెప్పేసింది

ఆమె కళ్ళల్లో నీళ్ల నిలిచాయి రామం ఆ విషయం విని తెల్లబోయాడు. "నీకు టోకరాయిచ్చి నగలు కాజేసారన్నమాట! అట్లా ఎట్లా మోస పోయావ్?" అన్నాడు రామం విసుగ్గా.

"వాళ్ళ ప్రవర్తననుబట్టి నాకు మోసగాళ్ళని అనిపించలేదు. ఆ సమయంలో మీరున్నా అట్లాగే చేసేవారు. ఇంతకీ నేను దురదృష్టవంతురాల్ని" అంది ఆమె కించపడుతూ. ఆమె నల్లని కళ్ళు నీళ్ళు నింపుకున్నాయి.

"ఆ సూటుకేసులో అసలేవీ లేవేమో!" అంటూ రామం వెళ్ళి దానిని పరీక్షించాడు. దాని తాళం, వెంటనే వూడివచ్చింది. లోపల రెండు వాయిలు చీరలు, రెండు పుస్తకాలు తప్ప మరేమీ లేవు. "........శశీ! వీళ్ళెవళ్ళో నిన్ను పూర్తిగా మోసగించారు. నువ్వింత గుడ్డిగా మోసగింపబడతావని నే నెప్పుడూ అనుకోలేదు. నిన్నెవరూ మోసగించ లేరని డంబాలు పలికేదానివి. ఇప్పుడేమైంది? అనుభవానికివస్తేకాని తెలియదు" అన్నాడతడు నిష్ఠురంగానే.

భర్త ఏమి మాట్లాడినా జరిగినదానిలో తనది కూడా కొంచెం తప్పున్నట్లు భావిస్తున్న శశికళ ఏమీ సమాధానం చెప్పలేకపోయింది ఆమెకు దుఃఖం పెల్లుబికి వచ్చింది. గదిలోకివెళ్ళి మంచంపై బోర్లగిల పడుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

పావుగంట గడిచింది. ఇంతలో "శశీ! మనింటికి చుట్టాలొచ్చారు. ముఖం తుడుచుకొనిరా!" అంటూ ఆమె దగ్గరగా వచ్చాడు రామం. గబుక్కున పైకి లేచి కళ్ళు తుడుచుకొని ఎవరన్నట్లు ప్రశ్నార్థకంగా చూసిందతనివైపు. రామం మామూలుగా చిరునవ్వు ముఖంతో ఉండటం ఆమె కాశ్చర్యమే కల్గించింది.

"బయటకు రా! ఎవరో చూద్దువుగాని" అన్నాడు రామం. ఆమె చేయి పట్టుకొని రేడియో వున్న పెద్ద గదిలోకి తీసుకువెళ్ళాడు. అక్కడ అరుణని, ఆమె భర్తని చూసి ఆశ్చర్యానందాలలో మునిగిపోయింది శశి. రామం మాట లామె కర్థం కాలేదు. వారి ముఖాలలోని చిరునవ్వు ఆమెను సందిగ్ధావస్థలో నుంచింది.

"నేనేం మోసపోలేదు! చూశారా?" అన్నట్లు రామం కళ్ళల్లోకి చూసింది శశి

"అదంతా వేరేకథలే!" అన్నట్లుగావుంది. అతని పెదవులపైన చిరునవ్వు

"మేము పిక్చరుకు రాలేదు సరికదా యింత వరకు అయిపులేమని కోపంగా వుందా మీకు!" అంది అరుణ నవ్వుతూ. అవునని, లేదని చెప్పలేని నవ్వు నవ్వింది శశికళ

"శశీ! .." అని అరుణ భర్త పిలిచేసరికి శశికళ ఉలిక్కిపడింది. "నిన్నింక సస్పెన్సులో ఉంచటం నాకిష్టంలేదు. మీ నాన్న, పినతండ్రి మనుమడు శ్యామసుందర్ మిలటరీలోకి వెళ్ళిపోయాడని నీవు వినేవుంటావు"

"అవును. నా కెనిమిదేళ్ళున్నప్పుడు చూసాను. మళ్ళీ అతని కబుర్లు తెలియవు కాని, రెండేళ్ళ నాడు కాబోలు అతనికి పెళ్ళయిందని, తల్లీ





# ఆడపడుచు కట్నం

దంగ్రడులను కూడా తీసుకుపోయాడని మా నాన్న అమ్మతో చెప్తుంటే విన్నాను" అంది శశి

"వాడే నేను. ఆ పెళ్ళికూతురే యీ అరుణ. నెలరోజులు సెలవుపెట్టి మన బంధువులందర్నీ చూద్దామని బయలుదేరాము. బాబయ్యను చూడ్డానికి వెడితే నీవు, మీ ఆయన యీవూళ్లో ఉన్నారని చెప్పాడు. మా అక్కయ్య కూడా యీ వూళ్లోనే వుంటోంది. మొన్న రాత్రి ఇక్కడకు వచ్చాము. వస్తూనే మీ ఆయన ఆఫీసుకు ఫోన్ చేసాను. అతడు, నేను కల్సుకొని విషయాలు తెల్సుకున్నాము. తాను క్యాంపు వెడుతున్నానన్నాడు ... అరుణ, నేను నిన్ను మోసగించడానికే ప్లాను వేశాము. అందుకనే యింతవరకు రాలేదు. నువ్వు చాల బాధపడి వుంటావు. ఈ పని చేసింది మేమయినా చేయించింది వేరొకరు?" అన్నాడు శ్యామ సుందర్.

"ఎవరు?" అంది శశి సాశ్చర్యంగా.

"మీవారే! ఆపని చేయమని మాకు సలహా యిచ్చారు. మీ వదిన ప్రోత్సహించింది."

"అంతాకల్సి నన్ను మోసగించారన్నమాట !" అంది శశి బుంగమూతిపెట్టి.

"అవును. ఎవరి మోసంలోనూ పడనని డంబాలు పలకవుగా యింక?" అన్నాడు రామం నవ్వుతూ.

"అయితే రాత్రి వండిన అన్నమట్లాగే వుంది. ఆ చద్దన్నమే తినండి మీరంతా. అదే మీకు శిక్ష" అంది శశికళ.

"బలేదానివి. శ్యామసుందర్ నిన్నాడపడుచుగా సత్కరిద్దామని వస్తే చద్దన్నం పెడదామనుకుంటున్నావా?" అన్నాడు రామం.

అరుణ తానే స్వయంగావెళ్ళి కుంకుమభరిణ తెచ్చి బొట్టుపెట్టింది శశికళకు శ్యామసుందర్ అందించిన కాశ్మీర్ సిల్కుచీర శశికళ చేతుల్లో పెట్టింది అరుణ ఆమె కళ్ళల్లో ఆనందబాష్పాలు తళుక్కుమన్నాయి.

"ఇప్పుడిదంతాఎందుకువదినా?"అనిఅడిగిందిశశికళ.

"నీ పెళ్ళికి మేము రాలేదుగామ్మా!" అన్నాడు శ్యామసుందర్.

"నీ పెళ్ళికివి బహుమతులు....." అంటూ శశికళనగలే ఆమె చేతుల్లో పెట్టింది అరుణ... అంతా నవ్వుకున్నారు

"మిస్టర్ రామం! ఆ శుభవార్త కూడ చెప్పెయ్యవోయ్!" అన్నాడు శ్యామసుందర్.

అరుణవైపు ప్రశ్నార్థకంగా చూసి రామం కళ్ళల్లోకి తూపులు విసిరింది శశి.

"ఆ! ఏముంది? రిజల్ట్సు పడ్డాయనేనా! నా కెప్పుడో తెల్సు శశి ప్యాసవుతుందని" అన్నాడు రామం శశికళ చిన్నగా నవ్వి నిట్టూర్చింది

"మరి మీ అద్దె ఎడ్వాన్సు డబ్బు ."అంది శశికళ నవ్వుతూ.

"అది ఆడపడుచుకట్నం యిచ్చిందిలే మీ వదిన" అన్నాడు శ్యామసుందర్.

"కాదు. నిన్ను మోసం చేయుటానికి ముందు పెట్టుబడి పెట్టింది .. ." అన్నాడు రామం నవ్వుతూ కళ్ళతో వారిసారించి తూపులు విసిరి అతన్ని మధురవేదనకు గురిచేసి మృదుమందహాసం చేసింది శశికళ తెప్పరిల్లిన హృదయంతో..... ★



# వనితా వాణి

## మీవాళ్లేం పెట్టారు

వసంతగారి "మీవాళ్లేం పెట్టారు ?" వ్యాసం సారెల విషయంలో విమర్శించేవారి మనస్తత్వాన్ని మార్చే ఒక విప్లవ వసంతం. నిజంగా మీవాళ్లేం పెట్టారు అనే ప్రతివారూ వాళ్ల వాళ్లేం పెట్టారో ఒకసారి ఆలోచించాలి. తాహతు ఉన్నా, లేకపోయినా, సంఘాచారాలకు, దర్పాలకు లోనై, తమ బిడ్డల భావిజీవితాన్ని దృష్టిలో ఉంచుకొని వారి సౌఖ్యము కోసమై ఎన్ని కుటుంబాలు చితికి పోతున్నాయో యోచించే దెవరు ? ఎన్ని కష్టాల కైనా ఓర్చి లోకం కోసం యిచ్చేవారికి తెలుస్తుంది కాని దీనిలోని బాధ విమర్శించేవారి కేం తెలుస్తుంది. ఇలాంటి వ్యాసాన్ని పాఠకలోకాని కందించిన రచయితకు, పత్రికకు నా ధన్య వాదాలు.

మోర్ల భానుమతి ( నెల్లూరు )

* * *

వసంతగారి వ్యాసం చాలా బాగుంది. మా పక్కింటమ్మాయికి తల్లి లేదు. ఆమె పెళ్లికని తండ్రి ఉన్న ఆస్తి, ఇల్లు అమ్మి కాస్తో కూస్తో సారె పెట్టి అత్తవారింటికి పంపాడు. కాని వారం రోజులకే ఆ అమ్మాయి ఏడుస్తూ తిరిగొచ్చింది. కారణం పందిర పట్టెమంచం తేనందుకు అత్త గారు వెళ్లగొట్టారట. ఇంక ఏం డబ్బుందని మంచం పెడతాడా తండ్రి ? ముసలితనంలో ఎంతో బాధపడుతున్నాడాయన. తన గతికి కుమిలి కుమిలి ఏడుస్తోందా అమ్మాయి. ఆమె జీవితం మూడు రోజుల ముచ్చటయిపోయింది. అత్తగారికి బుద్ధిలేక వెళ్లగొడ్తే పోనీ చదువుకున్న భర్తగారికైనా బుద్ధుండొద్దూ ! పోనీ వాళ్లేం లేనివారా ? కాదే ఇంకా ఎందుకో పరిస్థితులు తెలిసి కూడా ఇతర్ల సొమ్ము వాంఛించడం ? కోడళ్లని దుఃఖపెడ్తే వాళ్ళ కేమొస్తుందో ? ఎదుటి మనిషిని బాధపెట్టడం వాళ్ల కెంత సరదా? వసంతగారన్నట్టు ప్రతి అత్త తనుకూడా పూర్వం ఒకప్పుడు కొత్తకోడలన్నమాటగుర్తు పెట్టు కుంటే బాగుండును.

సీతామణి ( ఖుర్దారోడ్ )

* * *

వసంతగారు వ్రాసిన "మీవాళ్లేం పెట్టారు" వ్యాసం నాకు చాల నచ్చింది. వారు వ్రాసిన వది ఈ రోజుల్లో జరుగుచున్నదే. అబ్బాయికి పెళ్లి చేశారంటే, అట్లకాడ దగ్గర నుండి సమ స్తము కోడలు తేవలసినదే. లేకపోతే అత్తగారు నరసింహావతారం ఎత్తుతుంది. డబ్బు, డబ్బు అనే వారికి ఏదైనా ఉపాయం ఉంటే చాలవరకు పరి స్థితులు మారవచ్చు. వసంతగారితో నేను ఏకీ భవిస్తున్నాను. వారికి నా హృదయపూర్వక ధన్య వాదాలు.

వారణాసి లక్ష్మీ శ్రీరామారావు ( చిలకలూరిపేట )

* * *

వసంతగారు వ్రాసిన "మీవాళ్లేం పెట్టేరు" అనే వ్యాసము చాలా బాగుంది. ఉన్నది ఉన్నట్లుగా వ్రాసేరు. ఆమెకు నా అభివందనములు.

ప్రతి అత్తగారు తన కోడలు సారె తేవాల్ని ఆశపడుతుంది. తన కూతురు కూడా ఒక రింటికి కోడలుగా వెళ్లినపుడు తను సారె దండిగా పెట్టాలని తలంచదు. మన పిల్ల ఒకరి ఇంటికి కోడలుగా వెళ్తే ఎంతో, ఒకరి అమ్మాయి మన యింటికి వస్తే అంతే నన్న ఇంగితజ్ఞానము వాళ్ల కుండదు. కోడలు తీసుకువచ్చి మన ఇల్లు నింపాలి అని తలపోస్తారే తప్ప వాళ్ల అమ్మా యికి పెట్టబోయేసరికి మొండిచెయ్యి చూపు తారు. ఇటువంటి పరీక్షలు ప్రతియువతికి పెళ్ల యిన క్రొత్తలో ఎదురవుతుంటా యనుకోండి. అత్తగారు కాగానే ఇవన్నీ మరచిపోయి, తనకి వచ్చే ఆ క్రొత్త కోడలిని అవి తేలేదనీ, ఇవి తేలేదనీ సాధిస్తుంది. ప్రతి స్త్రీ ఇటువంటి వ్యాసాలు చదివి ఇకమీదనైనా తమ తప్పులు తెలుసుకుని నిజం గుర్తించితే మంచిది.

బి ధనలక్ష్మి (బరంపురం)

* * *

మీవాళ్లేం పెట్టారు అన్న వ్యాసం చాల బాగుంది. వసంతగారు అత్తలకు, కోడళ్లకు నచ్చేలా వ్రాసారు. అయినా ఈనాటి అత్తలు అంత గయ్యాళీలుగా లేరు కానీ, ఇరుగు పొరుగు అమ్మలక్కలు పోరు మాత్రం తప్పటంలేదు వసంతగారికి పత్రిక ద్వారా అభివందనములు తెలుపవలెనని ప్రార్థిస్తున్నాను.

పి. సుబ్బలక్ష్మి ( కొవ్వూరు )

* * *

## అనుభవించేవారు

నండూరి రాజ్యలక్ష్మిగారి "అనుభవించేవారు" అను వ్యాసం చాలా చక్కగా ఉంది. వారు చెప్పి నట్లు మధ్యతరగతి కుటుంబీకులకు ఇలాంటి అతిథులవల్ల చాలా కష్టంగా ఉంది. ఈ వ్యాసం వల్లనైనా అతిథులు కొంచం చదువు, సంస్కారం ఉన్నవారైతే ఇతరుల కష్టాల గుర్తించి కొంత మటుకు బంధువుల ఇళ్లకు పోకుండా ఉంటారని నా నమ్మకం.

ఎం. సత్యవాణి ( విశాఖపట్నం )

* * *

నండూరి రాజ్యలక్ష్మిగారు వ్రాసిన "అనుభ వించేవారు" అన్న వ్యాసం చాలా బాగుంది. ప్రతి కుటుంబములో ఎవరో ఒకరు అపరిచిత దూరపు బంధువులు తటస్థపడుతున్నారు. వారి చుట్ట రికం ఏ వైపుదో, వారిని అసలు చూచేమా ? లేదా? అని తెలియక తికమకలు పడేవారిలో నే నొకరిని. మా యింటికి ఓ దూరపు చుట్టం వచ్చాడు. మావారికి ఏదో దూరపు చుట్టరికాన్ని కలుపు కొన్నాడు. అసలు మావారు ఊరులో లేరు. మర్యాద చేయకపోతే ఏమైనా అనుకొంటారేమో నని ఘనంగా (మేము చేయకున్నా) ఆయనే చేయించుకొన్నాడు. మావారు క్యాంప్ నుంచి వచ్చాక అటువంటి బంధువు తనకు లేడని, పకపక నవ్వారు.

రచయిత్రి నండూరి రాజ్యలక్ష్మిగారికి నా అభి వందనములు తెలియజేయుటకు చాలా సంతో షిస్తున్నాను.

ఆర్. కె. అన్నపూర్ణాదేవి ( ఎర్రగుంట్ల )

* * *

## కాటుక పుల్లలు

కాటుకపుల్లలు వ్యాసం చదివాము. శ్రీమతి రాధారాఘవ్‌గారు వ్రాసినట్లు చేసినాము. చాలా బాగా తయారయినాయి. రచయిత్రికి నా అభి నందనలు పత్రిక ద్వారా అందజేస్తున్నాను.

కె. రత్నకుమారి (విశాఖపట్నం)



మహేంద్రావారి 'కృష్ణప్రేమ' లో జమున.



విశ్వకవి రవీంద్రుని కథ 'మణిహార్' ఆధారంగా సత్యజిత్ రాయ్ నిర్మించిన చిత్రంలో ఒక సన్నివేశం

చిత్రసమీక్ష:

# సత్యజిత్ రాయ్ అపూర్వ చిత్రసృష్టి

## ముగ్గురు ముగ్ధకన్యకలు

సుప్రసిద్ధులయిన రచయితల నవలలు, కథలు, నాటకాలు ఆధారంగా తీసుకుని సినిమాలు తియ్యడం మన కింకా బాగా పరిపాటి కాలేదు. ఇప్పుడు మన దేశంలో తయారయ్యే చిత్రాలన్నీ దర్శక నిర్మాతల ఊహాలోకాలనుంచి ఊడిపడినవే. నిజానికి సినిమాలన్నీ జనసామాన్యంలో ప్రఖ్యాతులయిన తారా తారకుల చుట్టూ అల్లుకొన్నవే. ఇందుచేత ఈ రోజుల్లో సామాన్యంగా మనం ఏ సినిమా చూసినా ఆయా పాత్రలకన్న వాటి తెరమరుగున ఉన్న వ్యక్తులే కొట్టవచ్చినట్టు కళ్ళెదుట సాక్షాత్కరిస్తారు! ఇలాగ వీటి సుగుణగణాలింకా ఎన్నయినా ఏకరువుపెట్టవచ్చును!

అయితే ప్రపంచ ప్రఖ్యాత సినీదర్శకుడు సత్యజిత్‌రాయ్ తొక్కిన దారి వేరు.

ఈమధ్యన ఈయన తీసిన 'తీన్ కన్యా' అన్న చిత్రం చూశాను. 'తీన్ కన్యా' అంటే ముగ్గురు కన్యకలు. వీరి మనస్తత్వ చిత్రణమే దీని లక్ష్యం. రాయ్ వీరిని టాగూర్ రచించిన మూడు గొప్ప కథానికలలో నుంచి ఎన్నుకొన్నాడు.

### రతన్

రవీంద్రుని ప్రసిద్ధ కథ 'పోస్ట్ మాస్టర్' పాఠకులు కందరికీ సుపరిచితమే.

కలకత్తా నివాసి ఒక పోస్టుమాస్టర్ని అమాంతంగా ఏదో మారుమూల కుగ్రామానికి బదిలీ చేస్తారు. అతగాడు ఒక్కడే అక్కడికి వెళ్లి కొత్తగా పోస్టాఫీసు ఏర్పాటు చేస్తాడు. పాపం ఆ ఏకాకి మానవుడికి ఆ కుగ్రామంలో నా అన్నవాళ్లెవళ్ళు కనబడరు నిజాని కది ఒక చిట్టడివిలాంటి ఊరు. 'రతన్' అని కది పన్నెండేళ్ల పసిబాలిక అతనికి పనికత్తెగా కుదురుకుంటుంది రతన్‌కి తల్లిగాని,, తండ్రిగాని, తదితర బంధువులుగాని లేరు. పోస్టుమాష్టర్ చెప్పిన చిన్న చిన్న పనులు చేస్తూ ఎంతో ఆసరాగా ఉంటుంది. తీరికసమయాల్లో పోస్టుమాష్టరు ఆ పసిదానికి అక్షరాభ్యాసం ప్రారంభించి క్రమక్రమంగా గుణింతాలు నేర్పుతూంటాడు.

ఆనాటి కానాటికి ఆ పల్లెటూరి ఒంటరి జీవితంతో పోస్టుమాస్టరికి ప్రాణం విసిగిపోతుంది. ఆ కుగ్రామంలో అడుగుపెట్టినప్పటినించి అతనికి ఇంటిమీదే ధ్యాస! దానికి తోడు రోజురోజు అర్ధరాత్రివేళ నక్కల అరుపులు, గుడ్లగూబల కూతలు వినడంతో అతని ప్రాణాలు కుంగిపోతాయి. అక్కడినించి తప్పించుకుని పారిపోయి తిరిగి ప్రపంచంలో పడటం ఎలాగా అని ఆలోచిస్తూంటాడు. కాని రతన్‌కి మాత్రం అతనిమీద ఎంతో ఆత్మీయత ఏర్పడుతుంది. పాపం ఆ పసిదానికి విశాల ప్రపంచంలో ఆత్మబంధువు లెవరున్నారు?

చదువు ద్విత్వాక్షరాలదాకా సాగుతుంది. అంతలోనే పోస్టుమాష్టర్ బదిలీకోసం చేసిన ప్రయత్నం ఫలిస్తుంది. అతగాడు పెట్టె, బేడ సర్దుకుని కొత్తగా వచ్చిన పోస్టుమాస్టరికి ఛార్జి అప్పజెప్పి ఇంటికి బయలుదేరతాడు. కొత్త పోస్టుమాష్టరుతో రతన్‌ని జాగ్రత్తగా చూడమని చెబుతాడు. కొంత బహుమతి కూడా ఇవ్వబోతాడు కాని అది ఆమె తీసుకోదు. నిశ్చల దృష్టితో అతనివైపే చూస్తూ గుడ్ల నీరు గుక్కుకుని కుమిలి కుమిలి దుఃఖిస్తుంది. టాగూరు ఆమె నీరవశోకం అగాధమయిన అమర వాణితో చిత్రించాడు. నిజాని కిందులో అంతగా చెప్పదగ్గ పెద్ద కథ ఏది లేదు. అయినా రాయ్ ఇదే గాథ ఆధారంతో తన చిత్రం నిర్మించాడు!

### మణిహార్

ఫణిభూషన్ గొప్ప వ్యాపారి. ధనికుడు. వర్తక వ్యవహారాలతో అతడు చాలాకాలం కలకత్తా వంటి మహానగరాలలోనే తిరుగుతూంటాడు. అతని



శాంతి కళావారి 'శాంత'లో రేలంగి, సూర్యకాంతం.

నూతన గృహిణి మణిమాలిక. ఫణిభూషణ్ ఒక పల్లె ప్రాంతంలో నదీతీరాన కట్టించిన ఒక పెద్ద మేడలో ఆమె కొత్త కాపురం ప్రారంభమవుతుంది. ఎవరో యిద్దరు ముగ్గురు పరిచారికలు తప్ప ఇరుగున పొరుగున కాలక్షేపానికి ఎవ్వరు కనబడరు. సామాన్య గ్రామస్థులున్నా ఆ భవంతితో వారి కంతగా పరిచయం లేదు. భార్యాభర్తల భోగభాగ్యాల కేమీ లోటు లేదు. కాని వారిద్దరు నివసించే ప్రపంచాలు వేరు. భర్త కెప్పుడు ధనార్జన మీదే దృష్టి. ఆ ముగ్ధ వధువు తన సాహచర్యం కోసం, ఆప్యాయత కోసం అర్రులు చాచుతూ ఉంటుందని కూడా అతనికి తెలియదు. ఎప్పుడైనా చుట్టపు చూపుగా ఇంటికి వచ్చినా అంటీ అంటనట్టుంటాడు. అపైన ఆ దంపతుల కెంతకాలానికి సంతతి కూడా కలగదు. దానాదీనా మణిమాలిక కా భవంతి ఒక పెద్ద కారాగారంతా తయారవుతుంది. భర్త ప్రేమ అంటే ఏమో ఆమె ఎన్నడు చవిచూడలేదు. పోనీ అనుకుంటే పిల్లపాప బయలుదేరలేదు. చివరికి ఆమె గాఢానురాగం బంగారునగల మీదికి తిరుగుతుంది. ఫణిభూషణ్ అప్పుడప్పుడు విలువయిన ముత్యాల హారాలు, వజ్రాలు పొదిగిన నగలు బహూకరిస్తూనే ఉంటాడు. కాని ఏమి లాభం! ఆమె ఒంటరి జీవితం అలాగే పట్టి ఎడారిలా సాగిపోతూ ఉంటుంది.

అపైన ఫణిభూషణ్ వ్యాపారం దెబ్బ తింటుంది. అతడు ఒకనాడు భార్యని నగలిమ్మని అడుగుతాడు. ఆమె వినీ విననట్టు మాట్లాడక కూరుకుంటుంది! జీవితంలో ఆమె గట్టిగా పట్టుకొన్న ప్రేమాలంబనం కూడా చేయిదాటిపోయే పరిస్థితి ఏర్పడింది. భర్త రుసరుసలాడుతూ వెళ్లిపోతాడు.

మణిమాలిక దూరబంధు వొకడు ఫణిభూషణ్ దగ్గర గుమాస్తాగా పనిచేస్తున్నాడు. మణిమాలిక కేమీ పాలుపోక ఆ సమయంలో అతన్ని సలహా అడుగుతుంది. ఫణిభూషణ్ ఏదోవిధంగా డబ్బు సర్దుబాటు చేసుకోగలడని చెప్పి జవాహరీతో పుట్టింటికి బయలుదేరమని అతడు సలహా యిస్తాడు. అకస్మాత్తుగా వారిద్దరు ఒక నావ మీద బయలుదేరతారు అంతకుమునుపే గాలివాన ప్రారంభమయింది. అయినా వారు లక్ష్యపెట్టలేదు. నావ నట్టేటిలో మునిగిపోయింది. కాని ఆ దుర్వార్త మరి కొన్నాళ్లదాకా ఎవరికి తెలియదు. ఫణిభూషణ్ తన భవంతికి తిరిగివచ్చి భార్య పుట్టింటికి వెళ్లిపోయినదని విని ఆగ్రహిస్తాడు. చిట్టచివరికి ఉత్తరంముక్క కూడా వ్రాయదు. అహోరాత్రాలు నిద్రాహారాలు కూడా విడిచిపెట్టి ఆమెకోసం నిరీక్షిస్తుంటాడు. కలలో కలవరిస్తాడు. చిట్టచివరకి అమూల్యరత్నాలంకారాలతో తరలిస్తున్న ఆమెకు కంకాళం మాత్రమే అతని స్వప్నసీమలో సాక్షాత్కరిస్తుంది!

## సమాప్తి

ఈ మూడవ కథ 'సమాప్తి' నాయిక మృణ్మయి. ఈమె పట్టి ఆకతాయి పల్లెటూరి పిల్ల. చిన్నప్పటినించి చెట్లెక్కడం, తోటి మొగపిల్లలతోను, ఆడపిల్లలతోను కలిసి ఊరమ్మట బలాదూరు తిరగడం, ఒక ఉడతని పెంచడం ఆమె కలవాట్లుగా తయారయ్యాయి. అపూర్వకృష్ణ పుట్టిన గ్రామం కూడా అదే. అతగాడు కొత్తగా బియ్యే ప్యాసై తన ఇంటికి తిరిగి వస్తూ దారిలో ఏరుదాటి మోకాటిలోతు బురదలో కూరుకుపోతాడు. ఆ సమీపంలో తోటి పిల్లలతో కలిసి తిరుగుతున్న మృణ్మయి అది చూసి విరగబడి నవ్వుతుంది. పాపం మన పట్టభద్రుడు ముఖం చిన్నబుచ్చుకుని ఆ బురదలో కాళ్లీడ్చుకుంటూ ఇంటికి చేరుకుంటాడు. మరి కొన్నాళ్లకి తల్లి పెళ్లి చేసుకోమని బలవంతం చేస్తుంది. ఏదో ఒక సంబంధం చూస్తుంది. కాని మన బియ్యే కది నచ్చదు. మృణ్మయినే తప్ప మరెవరిని పెళ్లి చేసుకోనని భీష్మించుకుని కూర్చుంటాడు. అయితే అతని తల్లికి ఆ సంబంధం అంటే కిట్టదు. దానికి మృణ్మయి ఆకతాయితనమే కారణం. చిట్టచివరి కెలాగో అలాగ పెళ్లి అవుతుంది. కాని అప్పటినించి మృణ్మయి పెడమొహం పెట్టుకుని మూడంకె వేసుకుని కూర్చుంటుంది. నిజానికి మృణ్మయికి భర్తమీద ఇష్టం లేకపోలేదు. కాని ఆమె కింకా పూర్తిగా పసితనం పోలేదు. అత్తవారింటికి వెళ్లినా అదే పల్లెటూళ్లో చెట్లమ్మట, పుట్లమ్మట తిరుగుతూ ఉంటుంది. ఈ వింత ధోరణితో నవ కృష్ణునికి బాగా గాభరా పట్టుకుంది. పగలంతా మృణ్మయిని వెతికి పట్టుకోవటమే అతని కొక దైనందిన కృత్యంగా తయారవుతుంది. ఒకసారి ఆమె పుట్టింటికి కూడా పారిపోతుంది. మొత్తంమీద ఎలాగయితే నేం మృణ్మయి కొంత దారికి రావడంతో కథ సుఖాంతమై కంచికి వెళ్లిపోతుంది.

## రాయ్ ప్రతిభ

సత్యజిత్‌రాయ్ ఈ కథా చిత్రాల తయారీలో దేశంలో సుప్రసిద్ధులయిన సినీతారల నెవరిని ఎన్నుకోలేదు. ఈ చిత్రంలో నటులు అందరు సామాన్యులు. కాని వారి నటనాకౌశలం అత్యంత సరళంగా, సహజంగా, అమాయికంగా సాగిపోయింది. పోస్టుమాస్టర్‌లో దుఃఖభరితమైన రతన్ నీరవ నిశ్చల దృష్టిగాని, ఆకతాయితనంతో నిండిన మృణ్మయి అమాయిక వీక్షణంగాని చూచినవారెన్నటికి మరచిపోలేరు. వేషభాషలలోగాని, నేపథ్య సంగీతంలో గాని, హావభావాలలో గాని, సంభాషణలలో గాని, పరిసరాలలో గాని, ఎక్కడ రవంతయినా అస్వాభావికత పొడకట్టదు. హాలులో కూర్చున్నంతసేపు ఏదో సినిమా చూస్తున్నామన్న స్ఫురణ కలగదు. వంగదేశం పల్లెపట్టులలో గ్రామీణులతో కలిసి మెలిసి తిరుగుతున్నట్టొకవిధమయిన అనుభూతి కలుగుతుంది.

ప్రకృతిదృశ్యాల ఛాయాగ్రహణంలోను, ఆయా పాత్రలలో అతి సున్నితమయిన భావాల కదలికల చిత్రణంలోను సత్యజిత్‌రాయ్ సిద్ధహస్తుడు. మణిహారా కథాచిత్రం అన్నిటికన్నా సర్వోత్తమంగా ఉన్నదని సునిశిత విమర్శకులు నా మిత్రు లొకరు అన్నారు. నా మట్టుకు నాకు పోస్టుమాస్టరే అన్నిటికన్నా గొప్పగా ఉన్నదని అనిపించింది. నిజానికి వీటి తారతమ్య పరిశీలన చేసి నిగ్గు తేల్చడం చాలా కష్టం. మూడవది ప్రేక్షకుల నెలాంటివారి నయినా ఉర్రూత ఊగించగలగాథ. జామినీరాయ్, అమృత షేర్‌గిల్ మొదలుగాగల మన చిత్రకారులు కొందరు తమ జానపదచిత్తరువుల రచనలతో ప్రపంచప్రఖ్యాతి గడించుకొన్నారు. శ్రీ సత్యజిత్ రాయ్ ఆ మహాశిల్పుల కోవకు చెందిన సినీ దర్శకుడు. ఒకసారి చూచినతరువాత ఆయన చిత్రాలు జీవితాంతం వరకు చెరగని మనోజ్ఞానుభూతి రూపంలో నిలిచిపోతాయి! 

పి. గణపతిశాస్త్రి

# వార్తాభరణం

ఆంధ్ర రాజకీయ చరిత్రలో ప్రసిద్ధికెక్కి, శ్రీ కృష్ణదేవరాయల కుడిభుజంగా పని చేసిన సచివుడు, బహుముఖ ప్రజ్ఞాధురీణుడు తిమ్మరసు మహోజ్వల జీవిత గాథ చలన చిత్రంగా రూపొందబోతోంది.

గౌతమీ ప్రొడక్షన్స్ అనే సంస్థ అప్పాజీ (తిమ్మరుసు) జీవిత చరిత్రను తెరమీద అద్భుత, కమనీయ చారిత్రాత్మక కళాఖండంగా రూపొందించాలని ప్రయత్నాలు సాగిస్తోంది ఈ చిత్ర రాజానికి కథ, మాటలు, పాటలు : పింగళి నాగేంద్రరావు ఈ చిత్రంలో యన్. టి. రామారావు నటించగలరని తెలుస్తోంది. వచ్చే నెలలో సెట్సుకు తీసుకుపోవాలని శ్రీ పుండరీకాక్షయ్య ప్రయత్నం చేస్తున్నారు.

## ఋష్యశృంగ

గీతా పిక్చర్సు నిర్మిస్తున్న ఋష్యశృంగ నిర్మాణం పూర్తయిందని వినికిడి ఈ నెలాఖరులోగా విడుదల కాగలదని కూడా తెలుస్తోంది.

## హైదరాబాదులో మరొక చిత్రం

హైదరాబాద్ ఏకైక స్టుడియో "సారథి"తో చిత్ర నిర్మాణం కొనసాగించటానికి రవీంద్ర ఆర్ట్సు ప్రొడక్షన్స్ అనే సంస్థ ప్రయత్నాలు కొనసాగిస్తోంది. ఈ చిత్రానికి పాటలు, మాటలు, కథ : సదాశివబ్రహ్మం వచ్చేనెలలో షూటింగు ప్రారంభం కాబోయే ఈ చిత్రంలో బాలయ్య, దేవిక, హరనాథ్ ప్రభృతులు నటించగలరని తెలుస్తోంది.

* * *

శుభోదయా (ఆదర్శంవారుకాదు) పిక్చర్సు అనే కొత్త సంస్థ "మమకారం" అన్న చిత్రాన్ని సగానికిపైగా పూర్తి చేశారు. రామారావు, రేలంగి, అంజలి ప్రభృతులు నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు : సి. యస్ రావు.

## రంగ ప్రవేశానికి ఎదురు చూస్తున్న చిత్రాలు

ఈనెల్లో ఆంధ్రావని చలన చిత్ర రంగంమీదకు వచ్చిన చిత్రాలుకాక ఇంకా కొన్ని చిత్రాలు ఎప్పుడూ తెరచాటునుంచి వద్దామా అని ఎదురు చూస్తున్నాయి. అఖిలాంధ్ర ప్రేక్షక లోకానికి నయనోత్సవం కలిగించేందుకు ఈక్రింది చిత్రాలన్నీ కనీసం, కొన్నైనా ఒక్క రోజునే విడుదలైనా కావచ్చు కాంతికళావారి "కాంత" కె పి. ఆర్ట్సువారి "కన్న కొడుకు", భరణివారి "బాటసారి" గాయత్రీవారి "కృష్ణ కుచేల" విడుదల ఎప్పుడాని ఎదురు చూస్తున్నాయి. గనుక ప్రేక్షక మహాశయులు జేబులు పదిలపరుచుకోవాల్సి వుంటుంది.

* * *

## వివాహ మహోత్సవాలు

దర్శక, నిర్మాత, రాజ రాజేశ్వరీ ఫిలిమ్సు అధిపతి శ్రీ కడారు నాగభూషణం తమ జ్యేష్ఠ పుత్రిక బి. ఎ. సౌ. కృష్ణవేణిని చి. జి. సత్యనారాయణ (బి యి. ఇంజనీర్ పి. డబ్ల్యు. డి. ఆంధ్ర)కు

అం: తనచి: తవాతప: తిక



'కత్తిపట్టినరైతు'లో పద్మిని.



గీతాపిక్చర్స్ ఋష్యశృంగలో హరనాథ్, రాజసులోచన.

ఇచ్చి వైభవంగా ఈనెల 7 వ తేదీన వివాహం జరిపారు. ఈ సందర్భంలో పురాణ హరికథా, నృత్యాది కాలక్షేపాలు ఏర్పాటు చేశారు.

* * *

చలన చిత్ర—నాటక రంగాల్లో ప్రముఖ నటుడు, (ఈలపాట) కె. రఘురామయ్య తమ కుమార్తె చి. ల. సౌ. వెంకటసత్య కృష్ణప్రసన్నకుమారిని, తోట పార్వతీశ్వరరావుకు ఇచ్చి ఈనెల 7 వ తేదీన వైభవోపేతంగా వివాహం జరిపారు

* * *

# వార్తాభరణం

చరిత్ర ప్రసిద్ధ పరిశోధకుడు మార్కోపోలో భూగోళపర్యటనాన్ని గూర్చి చిత్రం తీయటానికి బ్రిటిష్ చిత్ర నిర్మాతలు ఉబలాట పడుతున్నట్లు తెలుస్తోంది.

సుప్రసిద్ధ చలనచిత్ర నిర్మాత రావుల్ జె. లెవీ, ఈ కథను 'మార్కోపోలో' అన్న పేరుతో చిత్రం తీసేందుకు తన సంసిద్ధతను ప్రకటించాడు. సెప్టెంబరులో షూటింగు ప్రారంభ మవుతుం దని కూడా తెలిసింది.

ఐతే, మార్కోపోలో చైనా యాత్ర ఇందులో ఉండదట. వెనిస్‌ను వదలిన మార్కోపోలో టర్కీ, పాకిస్తాన్, ఇండియా, థాయ్‌లాండ్, హాంగ్‌కాంగ్ పర్యటనలు మాత్రం కథలో ఉంటాయట. ఈ చిత్రంలో ప్రధానపాత్ర నటించేందుకు అలియన్ డెలాన్‌ను, మార్కోపోలో తండ్రిగా నటించేందుకు జీన్ మేరైస్‌ను నిర్మాతలు బుక్‌చేసి, కుబ్లాయిఖాన్ పాత్ర నిర్వహించేందుకు యూల్ బ్రైనర్‌తో బేరాలు సాగిస్తున్నట్లుగా కూడా వార్త.



# ప్రియ బాంధవి

(14 వ పేజీ తరువాయి)

— పిలాగైనా సత్యమూర్తి పిచ్చి పంకల్పుడు! అడివిపాలెంలో ఉన్నంతకాలం అతడు తేయి కాల్చు కోవలసిన అవసరం లేకపోయింది. కానైతే ఆ తరువాత అతడు అడివిపాలెంలో ఉన్నదంతా పట్టుమని నెల రోజులు. మూడు మాసాల క్రితం ప్రారంభమైన కథ ఈ నెల రోజుల్లోనే పతాక స్థాయికి చేరుకుంది.

*　　*　　*

మనసుకు రెక్కలు గట్టుకుని ఆకాశవీథుల్లో విహరించే వివశత్వానికి, సత్యమూర్తికీ చాలా దూరం. అతడు లేమిలో పుట్టి లేమిలో పెరిగాడు. అతని దృష్టిలో జీవితం పూలపాన్పు గాదు. శ్లేశాలకు ఆలవాలమైన దూరప్రయాణం. చదువు, ఉద్యోగం, వివాహం, సంసారం లాంటివి ఆ ప్రయాణంలోని మజిలీలు. ఒక్కొక్క మజిలీ లోనూ ఆగిపోయినట్టు కనిపించి, జీవితం మళ్లీ ముందుకు సాగిపోతుంటుందని సత్యమూర్తి తలపోశాడు.

ఎప్పుడు విన్నాడో సరిగ్గా జ్ఞాపకంలేదు గానీ, పిడినిమిదేళ్ల క్రిందటే సత్యమూర్తి 'ప్రేమ' అన్న మాటను విన్నాడు. సత్యమూర్తి శబ్దకోశం లోకి ఆ మాట దారితప్పిన బాటసారిలా వచ్చి పడింది. ఆ పిమ్మట పుస్తకాల్లోనూ, సినిమాల్లోనూ ఆ మాటకు సంబంధించిన రకరకాల టీకా టిప్పణులను గూడా అతడు విన్నాడు. ఎంతగా విన్నా అది జీవితానికి అవసరమైన సంగతి భావింపలేకపోయాడు సత్యమూర్తి. ఒకప్పుడు అది శ్రీమంతుల విలాసాల్లో ఒక్కటేమో అనుకున్నాడు. మరొకప్పుడు అనేకవిధమైన మనో వికారమైతే కావచ్చు ననుకున్నాడు. వేరొకప్పుడు గురువుచేత విశదీకరింపబడనిదే అవగతం గాని గహనమైన విషయాల్లో అదొక్కటి కాబోలు ననుకున్నాడు. కానీ పంకజం కనిపించిన తరువాత సత్యమూర్తి మొదటి రెండు అభిప్రాయాలనూ ఉపసంహరించుకున్నాడు. మూడో అభిప్రాయాన్ని బలపరుచుకున్నాడు.

మాటలతో గాక మనసుతో, హావభావాలతో గాక హృదయంతో తనకు ప్రేమ పాఠాలు బోధించడానికోసం నియమితురాలైన గురువులా సత్యమూర్తికి సాక్షాత్కరించింది పంకజం!

లేత ఎడదను అమృతంగా కరిగించి తన జీవితపు మరుభూములను సారవంతం చేయడానికి ఉద్యుక్తమవుతున్న పంకజం మనస్తత్వాన్ని మరేమని అర్థం చేసుకోగలడు సత్యమూర్తి! ప్రేమ ప్రతిఫలం కోరదని చెబుతారు. ఈ నిర్భాగ్యుడిలో నుంచి పంకజం ఆశించగలిగిన ప్రతిఫలం ఏముంది గనుక! ప్రేమ గుడ్డి దంటారు. కాకపోతే తన ప్రయోజకత్వం ఏపాటిదో వూహించుకోలేనంతటి లోకజ్ఞానం లేనిదా పంకజం! కావచ్చు. ఇది ప్రేమైతే కావచ్చు కాని ఈ బలహీనతను ఆధారంగా ఉంచుకుని తాను పంకజం కళ్లలో కారం చల్లేడు! తన తాహా తేమిటో తనకు తెలుసు. పంకజం తనకు [illegible] అని తెలుసు.

[illegible]

నొప్పులను పోగొట్టుకొనుటకు

# సారిడన్ వేసుకోండి











## ఒకే బిళ్ల చాలును

ఒక బిళ్ల వెల 12 నయా పైసలు

సారిడన్ నొప్పులకు వెంటనే ఉపశమనము కలిగిస్తుంది. అది మూడు విధములుగా పని చేస్తుంది. నొప్పిని పోగొట్టుతుంది, సేదదేరుస్తుంది, నవోత్సాహము కలిగిస్తుంది. తలనొప్పి, ఒళ్లునొప్పి, పంటినొప్పి, జ్వరముగా ఉండుట, మామూలు అస్వస్థతలు మొదలగు వాటికి సారిడన్ వేసుకోండి. అది త్వరితముగా, నిరపాయముగా మరియు నిశ్చయముగా ఉపశమనము యిస్తుంది. పెద్దవారికి ఒక బిళ్ల పూర్తి మోతాదు. పిల్లలకు ¼ నుండి ½ బిళ్ల చాలును.

'రోష్' తయారీ,

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

[JWT-VT. 2000

న్నప్పుడు, అర్థించకపోయినా మేఘాలు వర్షాలను దిమ్మరించినప్పుడు, ప్రార్థేయపడకపోయినా వెయ్యి రకాల పువ్వులు మధుర సౌరభాన్ని మోసి తెచ్చి మలయపవనం మనసుకు ఉల్లాసం కలిగించి నప్పుడు ఆమె పేరును కృతజ్ఞతాభరంతో సంస్మరించుకో గలడు. కానీ తాను పంకజాన్ని ప్రేమించ లేదు.

జిజ్ఞాస ప్రారంభం కాకూడదు గానీ, ప్రారంభ మైన తర్వాత దానికి సహస్రముఖాలు—తాను పంకజాన్ని ప్రేమించబోవడం లేదనుకున్నాడు. మనసు వెయ్యి అంతస్థుల మేడలాంటిదైతే అందు లోని ఒకానొక పై అంతస్థులో జరిగిన నిర్ణయం యిది. కానీ అట్టడుగు అంతస్థులో ఏర్పడి ఉన్న నిర్ణయం మాటేమిటి! నిద్రలేచిన మరు క్షణం తన తలపులు ప్రసరించే దెవరి మీదకి ? కళ్ళు మూసుకుంటే చాలు, తన మనోవీథిలో ఆనందాల సెలయేర్లుగా పొర్లిపోయే చిరునవ్వు లెవరివి ? ఇటీవలి దినాల్లో తాను పంతకం పెట్ట బోయి 'పంకజం' అని వ్రాసిం దెన్నిసార్లు ? అంతెందుకు! తనలోని 'తాను' క్రమ క్రమంగా హరించిపోతుండగా ఆ ఖాళీ అంతటా పంకజమే నిండి పోతోంది. మరి కొంతకాలానికి 'తాను' పూర్తిగా మిగలడేమో! ముల్లోకాలూ పరివ్యాప్తమైన త్రివిక్రమ స్వరూపంలా తన మానసాకాశమంతటా పంకజమే అలముకుంటుందేమో! ప్రేమించలేదని ఆత్మవంచనకు పూనుకుంటున్నా డేమిటి ? అయ్యో తాను పంకజాన్ని ప్రేమించాడు.

కానీ ఏమాట కామాటే చెప్పుకోడం న్యాయం. సత్యమూర్తి నిర్దోషి. పగను గానీ, ప్రణయాన్ని గానీ కోరికోరి అతడు తన జీవితంలోకి తెచ్చుకో లేదు. అతనితో నిమిత్తం లేకుండా, వాటంతటవే అతని జీవితంలోకి దారి చేసుకున్నాయి.

ఓ రోజు సాయంత్రం పసికుర్రాణ్ణి వెంట బెట్టుకుని దగ్గర్లోనే ఉన్న మామిడితోటలోకి వెళ్ళి మల్లెపువ్వులు కోసి తెచ్చుకుంటూ ఉంది పంకజం. బడితోటకోసం పాదులు త్రవ్విస్తున్న సత్యమూర్తి ఆమెకేసి చూచాడు. ఎన్నడూ లేంది, ఏదో దిగులు ఆమె ముఖంలో పొడచూపుతోంది. మంచినీళ్ళ చెరువులాంటి గుండెలో గుభిల్లుమని రా గుండు పడినట్లయి "అదేమిటి పంకజం! అదోరకంగా ఉన్నావు ?" అన్నాడు సత్యమూర్తి.

"ఎలా ఉన్నాను మేష్టారూ! ఎలా ఉండినా మీకేం నష్టం ?" అంటూ కుర్రాళ్ళు చూడ కుండా నాలుగు మల్లెపువ్వులు అతడి దోసిట్లో వేసి మూసిపెట్టి పసిమి పళ్ళు వెదజల్లుతున్న సూర్యకాంతిలో బరువుగా అడుగులు వేసుకుంటూ పడిచిపోయింది పంకజం.

కుర్రాళ్లను యింటికివెళ్ళిపొమ్మని సూర్యా స్తమించిన తరువాత గూడా కుర్చీలోనే కూర్చుండిపోయాడు సత్యమూర్తి. బయటి చీకట్లతోబాటు, అతని మనసులో ఆలోచనలు ముసురు కుంటున్నాయి. పంకజం తరువాత ఒక్క వంటావిడ తప్పితే ఆ యింట్లో ఆడవా ళ్ళెవ్వరూ లేరు. ఎందుకు లేరు ? ఏమయ్యారు ? అక్కున చేర్చుకుని, అంతరంగాన్ని తవి పెట్టి, ఆద రించడాని కెవ్వరూ లేని ఆ యింట్లో పంకజాని కెలా ప్రొద్దు పోతోంది ? ఆమెకు పెళ్లి చేయా లన్న సదుద్దేశం వెంకటాద్రిగారి కింకా ఎందుకు కలుగలేదు ?

ఆరోజు రాత్రి కారియర్ తీసుకెళ్ళడాని కోసం వచ్చిన రంగమ్మ ద్వారా సత్యమూర్తి సందేహాలకు సమాధానాలు లభించాయి. పంకజానికి చిన్న ప్పుడే తల్లి చనిపోయింది. వెంకటాద్రిగారు మళ్ళీ పెళ్లి చేసుకున్నారు. పంకజం పిన్నమ్మ పన్ని రాచ పోకిళ్ళ. బజార్లకూ, సినిమాలకూ నోచుకోలేని అడవిపాలెం బ్రతుకు ఆమెను తనలో యిముడ్చు కోలేక పోయింది. ఆమెకోసం వెంకటాద్రిగారు పట్టణంలో ఒక కాపురం పెట్టక తప్పలేదు.. ఆమె పిల్లలకోడి! ఆ పిల్లలు మూసిన ముత్యాలు, పసిడి పగడాలు. వీళ్ళ నెత్తికొమ్మెక్కినకొద్దీ అతి గారాభం చేస్తూ వాళ్ళు కోరగానే కొండమీద కోతుల్ని పట్టి తెప్పించడం మినహా, ఆమెకు మిగి లిన ప్రపంచం పంగతి కాబట్టదు. కానీ వేసవిలో పూటకి వెళ్లినట్టు, అడవిపాలానికి వచ్చి మకాం వేసినప్పుడల్లా ఆమె పంకజాన్ని అత్తగారిలా ఆరడి పెట్టి, ఉత్తమ గృహిణిగా తరిబీదు యివ్వడలుచు కోడంలో అంతర్యం లేకపోలేదు. ఆమెగారికో తమ్ము డున్నాడు. కారణం ఏదైతేనేమి ముప్పై మూడేళ్ల వయసొచ్చినా అతడి కింకా పెళ్లి కాలేదు చిగుళ్ళు బాగా కనిపించేటట్టు పైకి లేచిన పెద వుల మధ్య బంగారపు పన్నుతో సహా అతడు పళ్లికిలిస్తే, జడుసుకుంటుంది పంకజం. ఈ భీత హరిణాన్ని తీసుకెళ్లి ఆ కుమార రాజాకు కట్టబెట్టా లన్నది పిన్నమ్మగారి ప్రయత్నం.

"అదైనా బిడ్డ బ్రతికి బాగుపడాలనిగాదు బాబూ! చిన్నమ్మగారికి తల్లి మూలంగా వచ్చిన పొలాలేవో ఉన్నాయి. తమ్ముడికి పిల్లనిస్తే, ఆ వున్నదేదో ఉమ్మడి సొత్తుగా ఉండిపోతుందని! అక్కడ అమ్మగారు తలపెట్టారేమో, ఇక్కడ అయ్యగారు కూడా అమ్మాయికి పెళ్లి చేసేయా లన్న కలవరంలో పడ్డారు ...."



"ఇల్లు గడపటంతప్ప మీరు మహా చేస్తున్న దేమిటి ?"

రంగమ్మ వెళ్లిపోయింది.

సత్యమూర్తి కారోజు రాత్రి యించుమించు జాగరణగానే గడిచిపోయింది.

రోజులు గూడా గడిచిపోసాగాయి. ఉదయం పది పదకొండు గంటలప్పుడు కడవ చంకన పెట్టుకుని రంగమ్మ మంచినీళ్ళకోసం బయల్దేరు తుంది. ఆ కడవలో కారియర్ ఉంటుందని ఎవరికి తెలుస్తుంది ? సత్యమూర్తి రెండు పూటలా భోజనం చేస్తున్నాడు. ఇప్పు డతనికి భోజనం ఒక సమస్య గాదు. అసలు బ్రతుకే ఒక సమ స్యగా రూపొందగా, ఆ జటిల సమస్య ఎదుట చేష్టలు దక్కి నిల్చున్న కింకర్తవ్యతా విమూఢుడు సత్యమూర్తి! అతడికోసం కాలం ఎందుకు ఆగు తుంది ?

ఓరోజు హటాత్తుగా ప్రశ్నించింది పంకజం— "అమ్మ నెప్పుడు తీసుకొస్తారు?" అని.

గొంతుకలో వెలగకాయ పడినట్టయింది సత్యమూర్తికి! తల్లిని తీసుకరాబోవడం లేదు సరి గదా, ఎప్పుడో ఒకప్పుడు తను గూడా అడివిపాలెం నుంచీ పలాయన మంత్రం పఠించవలసి రావచ్చు.

ఉన్నట్టుండి తను మాయమైపోతే ఏమను కుంటుంది పంకజం?

వేరొకసారి "నన్నొకసారి మీ వూరికి తీసు కెళ్తారా మేష్టారూ" అంది పంకజం.

సత్యమూర్తి తలక్రిందులైపోయాడు. అయినా అంతలో తమాయించుకొని పంకజం తమాషా కడిగిందేమోనని సరిపెట్టుకుని తను గూడా తమాషా గానే బదులిచ్చాడు—

"దానికేం పంకజం! ఇప్పుడు బయల్దేరినా తీసుకెళ్ళడానికి సిద్ధమే!"

పంకజానికి నమ్మకంలేదు! 'నిజంగానా?' అని ప్రశ్నిస్తున్న చిలిపి కళ్ళతో ఆమె సత్యమూర్తి కేసి చూస్తోంది.

తన దౌర్బల్యాన్ని తలచుకుని కించపడిపోతూ తలవంచుకున్నాడు సత్యమూర్తి.

ఎండకాలంలో ఏటి యిసుక దిబ్బల మధ్య ఆగలేక, వేగంగా సాగలేక మెల్లగా కదులుతున్న నీటి పాయలా, కాలం మందగమనాన్ని సాధన చేస్తోంది.

ఇలా వుండగా ఆ రోజు రానే వచ్చింది.

ఆ రోజు! అదే కథలో చివరి రోజు!

మామూలు మేరకు మధ్యాహ్నం బడివదలి పెట్టి యింటికి తిరిగి వచ్చాడు సత్యమూర్తి. నిర్దిష్టమైన రహస్య స్థలంలో కారియర్ కనిపించ లేదు. ఈపాటి కెప్పుడో రావలసింది కారియరు. ఈరోజు అదిగ్గైర్ హాజరు కావడానికి కారణమేమై వుంటుందో సత్యమూర్తికి బోధపడలేదు.

తల్లి స్వగ్రామానికి వెళ్ళిన రోజున సత్య మూర్తి ద్రవాహారమైనా పుచ్చుకున్నాడు. ఈనా టికీ లేదు. ఆకలి మాట దేవుడెరుగు, ఏదో అనుమ గాన్ని శంకించాడు సత్యమూర్తి. వెం రోజుల






రివాజుకు విరుద్ధంగా ఈనాడు భోజనం రాలేదంటే యిందుకు బలవత్తరమైన కారణం వుండకపోదు.

ఏమిటది? ఏమై వుంటుంది?

పరిపరి విధాలుగా అల్లుకపోతున్నాయి సత్యమూర్తి వూహాలు సాయంత్రమవుతున్నకొద్దీ ఎండలు చల్లబడిపోయాయిగానీ వేడెక్కిపోయిన సత్యమూర్తి బుర్ర మాత్రం అత్యధిక ఉష్ణమానాన్ని ప్రకటిస్తున్న జ్వరమాపకంలా అలాగే వుండిపోయింది తల నొప్పితో కణతలు బద్దలై పోతున్నాయి అంతరాంతరాల్లో అవ్యక్తంగా వుంది ఒక్కుమ్మడిగా వెలికివచ్చి మానవుణ్ణి చుట్టుముట్టే భయం ఎలాంటిది? అది ఆశ్రయంలేని చోట కుంభీపాతంగా కురిసే జడివానలా మనిషికి దిక్కులు దోచనివ్వదు. అది కిటికీలులేని యిరుకైన గదిలో ముమ్మరంగా వ్యాపిస్తున్న ముంత పొగలా వూపిరాడనివ్వదు

ప్రొద్దుపోయి చీకటి పడింది. గాలికి దీపం ఆరిపోకుండా తలుపు బిగించి, ముసుగు బిగదన్నుకుని దీపజ్వాలలోకి దూకుతున్న శలభంకేసి చూస్తున్న సత్యమూర్తి తలుపు నెవరో తడుతున్నట్టు తోచి తృళ్ళిపడ్డాడు తలుపు తీస్తుండగా అతడి చేతులు కంపించాయి.

కఠోరంగా తపస్సు చేసిన తర్వాతగానీ యిష్ట దైవం ప్రత్యక్షంగాదు!

"ఏం జరిగింది పంకజం? ఇప్పుడొచ్చావేమిటి? రంగమ్మ ఏమైంది?" ప్రశ్నలు కురిపించాడు సత్యమూర్తి.

"చెబుతానుగానీ మీరు మొదట భోజనం చేయండి మేష్టారూ" అంది పంకజం

"చెప్పు పంకజం! నాకు మతి పోతోంది నా మట్టుకు నేనేమైనా నాకు చింతలేదు. నేను నిన్ను గూడా వూబిలోకి లాగుతున్నట్టున్నాను చెప్పవా పంకజం! ఏం జరిగింది?"

"మీరు భోజనం చేయరా మేష్టారూ?"

మంకుపట్టు పట్టుకున్న కుర్రవాడిలా సత్యమూర్తి పంకజం మాటను పాటించాడు ఆవురావురంటున్న ఆకలి యెదుట కారియర్ గిన్నెలు ఖాళీ అయిపోతున్నాయి.

"రంగమ్మ వెళ్ళిపోయింది మేష్టారూ! పనిలో నుంచి తీసివేశారు నాన్నగారి మనసులో ఏముందో తెలియదు. తెల్లవారగానే రమ్మన్నారు. ఈరోజునుంచి పని చాలించుకోమన్నారు నన్ను కన్నతల్లిలా చూచుకునేది మేష్టారూ! ఆవిడ గూడా వెళ్ళిపోయింది" సత్యమూర్తికి కన్నీళ్ళు కనిపించకుండా నేలవైపు చూస్తోంది పంకజం.

"అలాగైతే నువ్విప్పుడెందుకొచ్చావు పంకజం? ఇలా జరుగుతోందని మీ నాన్నగారు పసిగట్టేశారేమో!" భయకంపిత స్వరం సత్యమూర్తిది

"మీరేమైనా ఋషీశ్వరులా మేష్టారూ, మీకు ఆకలి వేయదూ?"

ఆక్షణాన సత్యమూర్తికి కనిపించిందేమిటి? పంకజం సజలనయనాల్లో తళతళలాడుతున్న అమాయకత్వం. అదేం చేసింది? తెచ్చికోలు సంస్కారాలను పుటుక్కున త్రెంపి సత్యమూర్తికి ఒక్క నిమిషంపాటు అచ్చమైన మానవత్వాన్ని ప్రసాదించింది. సత్యమూర్తికి తాను

కోజనం చేస్తున్న సంగతి గుర్తులోలేదు అతడు రెండు చేతులతోనూ పంకజాన్ని దగ్గరకు తీసు కుని "ఎలా సాధ్యమవుతుంది పంకజం? ఎలా వదులు కోగలను నిన్ను! ఎవరివి నువ్వు! ఎన్ని పూర్వజన్మల అనుబంధానివి నువ్వు" అంటూ గాఢంగా గుండెలకు హత్తుకున్నాడు

అయిదునిమిషాలవరకూ సత్యమూర్తి ఒడిలో నుంచి లేవాలన్న స్పృహలేదు పంకజానికి

దూరాన ఎక్కడో ఓ గుడ్లగూబ ప్రశాంత వాతావరణంపైన నిప్పులుమిసినట్టుగా ఘూకారం చేస్తోంది

తటాలున లేచికూర్చుంది పంకజం "నా కెందుకో భయంగావుంది మేష్టారూ! ఏం జరుగు తుందో చెప్పలేను అంతా అయోమయంగా వుంది. మీరు జాగ్రత్తగా వుంటారా మేష్టారూ?" హెచ్చ రిస్తూ లేచి నిల్చుని రెండడుగులువేసి ద్వారం గుండా అవలికి చూచింది పంకజం చూస్తున్న పంకజం ముఖంలో ఓ భయవిచిక రివ్వున సుళ్ళు తిరిగింది "చూచారా మేష్టారూ! మేడపైన దీపం వెలుగుతోంది నేను వచ్చినప్పుడు దీపంలేదు నాన్నగారు నిద్రపోయివుంటారనుకున్నాను జాగ్ర త్తగా వుంటారుగదూ" చీకటిలో అదృశ్యమై పోయింది పంకజం.

తలుపు మూసి గడియ వేసుకుంటే ఆపదలు దరిజేరవన్న నమ్మకమేమీలేదు అయినా సత్యమూర్తి గడియ వేసుకున్నాడు పడుకున్నంత మాత్రాన నిద్ర పట్టదని సత్యమూర్తికి తెలుసు అయినా పడు కున్నాడు ఉండి ఉండీ పంకజం హెచ్చరిక అతడి చెవుల్లో ప్రతిధ్వనిస్తోంది అపాయం ఎలా వుంటుంది? ఏవిధంగా వస్తుంది? ఏం చేస్తుంది ప్రశ్నల సంఖ్య పరిమితమేగానీ జవాబులు మాత్రం అసంఖ్యాకంగా స్ఫురిస్తున్నాయి

కాళరాత్రి తలవిరబోసుకున్న జడల దయ్యంలా పుడమితల్లి గుండెలపైన కూర్చుంది ఊరవతలి మోదుగ చెట్ల దిబ్బల్లోనుంచీ గుంట నక్క లరు స్తున్నాయి సత్యమూర్తి పాలిటికి పంకజం వెళ్ళి పోయిన తర్వాత కొన్ని యుగాలు గడచిపోయినట్టు న్నాయి. చూరుల సందుల్లోనుంచీ చలి గాలి వీస్తోంది. అర్ధరాత్రి తరువాతగానీ చలిగాలి ప్రారంభంగాదు. ఐతే మూడో జాము జరుగుతోం దన్నమాట!

విషభుజంగాలు సంచరించేచోట నడుస్తున్న మని షికి ప్రతి ఎండుటాకుల కదిలికా కంపరం కలిగిం చడం సహజమే! సత్యమూర్తి లేచి కూర్చున్నాడు సవ్వడి స్పష్టంగా వినిపిస్తోంది భ్రమనుకోడానికి వీల్లేదు నీరవనిశీథాన్ని చీల్చుకుంటూ పాదరక్షలు టక టకలాడిన చప్పుడు .

చివరకు అనుకున్నంతా అయింది అపాయం తానే వచ్చింది తలుపు తట్టనే తట్టింది.

సత్యమూర్తి తలుపు తెరిచేశాడు

ఒకదానివెనుక ఒకటిగా రెండు మానవాకారాలు చీకటిలో రేఖామాత్రంగా కనిపిస్తున్నాయి.

పోల్చుకోడంలో ఒకటి రెండు క్షణాలు గడిచి పోయాయి

ఎట్టయెదుట నిల్చున్న వ్యక్తి పెద్ద పాలేరు నరసింహాలు అతడి వెనుక సాక్షాత్తుగా వెంక టాద్రిగారు!

"బయటికి తప్పుర్రా నరసింహాలూ!"



POND'S
DREAMFLOWER TALC
DREAMFLOWER TALC
POND'S
DREAMFLOWER TALC
DREAMFLOWER TALC

# ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదవండి!

లను, మానవులయినా మాత్రమే చేయగలిగినా మాట
లను, అనుభవంవల్ల అర్థం చేసుకోవడం జంతు
కోటికి—బాగా పరిణతి పొందిన జంతుకోటికి సహజ
మయిందని తెలుస్తున్నది.

విజ్ఞానశాస్త్ర మానవులువలెనే, తండ్రులు కలిగి పక్షులలో ప్రజాపతి తోడలు గుర్తుకుంటే కలిగారో తెలియదు. కాని స్త్రీ, పురుష విభేదం పొందిన మానవులు మాత్రం అల్పశ్రేణి జంతువులనుండి పరిణతిపొందిన జంతు శ్రేణులంటానికి మాత్రం కావలసినంత సాక్ష్యం వున్నది.

ఈ జంతు శ్రేణులు ఏర్పరుచుకున్న భాషలు వివిధ ప్రాంతములలో వివిధ ధ్వనులు కలయికవల్ల ఏర్పడినమాటలయినా, అన్ని ప్రాంతములవారి భాషలోనూ కొన్ని శబ్దములు విధిగా వుంటవి. ఆ శబ్దములు అచ్చులని, హల్లులని రెండు విధ ములుగా వుంటవి.

ఒక జీవి మరొక జీవికి తన మనోగతాభిప్రాయ ములు తెలియజేయడానికి అవసరం కలగంగానే, అందుకు ఒక శబ్దమయినా చేయాలి. లేదా తన అవయవములతో దానికి తెలిసే విన్యాసమయినా చేయాలి. ఆ కంఠావయవ విన్యాసములే భాషాభి వయనములు.

ఆ అవసరంవల్ల ప్రప్రథమంలో ఉత్పత్తి అయిన శబ్దాలన్నీ అంగిలిలోనే ఉత్పత్తి అయివుంటవి. అల్లా అంగిలిలో ఉత్పత్తి అయిన శబ్దాలే అచ్చులు అనిపిస్తుంది. ఇవన్నీ నోరుతెరచి, నాలుక వెనుక భాగ మును ఒక స్థితిలోవుంచి, గాలిని శబ్దారజ్జువుల ద్వారా బలంగా పంపితే ఉత్పత్తి అవుతవి. అచ్చు లలో అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఇల్లా పుట్టినవే. ఋ ౠ ఌ ౡ లు నాలుక చివరను పై దంతములవద్ద వుంచినప్పుడుఉత్పత్తి అయ్యేశబ్దములు. కాని వాటిని అచ్చులలో ఎందుకు చేర్చారో అర్థం కాదు ఈ పై అక్షరములను ఉచ్చరించడానికి నోరు తెరిచివుంచాలి. ఆ అక్షరమును ఉచ్చరిస్తూ నోరు మూస్తే ఆ గాలి అంగిలిని నింపి కొంత ముక్కు రంధ్రముల ద్వారా బయటికివచ్చి 'మ్' శబ్ద

# మనము-మనదేహస్థితి

(15వ పేజీ తరువాయి)

వుతుంది. అచ్చులతో దేనిని వుచ్చరిస్తూ నోరు మూసినా 'మ్' శబ్దం ఆ పూర్వ శబ్దాన్ని అనుస రిస్తూ వస్తుంది.

మాటలురాని పసిపిల్లకు అన్నం పెట్టడానికి నోరు తెరవమంటానికి అఁ అఁ అంటాము. ఆ మాట అంటూ, ఆ బిడ్డ నోరు తెరుస్తాము. కొంత కాలానికి ఈ శబ్దంచేస్తే నోరు తెరవాలని బిడ్డ తెలుసుకొంటుంది. అల్లా తెరుచుకుంటే నోట్లో ఆకలితీర్చే రుచివున్న ఆహారం పడుతుందని అనుభవంవల్ల తెలుసుకుంటుంది. మానవుల ఆది భాషలో శబ్దాలన్నీ అచ్చులతోనే పరిమితమై వుండి వుండాలనితోస్తుంది. కాలక్రమాన జంతువులు చేసే శబ్దాలనూ, పక్షులుచేసే శబ్దాలనూ అనుక రించగా మిగతా శబ్దాలు ఉచ్చరించడం మానవులు నేర్చుకుని, తమ తరువాత వారికి అనుకరణలు నేర్పివుంటారనిపిస్తుంది. కాకిలాగా కా కా అనాలని, కోయిలలాగా కో కో అనాలని, కోహో అనాలనీ, చిలుక పిట్టలాగా తూతూ అనాలనీ, ఆవులాగా అంబా అనాలనీ మానవుడు ప్రయత్నించినప్పుడు నాలుకను అనేక స్థానములలో వుంచి చూచి ఏ స్థానంలో ఆ శబ్దం ఉత్పత్తి అవుతున్నదో జ్ఞప్తి వుంచుకొని వుంటాడు కొన్నాళ్లకు కొన్ని శబ్దాలు మాత్రం ఉచ్చరించవచ్చుననీ, ఇతర శబ్దాలు తన నోటితో రావనీ గ్రహించివుంటాడు. అరవంలోళ సన్నిహితము మయిన శబ్దం యితర భాషలలో కనిపించదు. ఏమయినా ప్రపంచంలో ఏ భాషలోనయినా శబ్దాలు 56కి మించివుండవు.

మునివారు, శబ్దాలు తాండవ సమయంలో శివుడు డమరుకంమీద ఉత్పత్తి చేసిన ధ్వనులను, ఋషులు విని నేర్చుకుని తరవాత వారికి నేర్పారంటారు. మరికొందరు మానవులు పక్షులను అనుకరించారంటారు. అంటే మానవులకంటే పక్షులు ఎక్కువ శబ్దాలను ఉచ్చరించివుండేవన్న మాట. అప్రయత్నంగా ఉచ్చరించగలిగిన శబ్దములు అచ్చుల శబ్దములు. భాష, ప్రారంభమును గురించి, శబ్ద ప్రారంభమును గురించి అనేకులు అనేక అభిప్రాయములు చెప్పివుంటారు. కాని ఏదీ సంతృప్తికరమైనదిగాలేదు. న్యూటన్ పండితుడు తన రెండవ సూత్రంలో సంభావించిన 'అన్యశక్తి' (Externalforce) అదిశక్తియైన దేవ సృష్టిలోకర్మ జరపడానికి కారణమైనశక్తి అది శబ్దసముదాయాన్ని కూడా సృష్టించి మానవులు తమ వాకచక్యంతో అన్య శబ్దములను వాటి కలయికవల్ల భాష సంగీతాదులను ఏర్పరచు కొనేటట్లు చేసిందేమో చెప్పలేము. ఆ ఆదిశక్తి అదిశక్తియే శబ్దసృష్టియేమో? ఏమయినా అవసర మునుబట్టి మానవులు సృష్టించుకున్న వస్తువు లనూ వారు చేసే పనులనూ, అభివర్ణించడానికి ఆ యా ప్రాంతములవారు, కొన్ని శబ్దములను చేర్చి మాటలు నిర్మించుకున్నారు. నాగరికత పెరిగిన కొద్దీ అవసరములూ, వస్తువులూ, చర్యలూ, వాటిని వర్ణించే మాటలూ అధికమై ప్రతి జాతివారికీ వాచ్యమూ, శ్రవ్యమూ, దృశ్యమూ అయిన అపార పదజాలం భాషారూపంలో యేర్పడింది. ఈ మాట లలో కొన్నింటినయినా ప్రతివారూ ఒకే విధంగా ఉచ్చరించగలిగివుండాలి. లేకపోతే వారి గోడు ఇతరు లకు అర్థంకాదు. సంఘ జీవితంలో వారికి చాలా నష్టము యేర్పడుతుంది. నలుగురిలో వారు నవ్వులపాలు అవుతారు. ఉనికికోసమై వారు చేసే కృషిలో విఫలులైపోతారు. మాటలురానివారు అన్నంతినవచ్చు. పెళ్లి చేసుకోవచ్చు. పిల్లలను కన వచ్చు. కాని వారి జీవితం సర్వ పుష్కలమైన నాగరిక జీవితంగా వుండదు.

వచ్చేవారం మాటలాడడంలో వుండే కొన్ని సాధా రణ లోపాలనూ, వాటి కారణాలనూ నివారణోపా యాలనుగురించి చర్చిస్తాము. ★

MILLNER
RAYACHOTI

-చిత్రకారు: ఎ. టి. మిల్నర్ (రాయచోటి)

# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

వంతమైన వారసులు ఏర్పడటం శ్రీ నెహ్రూకి ఇష్టంలేదు. ఈ విషయంలో ఆయన మహాత్మా గాంధి పద్ధతికి (తనంతటి వారసులను శ్రీ నెహ్రూతో సహా తయారు చేయటం) పూర్తిగా భిన్నం అట్లా అని తానేదో 120 ఏళ్ళు బతుకు తాననీ చెప్పటంలేదు తనకున్న ఇంధనాన్ని రెండు పక్కల నించి ఖర్చు చేస్తున్నానని తెలిసే ఆయన తన తరువాత వారసుని విషయంగాని, తనంత వాళ్ళగా ఒకటి పరిగణించేందుకు గాని అనిష్టంతు కుంటారు పైగా ఎవరన్నా ప్రధాన మంత్రి తరువాత వారసుణ్ణనుకుంటే, వాణ్ణి నిష్కర్షగా అణచివేయటం జరుగుతోంది.

కొంతకాలం క్రిందటిదాకా శ్రీ మొరార్జీ దేశాయి నెహ్రూ తరువాత భారతప్రధాన మంత్రి అవుతారని అనుకున్నారు. ఉపనాయక ఎన్నిక విషయంలో నెహ్రూ మంత్రాంగం ఏమి టంటే ఒకే దెబ్బతో మొరార్జీ, జగజీవన్‌రామ్ (పాపం ఈయన ప్రధాని పదవికి పగటే కలలు కంటున్నారు) లను అణిచివేయటం ఉపనాయకత్వానికి ప్రధానమంత్రి పదవికి లంకె లేదని (శ్రీ జగజీవన్‌రామ్) కాంగ్రెసు పార్టీకి చెప్పినట్లు కూడా తెలుస్తోంది.

ఇంతవరకు అందిన పత్రికల వార్తలను బట్టి (ఈ వార్తలను ఎవరు ఖండించలేదు సుమండీ !), ప్రధాన మంత్రి, ఉపనాయకుని ఎన్నిక నిర్ణీతమైన రోజునే జరగాలని చెప్పినట్లు తెలుస్తోంది. అయితే పదవికోసం లాబీలల్లో ప్రచారం చేసుకోటం ఆయన నిరసించారు. ఈ ప్రచారం పట్ల తమ వైముఖ్యాన్ని శ్రీ కృష్ణమీనన్‌కు చెప్పారో లేదో ఇంకా తెలీదు. ఏది ఏమైనా, ప్రధాన మంత్రి మూడు రోజుల క్రిందటి దాకా ఉపనాయకుని ఎన్నిక పట్ల సుముఖంగ ఉన్నారనేది, ఆయన వైముఖ్యాన్ని ఎదిరించకుండానే ప్రచారం నిర్నిరోధంగా జరుగుతున్న దనేది మాత్రం నూటికి నూరుపాళ్ళు నిజం.

సరిగ్గా ఈ సమయంలోనే ఢిగాలిజం లోపలికి (కాంగ్రెస్) ప్రవేశించింది. కాంగ్రెస్‌పార్టీ సమావేశాల్లో ఒకదాంట్లో, సభ్యులందరు తమ ఓటు హక్కును వదులుకొని, ఉపనాయకుని తామే నియమించవలసిందిగా ప్రధాన మంత్రిని అర్థించారు. కనుక, పాపం ప్రధాన మంత్రి ఉపనాయకుని నియమించేందుకు వీలైతే యీ విషయాన్ని వచ్చే పార్లమెంటు సమావేశం వరకు వాయిదా వేసేందుకు అధికార మిచ్చిన కాంగ్రెసు పక్షంతు తమలో గల విశ్వాసాన్ని తెలియజేసే ఒక తీర్మానం ముసాయిదాను తయారు చేశారు అంటే, మొన్న మొన్నటిదాకా ఉపనాయకుని ఎన్నిక జరపాలను కున్న ప్రధాన మంత్రి తమ అభిప్రాయాన్ని మార్చుకుని ఇప్పుడీ ఎన్నికల వాయిదా పట్ల సుముఖత చూపిస్తున్నారన్నమాట—ఇదీ, దీని తాత్పర్యం. మళ్ళీ, కొంతకాలం తర్వాత ప్రధాన మంత్రి లోక్‌సభకొకరు, రాజ్యసభకు ఒకరువేరసి ఇద్దరు ఉపనాయకు లుండాలని ప్రతిపాదించారు. ఇక్కడా ప్రధాన మంత్రి తొందరపడ్డారులెండి. అసలాయన ఇలా గాకుండా మహమ్మదీయుల నుంచీ, సిక్కుల నుంచీ నిమ్నజాతుల నుంచీ, క్రైస్తవుల నుంచి ఒక్కొక్కర్నిగా అమాంబాపతూ నలుగుర్నయినా ఉపనాయకులుగా ఉండేందుకు కోరాల్సింది.

అసలిలా చేసినందువల్ల ఒక లాభముంది దీని వల్ల మొరార్జీని దూరంగా ఉంచేందుకు, కాంగ్రెస్ కార్యవర్గాన్ని పూర్తిగా అల్పసంఖ్యాక ప్రతినిధుల మయం చేసేందుకు మహ చక్కగా వీలయ్యేది. తాము ఢిగాలీగా మారితే తప్ప ప్రధాన మంత్రి పోటీని నివారించలేరు ఉపనాయకుల్ని నియామకం చేసే అధికారం పార్టీ ఆయన కిచ్చినందువల్ల ఆయన ఢిగాలీ కాకాతప్పదు రాజ్యసభకు ఎవర్ని ఉపనాయకులుగా నియమించాలనేది తేలిపోయింది. శ్రీ హాఫీజ్ ఇబ్రహిం నియామకం జరుగుతుంది. ఇక, రెండో స్థానానికి అనగా లోక్‌సభకు ఈ విషయంపై తమ బుద్ధి తోస్తున్న విషయాన్ని కూడా ప్రధాని వెల్లడించారు. వచ్చే ఎన్నికల్లో ఇంకలోక్ సభకు రాకూడదనుకుంటున్న డా. సుబ్బరాయన్ ప్రధాని మనసులో ఉన్న వ్యక్తి అంటే మన ప్రధానికి, మొరార్జీపట్ల సుముఖత లేకపోలగాని, చ్చుజగజీవన్‌రాం పట్ల ఖచ్చితంగా ఇష్టంలేదు అని చెప్పుకోవచ్చు.

ఈ శిభవట్నలో ఏ లాభమూ లేకుండా బయట పడింది ఒక్క శ్రీకృష్ణమీనన్ మాత్రమే ఈయన మొరార్జీ ఉపనాయకత్వాని కేమో అవరోధంగా నిలిచాడు జగజీవన్‌రాం అంటే పెద్ద ఇష్టమూ లేదు. వారు పూర్తిగా మొరార్జీ వ్యతిరేకులు

ఇదీ, మన ప్రధాని మంత్రిమండలిలో ఉన్న ఐక్యత.

* * *

ఈ వారాంతంలో ముగుస్తున్న పార్లమెంటు బడ్జెటుసమావేశాన్నిఒక్కసారిసింహావలోకనంచేద్దాం.

కేంద్రమంత్రివర్గం విధానంలోనే గాక, బడ్జెటు అంచనాల ఆమోదంలో కూడా బ్రిటిష్ వారి పద్ధతుల్లో, వలసతత్వంతోనైన యుద్ధం సాగుతోంది. ఆంగ్ల ప్రభుత్వం తన హాయాములో బడ్జెటు అంచనాలపై సామాన్యమైన చర్చ జరిపి పద్దులు ఓటింగు పద్ధతిన ఆమోదించటమనే సాంప్రదాయాన్ని ప్రవేశ పెట్టింది. ఆ కాలంలోనే ఖర్చులను అదుపు చేసేందుకు కొంత ప్రయత్నం కూడా జరిగింది స్వాతంత్ర్యలబ్ధి తర్వాత కూడా వెనకటి మాదిరిగానే బడ్జెటు పద్దులపైన ఏవో కొన్ని ముఖ్య విధానాలపైనా పరిపాలన పద్ధతులపైనా చర్చ జరపడం పరిపాటైంది. కాని, ఆర్థిక విధానంపై దెబ్బతీస్తున్న వ్యయం అదుపు ప్రయత్న మేమి జరగటంలేదు.

తమ బడ్జెట్ ప్రతిపాదనల ప్రభావం జీవన వ్యయం మీద ఏమీ లేదని ఆర్థిక మంత్రి తమ శాఖ అందచేసిన అంచనాలు ఆధారంగా ప్రకటించారు. అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థతో ధరలు పెరుగుట తప్పదని, అపాటి పాండిత్యమే ఉన్న [illegible] ఆర్థిక [illegible] మరో [illegible] ప్రకటించారు. ★

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor : S. Sambhu Prasad,

# ఇప్పుడు

# బ్రూక్ బాండ్ టీ

## మెట్రిక్ తూకపు ప్యాకెట్లలో లభిస్తున్నాయి













ఇప్పటి నుండి బ్రూక్ బాండ్ టీ ప్యాకెట్లు పైని తెల్పిన 500 గ్రాములు, 250 గ్రాములు, 100 గ్రాములు, 50 గ్రాముల మెట్రిక్ తూకాలలో లభించును. ఇవి ఇంచుమించు 1 పౌను, ½ పౌను, ¼ పౌను, ⅛ పౌన్సుల పూర్వపు ప్యాకెట్ల తూకానికి సమానం.

మామూలుగా మీరే బ్రూక్ బాండ్ టీ ప్యాకెట్‌ను కొంటారో మీ దుకాణదారుతో చెపితే దాదాపు దానికి సమానమైన మెట్రిక్ తూకపు ప్యాకెట్టును మీకు యిస్తారు. గుర్తుంచుకోండి: తూకంలో మార్పువచ్చినా బ్రూక్ బాండ్ టీ నాణ్యతలో కాజాదనంలో ఏలాంటి మార్పులు లేవు.

## మీ ప్రియమైన

# బ్రూక్ బాండ్ టీ



## మెట్రిక్ తూకాలలో కొనండి

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

JWTBB 379

